

# వెంటనే ప్రేమలో పడ్డాను

## -లారెస్సా బొనేసి

పరదేశీ అమ్మాయిలు దక్షిణాది సినిమాల్లో నటించడం కొత్తేమీ కాదు. కాకపోతే లారెస్సా బొనేసి విషయంలో మాత్రం ఓ ప్రత్యేకత ఉంది. ఆమె లుక్స్ చూడడానికి దక్షిణాది అమ్మాయిని తలపిస్తాయి. లారెస్సాను చూస్తే ఎవరూ బ్రెజిల్ మోడల్ అనుకోరు. ఆమె ముఖంలో తెలుగుతనం అంతగా ఉట్టిపడుతూ ఉంటుంది. టాలీవుడ్‌లో కొందరు హీరోయిన్లు సంవత్సరాల తరబడి సినిమాలు చేస్తున్నా పట్టుమని పది తెలుగు పదాలు కూడా మాట్లాడలేరు. కానీ లారెస్సా అలా కాదు. తొలి సినిమా 'తిక్క' కోసం ట్యూషన్ పెట్టించుకుని మరీ తెలుగు నేర్చుకుంది. ఈ సినిమా కోసం భాషతో పాటు తన బాడీ లాంగ్వేజ్‌ను కూడా మార్చుకున్నానంటున్న లారెస్సా బొనేసితో...

---

### నా గురించి....

నేను బ్రెజిల్ అమ్మాయినే అయినా మోడలింగ్ కోసం అక్కడి నుంచి వచ్చేసి చాలా సంవత్సరాలు అయింది. నా 13వ ఏట నుంచి మోడలింగ్ చేయడం మొదలెట్టాను. దాదాపు పది సంవత్సరాలుగా పలు ఉత్పత్తులకు మోడలింగ్ చేశాను.

### ఈ సినిమాలో అవకాశం ఎలా...

టెలివిజన్‌లో ఓ యాడ్‌లో నన్ను చూసిన 'తిక్క' నిర్మాతగారు నన్ను అప్రోచ్ అయ్యారు. నా లుక్స్ దక్షిణాది అమ్మాయిలాగా ఉండడంతో ఈ సినిమాకు నన్ను ఎంపిక చేశారు. కథ చెప్పినప్పుడు అంజలితో వెంటనే ప్రేమలో పడిపోయాను. ఈ సినిమాలో నా క్యారెక్టర్ పేరు అంజలి. రియల్ లైఫ్‌లో ఎలా ఉంటానో అంజలి పాత్రలో కూడా అలానే కనిపిస్తాను. భాష గురించి ఆలోచించకుండా ఈ సినిమా చేయాలని గట్టిగా నిర్ణయించుకున్నాను. నేను విదేశీ అమ్మాయిని అని చూడకుండా దర్శకనిర్మాతలు నా మీద నమ్మకంతో ఈ అవకాశం ఇచ్చారు. వారి నమ్మకాన్ని వమ్ము చేయలేదనే అనుకుంటున్నాను. ఈ సినిమాలో చిన్నపాటి ఫైట్ కూడా చేశాను.

### భాష ఇబ్బంది పెట్టలేదా?

ఈ సినిమా ఒప్పుకోగానే ఓ తెలుగు ట్యూటర్‌ని పెట్టుకున్నాను. ఆమె దగ్గర పట్టుపట్టి తెలుగు నేర్చుకున్నాను. షాపింగ్‌కి వెళ్ళినా, సినిమాకి వెళ్ళినా ఎక్కడికి వెళ్ళినా అక్కడ తెలుగు అమ్మాయిలు ఎలా మాట్లాడతారు? ఎలా ప్రవర్తిస్తారు? అన్నది నిశితంగా గమనించేదాన్ని. వాళ్ళు ఎలా మాట్లాడుతున్నారో నా టీచర్ నాకు వివరించి చెప్పేది. సెట్‌కి వెళ్ళే ముందు కూడా కనీసం గంటా రెండు గంటలు నా టీచర్ దగ్గర కూర్చుని డైలాగులు చెప్పించుకునేదాన్ని. నాకు ఇంత తక్కువ గ్యాప్‌లో ఈ మాత్రం తెలుగు వచ్చిందంటే ఆమె గొప్పతనమే!

### చాలా మారాను...

తెలుగు అమ్మాయిలు ఎలా బాధపడతారు, ఎలా సిగ్గు పడతారు? ఏ విషయానికి ఎలా స్పందిస్తారు? అన్న విషయాలు చాలా నేర్చుకుని నన్ను నేను అలా మార్చుకున్నాను. ఈ సినిమా కోసం నన్ను నేను పూర్తిగా మార్చుకున్నాను. నన్ను తెర మీద చూసిన వారు బ్రెజిల్ అమ్మాయి అనుకోరు. అచ్చతెలుగు అమ్మాయే అనుకుంటారు.



### నా మాటలు చూసి విస్తుపోయారు

ఈ సినిమాలో నటించిన అందరితో బాగా కలిసిపోయాను. అందరూ బెస్ట్ ఫ్రెండ్స్ అయ్యారు. ముఖ్యంగా రవిబాబుగారి ప్రభావం నా మీద చాలా పడింది. ఈ సినిమా షూటింగ్ అవగానే నేను బ్రెజిల్ వెళ్ళాను. అక్కడ 'వామ్మో' అన్న నా మాటలు విని మా ఇంట్లో వాళ్ళందరూ ఆశ్చర్యపోయారు. ఒక్క సినిమాకే ఇలా మాట్లాడుతున్నావు. వరుసగా సినిమాలు చేస్తే మమ్మల్ని మర్చిపోతావా అన్నారు.

### కామెడీ బాగా వచ్చింది.

సినిమా అంతా బాగా వచ్చింది. సినిమా చూసిన ప్రతి ఒక్కరికీ ఈ విషయం ఇట్టే తెలిసిపోతుంది. కామెడీ ట్రాక్ చాలా బాగుంది. నేనైతే షూటింగ్ సమయంలో పడి పడి నవ్వేదాన్ని.

### అన్ని భాషల్లోనూ...

తెలుగులోనే కాదు అన్ని భాషల్లోనూ చేయాలనుంది. కాకపోతే తెలుగుకే నా మొదటి ప్రయారిటీ.

### అవకాశాలు..

తెలుగులో కొందరు అడిగారు. కథలు విన్నాను. బాలీవుడ్ నుంచి ఓ పెద్ద ఆఫర్ వచ్చింది. ఇంత వరకూ ఏ సినిమాకీ ఓకే చెప్పలేదు. త్వరలో వాటి వివరాలు చెబుతాను.

-కె. రామకృష్ణ

## సరదాగా

### సలహా

రజని తల నిమురుకుంటూ ఏడుస్తూ కూర్చుంది. ఇంతలో పక్కింటి అనసూయ వచ్చి, 'ఎందుకే ఏడుస్తున్నావు?' అంటూ అడిగేసరికి రజని ఏడుపు ఇంకా ఎక్కువైంది. రజనీకి తల బొప్పి కట్టిందన్న విషయం తెలుసుకునేందుకు అనసూయకు చుక్కలు కనబడ్డాయి. తల ఎందుకు బొప్పి కట్టింది? అడిగింది అనసూయ. 'అదికాదే అనసూయా! మా ఆయన దోమల బ్యాట్ కొనమంటే కొనట్లేదు. ఇంట్లోనేమో దోమలబెడద ఎక్కువైంది. ఏం చేయాలో తోచక రాయి తీసుకుని దోమలను కొడుతుంటే, మా ఆయన బుర్ర ఉపయోగించమన్నాడే!' అంటూ మొత్తుకుంది.

### ఒక ప్రశ్న?

ప్రముఖ గణిత శాస్త్రవేత్త శ్రీనివాస రామానుజం జయంతి సందర్భంగా విద్యార్థుల్లోని గణిత నైపుణ్యాలు వెలికి తీయాలనే ఉద్దేశంతో ఒలింపియాడ్ పరీక్ష నిర్వహిస్తున్నారు విద్యానికేతన్ స్కూల్ నిర్వాహకులు. కేవలం ఆ స్కూలు విద్యార్థులే కాకుండా ఇతర స్కూళ్ళ విద్యార్థులు కూడా పరీక్షకు హాజరు కావచ్చు. పరీక్షలో అత్యధిక మార్కులు పొందినవారికి ప్రత్యేక నగదు బహుమతులు కూడా ఇవ్వనున్నట్లు ప్రకటించింది స్కూలు యాజమాన్యం. 7 నుంచి 10వ తరగతి విద్యార్థులు మాత్రమే పాల్గొనాలని నిబంధన కూడా విధించింది. నగరంలోని ప్రముఖ స్కూళ్ళ నుంచి విద్యార్థులు ఒలింపియాడ్ పరీక్షకు హాజరయ్యారు. వారిలో అనిరుధ్ ఒకడు. విద్యార్థుల సంఖ్య ఎక్కువగా ఉండటంతో మూడు స్థాయిల్లో పరీక్ష నిర్వహించాలని వడపోత కార్యక్రమాన్ని ప్రకటించారు. ఫైనల్ పరీక్షకి 50 మంది విద్యార్థులను ఎంపిక చేశారు. వారిలో అనిరుధ్ ఒకడు. ఆ యాభై మందికి ఒక ప్రశ్నాపత్రం ఇచ్చారు. ఆ ప్రశ్నాపత్రంలో అన్నీ సూత్ర ఆధారిత ప్రశ్నలే కాకుండా లాజిక్ ప్రశ్నలు కూడా ఇచ్చారు. అలాంటి లాజిక్ ప్రశ్నల్లో ఇవి కూడా ఉన్నాయి.

a) 3...3...3 = 6
b) 4...4...4 = 6
c) 5...5...5 = 6
d) 7...7...7 = 6

కూడిక, తీసివేత, హెచ్చవేత, భాగహారం, వర్గమూలం గుర్తులను ఉపయోగించి ఇచ్చిన స్టేట్‌మెంట్లను సరిపోల్చమన్నారు. అనిరుధ్‌కైతే సమాధానాలు దొరికాయి. మరి మీరు చేయగలరో లేదో చూడండి.

-యండమూరి వీరేంద్రనాథ్

**జవాబులు**

a) 3 x 3 - 3 = 6.
b) √4 + √4 + √4 = 6.
c) (5 ÷ 5) + 5 = 6.
d) 7 - (7 ÷ 7) = 6.

Jayadev

# అదుపా దడుపా నవ్వాబ్బా











## 8

### కృష్ణం వందే జగద్గురుమ్

కన్నయ్య లాంటి గడసరి, అల్లరి పిల్లవాడు తన కడుపున పుడితే బాగుండునని ప్రతి మగువ ఆకాంక్షించేంత పరిపూర్ణమైనది ముద్దుకృష్ణుని బాల్యం. ఆ లీలామానుషధారుని బాల్యక్రీడలను, కృష్ణతత్వాన్ని స్మరించుకునే రోజు శ్రీకృష్ణ జన్మాష్టమి. ఆ పర్వదిన ప్రాశస్త్యం గురించి..

## 44

### రూపు ఓ రకం... రుచి ఇంకో రకం!

పండు రూపాన్ని చూసి రుచిని గుర్తుపట్టే మన నాలుక ఇక మోసపోయే రోజులొచ్చాయ్! పండు రూపు ఒకలా ఉంటుంది. దాని రుచి మరొకలా ఉంటుంది. ఈ సరికొత్త పండ్ల కథేంటో తెలుసుకోండి!

## 72

### ఇంటర్వ్యూ

వెండి తెర, బుల్లి తెర నటి రాగిణి. వందలాది సీరియల్స్, సినిమాల్లో నటిస్తూ నంది అవార్డుల పంట పండించుకున్న ఆమె మనోగతం ఈ వారం...

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: కేథరిన్
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com





ఓ అడవిలో ఇద్దరు నరమాంసభక్షకులు నడుస్తున్నారు. వారిద్దరూ తండ్రీకొడుకులు. ఆ ఇద్దరికీ చెట్ల చాటున దాగున్న ఓ అందమైన అమ్మాయి కనిపించింది.

"డాడీ డాడీ! ఆ అమ్మాయిని నాకొదిలేయ్! నేను తింటాను."

"ఓ పని చేద్దాంరా! ఆ అమ్మాయిని తీసుకుని ఇద్దరం ఇంటికి వెళ్దాం. అక్కడ అమ్మాయికి బదులుగా నువ్వు మీ అమ్మని తినేయ్."

•••

*భర్త:* ఇదిగో! ఈ కొబ్బరిచెట్టెక్కితే ఇంజనీరింగ్ కాలేజీ అమ్మాయిలు బలే కనబడుతున్నారు.

*భార్య:* చేతులు వదిలేయండి! మెడికల్ కాలేజీ అమ్మాయిలు కూడా బాగా కనబడతారు.

•••

ఆవు, దూడ పొలంలో పడి మేస్తున్నాయి. అది చూసి, గోలగోల చేశాడు పొలం యజమాని. పనివాణ్ణి పిలిచి కేకలేశాడిలా.

"ఆవు, దూడ పొలంలో పడి మేస్తోంటే చూస్తూ ఊరుకుంటావేంరా? అసలు ఆ ఆవు, దూడ ఎవరివో తెలుసా?"

"ఆవు ఎవరిదో తెలియదు సార్! దూడ మాత్రం ఎవరిదో తెలుసు."

"చెప్పు, ఆ దూడ ఎవరిది?"

"ఆ ఆవుది సార్"

•••

అటు నక్కి, ఇటు నక్కి, చెట్ల వెనుక కనీ కనిపించక దాగుంటున్న పిల్ల సింహాన్ని చూసింది తల్లి సింహం. అడిగింది.

"ఏం చేస్తున్నావు అక్కడ?"

"ఓ మనిషి కనిపించాడు. అతనితో దాగుడుమూతలు ఆడుతున్నాను."

"నీకెన్నిసార్లు చెప్పాను, తిండితో ఆటలాడొద్దని." కేకలేసింది తల్లి సింహం.

•••

"అయిదు నిముషాల్లో మీ హోటల్ వస్తుందని మీరు పెట్టిన బోర్డు చూశాను. అయిదునిమిషాలేంటి, ఇక్కడికి నడిచి వచ్చేసరికి అరగంట పట్టింది."

"ఆ బోర్డు కార్లో వచ్చేవారికి సార్"

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 13 సంచిక: 25
24-8-2016



మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎస్.జగన్నాథశర్మ

మొదటి పేజి

# తల్లివి నీవే! తండ్రివి నీవే!

కృష్ణాష్టమి. వేణుగోపాలస్వామి ఆలయం భక్తులతో నిండిపోయింది. ఉదయం ఆరు గంటలనుంచే దర్శనభాగ్యం కలుగజేశాడు స్వామి. సాయంత్రం అయినా భక్తజనం తరగడం లేదు. తండోపతండాలుగా వస్తూనే ఉన్నారు. కాసేపట్లో సంగీతవిభావరి ఉంది. దాంతో వచ్చే జనం పోవడం లేదు. ఆలయంలోనే ఉండిపోతున్నారు. అప్పుడు చోటు దొరకదని, ఇప్పుడే ఆ గోడను ఆనుకుని, ఈ స్తంభాన్ని పట్టుకుని కూర్చుంటున్నారు. కూర్చుని ప్రసాదాల్ని కళ్ళకద్దుకుని తింటున్నారు. అలా తింటున్న వారిని ప్రాంగణం పరిశుభ్రంగా ఉంచాలంటూ, ఎంగిలాకులూ, ప్రసాదాలూ పారవేయవద్దని ఓ అరవైరెండేళ్ళ వ్యక్తి హెచ్చరిస్తోంటే...ఈ ఓవర్‌యాక్షన్‌గాడు ఎవర్రా? అనుకున్నారు ఓ ఇద్దరుమిత్రులు. తేరిపార చూశారతన్ని. పట్టిపట్టి చూస్తుంటే పట్టించుకోకుండా ఉంటాడా? వచ్చి వాళ్ళ పక్కనే కూర్చున్నాడు ఓవర్‌యాక్షన్. స్వామి అంటే బాగా గురి అనుకుంటాను, పొద్దుటి నుంచి ఇక్కడే ఉన్నారు అన్నాడు మిత్రులతో. మీకు కూడా బాగా గురి అనుకుంటా, కేకలేస్తూ బలే తిరుగుతున్నారు అంది మిత్రద్వయం. నిజమే! బాగా గురి అన్నాడు ఓవర్‌యాక్షన్.

స్వామిని పూజిస్తూ ఈ ఆలయంలో ఓ పిచ్చితల్లి ఉండేది. పేరు రాధమ్మ. ఆమెకు ఓ కొడుకు. వాడి పేరు మురళి. పదేళ్ళ వయసు వచ్చే వరకూ మురళికి నాన్న అక్కరలేకపోయాడు. తండ్రి ఊసు కూడా ఎత్తేవాడు కాదు. ఎప్పుడైతే పదేళ్ళొచ్చాయో! అప్పుడు మీ నాన్న ఎవరు? ఏం చేస్తుంటారు? పేరేమిటి? అని అందరూ అడగడంతో అప్పుడు కావాల్సి వచ్చి, అమ్మా నాన్నంటే ఎవరే? అని తల్లిని అడిగాడు మురళి. ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి? కాళ్ళూ చేతులూ ఆడలేదామెకు. పెళ్ళి కాకుండానే తల్లి అయ్యింది. తల్లిని చేసి పారిపోయాడు ప్రియుడు. దాంతో పిల్లాడుసహా ఇంటి నుంచి పారిపోయి వచ్చి, స్వామిని ఆశ్రయించి బతుకుతోందామె. సమాధానం చెప్పలేకపోయింది.



మురళి స్కూలుకి వెళ్ళినా, కూరగాయల మార్కెట్‌కి వెళ్ళినా, ట్యూషన్‌కి వెళ్ళినా, ఆడుకునేందుకు మైదానానికి వెళ్ళినా, ఎక్కడికి వెళ్ళినా అంతా అడిగేది ఒకటే ప్రశ్న. మీ నాన్న ఎవరు? తెలీదంటే వినరు. తెలుసుకో అన్నారు. ఓ రోజు గట్టిగా పట్టుబట్టాడు మురళి. తన తండ్రి ఎవరో చెప్పి తీరాలన్నాడు తల్లితో. అప్పుడు ఆ పిచ్చితల్లి అదిగో ఆ వేణుగోపాలస్వామిని చూపించి అతడే నీ తండ్రి అన్నది. కావాలంటే పోలికలు చూసుకో అన్నది. స్వామికి ఉన్నట్టుగానే సన్నగా పొడవుగా నీకూ ముక్కు ఉంది. నీ నుదురు కూడా స్వామి నుదురులాగే పెద్దది. కళ్ళు కూడా అంతే! ఆయనా నలుపే! నువ్వూ నలుపే అన్నది. నువ్వు దేవుడి బిడ్డవి అన్నది. ఆనాటి నుంచి మురళిని ఎవరు అడిగినా మా నాన్న దేవుడు! ఆలయంలో ఉన్నాడే వేణుగోపాలస్వామి, ఆయనే మా తండ్రి అని చెప్పుకునేవాడు. కొత్తలో పగలబడి నవ్వినా తర్వాత ఎవరూ వాడి మాటలకి నవ్వేవారు కాదు. జాలిపడేవారు. ఆ జాలితోనే మురళి బాగా చదువుకున్నాడు. పెద్ద డాక్టరయ్యాడు. పట్నంలో ఇప్పుడు హార్ట్ స్పెషలిస్ట్. రెండు చేతులా సంపాదిస్తున్నాడు అన్నాడు ఓవర్ యాక్షన్. ఇప్పుడు ఈ కథ మాకెందుకు చెప్పారు? అడిగారు మిత్రులు. ఎందుకంటే ఆ రాధమ్మ కొడుకు మురళిని నేనే కాబట్టి, ఆ తండ్రి అంటే నాకు బాగా గురి కాబట్టి అని వేణుగోపాలస్వామికి దండం పెడుతూ చెప్పాడు ఓవర్‌యాక్షన్ అనబడే మురళి. దాంతో మిత్రులకి నోట మాటలేదు. ఆశ్చర్యంగా అతన్ని చూస్తూ లేచి నిల్చున్నారు. కూర్చోండి! కూర్చోండి అని వెళ్ళిపోయాడు అక్కణ్ణుంచి మురళి. ఎంత చెప్పినా పట్టించుకోక భక్తులు పారేసిన ప్రసాదాల్నీ, ఎంగిలాకుల్నీ ఎత్తుతూ, జాగ్రత్తమ్మా! జాగ్రత్తయ్యా! అక్కడ తడిగా ఉంది, పడతారు. ఇటు రండంటూ హెచ్చరికలు చేయసాగాడు.

మురళిని చూస్తూ పక్కన నుంచి వెళ్తున్న పూజారిని అడిగారు మిత్రులు. ఆయన నిజంగా డాక్టరాండీ? డాక్టరే కాదు బాబూ, ఈ ఆలయానికీ, ఆ దేవుడికీ తండ్రి కూడా. ధర్మకర్త. వారివల్లే ఆ స్వామీ మేమూ బతుకుతున్నాం అన్నాడు పూజారి.

మిత్రులకి మళ్ళీ నోట మాట లేదు. సంగీతవిభావరి ప్రారంభం అయింది.

కస్తూరి రంగరంగ! నా తండ్రి కావేటి రంగరంగ! కాపాడి రక్షించవా! నా తండ్రి కరుణాంత రంగరంగ!




## సైకిల్ యాత్ర

సమస్యల పరిష్కారం కోసం ఎన్నో మార్గాలు అనుసరిస్తూ ఉంటారు. ఏ మార్గం అనుసరించినా అంతిమ లక్ష్యం మాత్రం సమస్య పరిష్కారమే కదా! చాలా సందర్భాల్లో దీనికి ప్రజా చైతన్యం, సమస్యపై అవగాహన పెంపొందించడమే ముఖ్యం. ఈ విషయాన్నే గుర్తించారు ఓ ఇద్దరు యువకులు. బాలికా విద్యపై అవగాహన పెంపొందించేందుకు సైకిల్ యాత్ర ప్రారంభించారు.

అక్షరాస్యతలో బాలికల నిష్పత్తి పెంచడానికి ప్రభుత్వాలు చిత్తశుద్ధితో ఎన్నో పథకాలు, కార్యక్రమాలు ప్రవేశపెట్టినా, పర్యవేక్షణా లోపం కారణంగా అవన్నీ నిర్వీర్యమవుతున్నాయి. అందుకే ముఖ్యంగా మారుమూల ప్రాంతాల్లో బాలికా విద్య పట్ల అవగాహన తెచ్చేందుకు మహా



రాష్ట్రకు చెందిన సుమిత్ పరింజే(26), ప్రిసిలియా మదన్(22) సైకిల్‌యాత్ర చేపట్టారు.

కన్యాకుమారి నుంచి జమ్మూకశ్మీర్‌లోని కుర్దుంగ్లా వరకు 58 రోజుల్లో సైకిల్ సాహసయాత్ర పూర్తిచేయాలనేది వీరి లక్ష్యం. రోజుకు 100 కిలో మీటర్ల లక్ష్య నిర్దేశంతో ముందుకు సాగుతున్నారు. ఎందుకింత సాహసం చేస్తున్నారు? అనడిగితే, బాలికల్లో అక్షరాస్యతా కార్యక్రమం సక్రమంగా అమలు కావడానికి అవసరమైన చైతన్యం పెంపొందాల్సిన ఆవశ్యకతను ప్రతి ప్రాంతంలోనూ ఎలుగెత్తి చెప్పాలనేదే తమ లక్ష్యం అంటున్నారు వీరు. అంతే కాదు అందుకు కావాల్సిన విరాళాలను సైతం పోగుచేసి అక్షరాస్యతలో బాలికల స్థానం మెరుగుపరచాలనే కృత నిశ్చయంతో ఉన్నామని చెబుతున్నారు.

'బాలికల చదువు విషయంలో మన దేశం ఇంకా వెనుకబడే ఉంది. చదువులో బాలికలు మెరుగైన నిష్పత్తి సాధించాలనేదే మా కర్తవ్యం. మొదట్లో ప్రతికూల వాతావరణం వల్ల మా సైకిల్ యాత్రలో కొన్ని ఇబ్బందులు ఎదుర్కొన్నాం. అయినా లక్ష్యం చేరేవరకు మాకు వెనుదిరిగే ఉద్దేశం లేదు. తొందర్లోనే కశ్మీర్ చేరుకుంటాం, అందరిలో అవగాహన తెస్తాం' అని పట్టుదలతో చెబుతున్నారు పరింజే, ప్రిసిలియాలు. మంచి కార్యం కోసం సాహసానికి పూనుకున్న ఈ వీరుల్ని అభినందించాల్సిందే. వీరి సాహసయాత్ర దిగ్విజయంగా పూర్తి కావాలని మనమూ ఆశిద్దాం. హ్యాట్సాఫ్ టు దెమ్!

నవ్య

# మెయిల్ బాక్స్

### ఆశ్చర్యపోయాం

క్రూర నియంతల హృదయాల్లో కూడా భయాలు, కళాపోషణ ఉంటాయని తెలిసి ఆశ్చర్యపోయాం. ఐ లవ్యూ చెప్పడానికి భయపడిన హిట్లర్, సద్దాంహుస్సేన్‌లోని రొమాంటిక్ నేచర్, ముస్సోలినీ పాడు అలవాటు, నగ్న చిత్రాలు గీసే స్టాలిన్ లాంటి విషయాలు మొదటిసారి తెలుసుకున్నాం. కుంటి సాకులు, అపనమ్మకాలు, పక్కన పెట్టి నెగెటివ్ స్థానంలో పాజిటివ్ ఆలోచనలు ప్రోదిచేసుకుంటేనే విజయం సాధించగలమని గేమ్ ఆఫ్ లైఫ్‌లో చక్కగా వివరించారు. ఒకప్పటి బాలీవుడ్ తారలు దక్షిణాదిలో పక్కా ప్లానింగ్‌తో చిత్రాలు తీస్తారని మెచ్చుకునేవారు. ఇప్పుడు సీన్ రివర్స్ చేస్తున్నది అమీజాక్సన్. వెన్నవున్నవైపే బ్రెడ్ నాకుతారు ఈ తారలు!

-ఆర్.సత్య, కరప

### మార్నింగ్ కాఫీ భలే నవ్వించింది

మార్నింగ్ కాఫీలో పాత పదాలకు కొత్త నిర్వచనాలు అలరించాయి. కూతురు, ఆమె బాయ్ ఫ్రెండ్ కోడ్ భాషలో మాట్లాడుకుంటుండగా తండ్రి ఇచ్చిన ఝలక్ భలే నవ్వించింది. కాంతం అల్లం టీ మళ్ళీ మళ్ళీ తాగాలనిపించింది. ఫ్రెండ్‌షిప్ డే సందర్భంగా స్నేహ ధర్మాన్ని గొప్పగా ఆవిష్కరించారు. స్నేహం పదికాలాలపాటు పదిలంగా ఉండాలంటే పాటించాల్సిన జాగ్రత్తలు ఉపయుక్తంగా ఉన్నాయి. రోబోతో సహజీవనం, అగ్నిపర్వతంపై రెస్టారెంట్ వంటి సురభి వింతలు ఆకట్టుకున్నాయి.

-హెచ్.పవన్, రామారావుపేట

### నోబెల్‌కథ బాగుంది

నోబెల్ కథలు బాగుంటున్నాయి. 'గ్రహణం' కథ చాలా సహజంగా ఉంది. ఆ గ్రామం మన దేశంలో ఉన్నట్టుగానే అనిపించింది. ఆ రైతుల కష్టాలు, మన రైతుల కష్టాలు ఒకటే. వాళ్ళూ ఆవుపేడనే ఎరువుగా వాడుతున్నారు. బిడ్డ మొదటి అడుగు వేస్తే వారూ మనలాగే సంబరాలు చేసుకుంటున్నారు. ఇవన్నీ మనదేశంలో జరుగుతున్నవే. గ్రహణం గురించి బెడా చెప్పిన సంగతులు బాగున్నాయి. చేపలు మనుషులను గుర్తుపట్టడం, కాకులు, చిలుకలు బాగా ఆలోచించగలవన్న నిజాలు చదివి ఆశ్చర్యపోయాం.

-పి.చంద్ర, కాకినాడ

### నేటివిటీ నిండిన నోబెల్ కథ

నోబెల్ గ్రహీత పెరల్‌బక్ రాసిన కథ 'పోట్లాట' అచ్చు మనదేశంలోని బస్తీల్లో జరిగిన సాధారణ జీవిత కథలా ఉంది. నేటివిటీతో నిండి చక్కగా సహజంగా ఉంది. మనుషుల ప్రవర్తన, మనస్తత్వాలు చక్కగా చిత్రితమయ్యాయి. నిజానికి రచయిత్రి ఆమెరికన్ అయినా, ఆమె చూపు తూర్పు వైపే. ఆమెకు నోబెల్ సాధించిపెట్టిన నవల 'ద గుడ్ ఎర్త్'లో రైతు సమస్యలు, భూస్వామ్య దౌర్జన్యాలను అద్భుతంగా చిత్రించింది. భారతీయులకు ఆత్మీయురాలైన పెరల్ బక్ కథ అందించినందుకు థాంక్స్.

-మైథిలి, సర్పవరం

### ఆర్టికల్స్ సూపర్బ్

నవ్యవీక్లీలో అన్ని అంశాలూ బాగుంటున్నాయి. ముఖ్యంగా ఎంతో అద్భుత సమాచారం నింపుకున్న ఆర్టికల్స్ వారం వారం ఆకట్టుకుంటున్నాయి. క్రూర నియంతల హృదయాల్లో ఉన్న సున్నితత్వం, వారిలోని భయాలు చదివి ఆశ్చర్యపోయాం. మనిషి ఎంత గొప్పవాడైనా నేచర్ ఒకటే అని చాటి చెప్పారు హర్షిణి. ఫ్రెండ్‌షిప్ డే విలువను చాటి చెప్పి సరికొత్త సమాచారం అందించారు. పెంపుడు కుక్కల యజమానులకు డోగాభ్యాసం ఓ వెరైటీ వ్యాయామం.

-నాగేశ్వరరావు, ఏలూరు

### నూటికి నూరుపాళ్ళు నిజం

మార్నింగ్ కాఫీ స్కిట్లు, జోకులు, కార్టూన్లు కడుపుబ్బ నవ్విస్తున్నాయి. సంతోషి దహగాంగారి ఫ్రెండ్‌షిప్ డే వ్యాసం సూపర్. స్నేహితులు ఉన్నవారిలో యాభై శాతం ఆరోగ్యం మెరుగ్గా ఉంటుందని చెప్పడం నూటికి నూరుపాళ్ళు నిజం. ఆన్‌లైన్ స్నేహాలతో జాగ్రత్తగా ఉండాల్సిందే. ఆరోగ్యమే మహాభాగ్యంలో వేడినీటి స్నానం వ్యాయామంతో సమానమనే కొత్త చిట్కా తెలుసుకున్నాం.

-ప్రేమ్‌కుమార్, హైదరాబాద్

### వింతగొలిపిన థీమ్ హోటళ్ళు

'థీమ్ హోటళ్ళు, థ్రిల్లింగ్ రెస్టారెంట్లు' వింతగొలిపాయి. పెద్దల దగ్గర ఉంటేనే పిల్లలకు మేలు. తాతయ్యలే మనవల్ని తీర్చిదిద్దితే వారు కుటుంబ విలువల్ని, మర్యాద, మన్ననల్ని తెలుసుకుంటారని రచయిత చాలా బాగా చెప్పారు. సురభి ద్వారా ఆశ్చర్యకర విషయాలు తెలుసుకుంటున్నాం. ఇంటర్వ్యూలు అద్భుతం, పదగారడీ, కార్టూన్లు, ఇవన్నీ నిజాలే, నవ్య సినిమా, రామాయణం, క్రైమ్, నోబెల్‌కథలు, సీరియల్స్, రివ్యూ వేటికవే అద్భుతం.

-అబ్బగాని భాస్కర్, మహబూబాబాద్

### అబ్బురపరుస్తున్న సురభి

వారం వారం సురభి వింతలు మమ్మల్ని అబ్బురపరుస్తున్నాయి. ప్రపంచంలో ఎక్కడో దూరంగా ఉండే వింతల గురించి తెలుసుకోవడం విజ్ఞానదాయకంగా ఉంది. ఈ వారం అగ్నిపర్వతంపై రెస్టారెంట్, లోకం చుట్టిన వీరుడు, రోబోతో సహవాసం, మనుషుల్ని మోసే సూట్‌కేసులు నేటి కాలం విడ్డూరాలు. ఆర్టికల్స్ ఎంతో బాగుంటున్నాయి.

-వల్లీపద్మావతి, హైదరాబాద్

# రెండు కాళ్ళ నిడివిలో తేడా అందుబాటులోకి పొడవును సరిచేసే ప్రక్రియలు

ఏదైనా కారణాల వల్ల ఒక కాలు పొడవు, మరో కాలు పొట్టిగా ఉండి రెండు కాళ్ల నిడివిలో తేడా ఏర్పడితే ఆ బాధ వర్ణనాతీతం. ఇలా పొడవులో తేడాలు ఉన్న కాళ్లను సరిచేసుకునే మార్గమే లేదని బాధపడుతూ న్యూనతకు లోనవుతుంటారు. కానీ అందుబాటులోకి వచ్చిన వైద్య ప్రక్రియలు, వైద్యులలో పెరుగుతున్న నైపుణ్యతతో ఇలాంటి సమస్యలకు పరిష్కారం చూపించగలుగుతున్నారు. ప్రస్తుతం సర్జరీ ద్వారా ఎత్తులో తేడాతో పొట్టి, పొడవుగా ఉన్న కాళ్లను సరిచేసే ప్రక్రియలు అందుబాటులోకి వచ్చాయి.

## ఎందుకీ సమస్య...?

సాధారణంగా ప్రమాదాలకు గురైనప్పుడు లేదా పుట్టుకతో వచ్చిన లోపాల వంటి ఏదైనా కారణాల వల్ల ఒక కాలు పొడవుగా మరో కాలు పొట్టిగా ఉండే అవకాశం ఉంటుంది. ప్రమాదాలకు గురైనప్పుడు కొన్ని సందర్భాలలో కొంత కాలి ఎముకను కోల్పోతే రెండు కాళ్ల మధ్య నిడివిలో తేడా ఏర్పడే అవకాశం ఉంటుంది. దాంతోపాటు కొంతమందికి పుట్టుకతో కొన్ని లోపాల కారణంగా కూడా కాళ్ల ఎత్తులో తేడాలు ఏర్పడవచ్చు.

## సర్జరీతో సరిచేయవచ్చు

ఏదైనా కారణాల వల్ల రెండు కాళ్ల నిడివిలో తేడా ఏర్పడితే దానిని సరిచేసే ప్రక్రియలు అందుబాటులోకి వచ్చాయి. రెండు కాళ్లను ఎలా సరిచేయాలి...? ఇలా సరిచేసే ప్రక్రియలో కాలి ఎముకను ఎంత వరకు కట్ చేయాలి...? మొత్తం సరికావడానికి ఎంత సమయం పడుతుంది...? అనే అంశాలను బేరీజు వేసి, పొట్టిగా మారిన కాలిని సరిచేయడానికి ఉన్న వివిధ రకాల ప్రక్రియలను రోగికి వివరిస్తారు. రెండు కాళ్ల ఎత్తును సమానం చేయడానికి పొట్టిగా ఉన్న కాలు పొడవును పెంచేందుకు సర్జరీ నిర్వహిస్తారు. కొన్ని సందర్భాలలో పొడవుగా ఉన్న కాలును తగ్గించి రెంటినీ సమానం చేస్తారు.




## శాస్త్రీయ పద్ధతుల్లోనే సర్జరీ

ఎత్తును పెంచే సర్జరీకి సంబంధించిన ఆనవాళ్ళు 1905 సంవత్సరం నుంచే ఉన్నాయి. ప్రధానంగా 1950లో ఇలిజరో చేసిన కృషితో ఈ సర్జరీలకు శాస్త్రీయత తోడైంది. ఎముక పెరిగేలా చేసే శస్త్రచికిత్సలతో ఎముక పొడవు పెంచడానికి అవకాశాలున్నాయి. ఈ ప్రక్రియలో ఎముకను కట్ చేసి, ఎముకల మధ్య గ్యాప్ వచ్చేలా చేస్తారు. కొన్ని ప్రత్యేకమైన పరికరాల సహాయంతో ఒక రోజుకు 1 మిల్లీ మీటర్ చొప్పున పొడవును పెంచుతారు. ఎముక పెరుగుతున్న కొద్దీ దాని చుట్టూ అవసరమైన కండ, నరాలు, రక్తనాళాలు, చర్మం అన్నీ పెరిగి




గ్యాప్ భర్తీ అవుతుంది. అయితే సర్జరీ తర్వాత కూడా ఎత్తును పెంచే ప్రక్రియ కొనసాగించాల్సి ఉంటుంది. రోగి ఇంటి వద్దనే సొంతంగా గానీ లేదా రోగి సహాయకులుగానీ ఈ ప్రక్రియను నిర్వహించవచ్చు. ఎత్తును పెంచేందుకు కాలి చుట్టూ గుండ్రంగా ఉండే ప్రత్యేకమైన పరికరాలలో ఉండే స్క్రూలను తిప్పాల్సి ఉంటుంది. సర్జరీ తర్వాత పూర్తిగా నయం కావడం అనేది ఎంత ఎత్తును పెంచాలి అనే అంశంపై ఆధారపడి ఉంటుంది. కొన్ని ప్రత్యేకమైన సందర్భాలలో రెండు కాళ్ళ ఎత్తును సమానం చేయడానికి పొడవుగా ఉన్న కాలి ఎముకను కట్ చేసి పొట్టిగా ఉన్న కాలుకు సమానంగా చేస్తారు. సాధారణంగా బాగున్న కాలిని తాకకుండా పొట్టిగా మారిన కాలిని సరిచేయడానికే వైద్యులు ప్రయత్నిస్తారు.

## సర్జరీ సురక్షితమేనా...?

రెండు కాళ్ళ మధ్య ఏర్పడిన నిడివిలో తేడాను సరిచేసే శస్త్రచికిత్సలో కొన్ని దుష్ప్రభావాలు కూడా తలెత్తవచ్చు. ఈ సర్జరీలలో తుంటి సమస్యలు, నరాలు, రక్తనాళాలకు సంబంధించిన సమస్యలు కూడా ఉత్పన్నం అయ్యే అవకాశం ఉంటుంది. నిపుణులైన వైద్యుల పర్యవేక్షణలో మాత్రమే సర్జరీ చేయించుకోవడం ఉత్తమం.

## సర్జరీ తర్వాత

సర్జరీ తర్వాత నొప్పి బాధిస్తుంటుంది. ఆ నొప్పిని అదుపు చేయడానికి పోస్టు ఆపరేటివ్ పెయిన్ కంట్రోల్ పద్ధతులు అవలంభించాలి. హాస్పిటల్ నుంచి డిశ్చార్జ్ అయిన తర్వాత నొప్పి మందులు వాడుతున్నా సుమారు రెండు వారాల వరకు నొప్పి ఉండే అవకాశం ఉంటుంది. ఈ ఆపరేషన్ జరిగిన వారిలో ఎక్కువగా పగలు కంటే పడుకునే సమయంలో, రాత్రిళ్ళు నొప్పి ఎక్కువగా వస్తుంటుంది. పొడవును పెంచే ప్రక్రియలో భాగంగా స్క్రూలు తిప్పే సమయంలో కొంతమేర నొప్పి పెరిగే అవకాశం ఉంటుంది. నొప్పి నుంచి ఒకసారి ఉపశమనం లభిస్తే సౌకర్యంగా ఉండగలిగే స్థాయి పెరుగుతుంది. ఈ ప్రక్రియ మొత్తం పూర్తయ్యేంతవరకు తప్పనిసరిగా వైద్యుల సలహాలు, సూచనలు పాటించాలి.

(ఆగస్టు 25 శ్రీకృష్ణ జన్మాష్టమి సందర్భంగా)

# కృష్ణం వందే జగద్గురుమ్

**వసుదేవ సుతం దేవం కంసచాణూర మర్దనమ్!**
**దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్!!**

**దశావతారాలలో పరిపూర్ణమైన అవతారాలు రెండు. రామావతారం, కృష్ణావతారం. సాక్షాత్తూ ఆ భగవంతుడే మానవుడిగా జీవించి ధర్మానికి ప్రతిరూపంగా నిలిచింది రామావతారం అయితే, మానవత్వంలో దైవత్వాన్ని చూపించింది కృష్ణావతారం. యథాయథాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత అని ప్రకటిస్తూ తాను ఏది ఆచరిస్తే అదే ధర్మం అంటూ జగద్గురువుగా నిలిచినవాడు శ్రీకృష్ణుడు. అంతటి పరమాత్ముడు ఈ భూమిపై పాదంమోపిన పవిత్రదినం శ్రీకృష్ణ జన్మాష్టమి.**

శ్రావణ మాసం సకల శుభాలను, పుణ్యాలను చేకూర్చే మాసం. అలాంటి శ్రావణ మాసంలో ద్వాపరయుగాన, బహుళ పక్షం రోహిణీ నక్షత్రం అష్టమి తిథినాడు రెండోఝాము వేళ చెరసాలలో దేవకీదేవి అష్టమ గర్భాన శ్రీకృష్ణపరమాత్మ జన్మించాడు. గోకులాష్టమి, కృష్ణాష్టమి, అష్టమి రోహిణి... ఇలా రకరకాల పేర్లతో దేశమంతటా ఆ రోజును పండుగలా జరుపుకుంటారు. శ్రీకృష్ణుడు జన్మించిన అష్టమి తిథికి కొందరు ప్రాధాన్యం ఇస్తే, మరికొంతమంది రోహిణీ నక్షత్రానికి ప్రాధాన్యమిచ్చారు. ఈ కారణాలవల్ల ఒక రోజు అటు ఇటుగా కృష్ణాష్టమి జరుపుకుంటారు.

### ఆదర్శప్రాయం కృష్ణుడి జీవితం

పరమానందమే గోపాలుడి మార్గం. బృందావనంలో ఆలమందలు, గోపికలు, రాసక్రీడలు, మహిమలు ఇలా దేవకీ సుతుని లీలలకు అంతు లేదు. అందుకే ఆయన యుగపురుషుడయ్యాడు. శ్రీకృష్ణుడేమీ అంతఃపురంలో పట్టుపరుపుల మీద పుట్టలేదు. చెరసాలలో పుట్టి నందనందనుడై గోకులానికి చేరాడు.

గార్దభ కరుణాకటాక్షాలతో, యమున పారవశ్యంతో మధురను విడిచి పురిటిబిడ్డను రేపల్లెకు చేర్చాడు వసుదేవుడు. రారాజుగా అంతఃపురంలో పెరగాల్సిన శ్రీకృష్ణుడు యశోదమ్మ ముద్దుబిడ్డడయ్యాడు. పశువుల కాపరిగా మారి రేపల్లెను సంతోషాలసీమగా మార్చేశాడు.

పేదరికంలో పుట్టామని బాధపడకూడదనీ మనం ఎక్కడ ఉన్నా, ఏ స్థానంలో ఉన్నా, ఎలాంటి పరిస్థితులలనైనా మనకు అనుకూలంగా మార్చుకోవచ్చుననే సూక్ష్మాన్ని నేటి ఆధునికులకు వివరించి చెబుతుంది కృష్ణుడి బాల్యం. కన్నయ్య లాంటి గడసరి, అల్లరి పిల్లవాడు తన కడుపున పుడితే బాగుండునని ప్రతి మగువ ఆకాంక్షించేంత పరిపూర్ణమైనది ముద్దుకృష్ణుని బాల్యం.

### రాసలీల కాదది

చాలామందికి సామాన్యంగా కలిగే సందేహమే ఇది. సాక్షాత్తూ పార్వతీదేవికీ అదే సందేహం కలిగింది. శ్రీకృష్ణుడి రాసలీలలను ఆ సృష్టికర్త బ్రహ్మతోపాటు పరమేశ్వరుడు కూడా వీక్షించాడు. గోపికలతో శ్రీకృష్ణుడు చేసిన అద్భుత నృత్యకేళీ విలాసాన్ని పార్వతికి వివరించాడు పరమేశ్వరుడు. ఇతరుల భార్యలతో అతడెలా నాట్యం చేశాడని పార్వతి సందేహం వెలిబుచ్చింది. నిజానికి రాసలీలలు కావవి. విశ్వమంతా నారాయణుడి శరీరమే. ఆయన గోపికల్ని స్పృశించడమంటే తనను తానే స్పృశించినట్టు. గోపికలతో శ్రీకృష్ణుని ఆలింగనంలోని అంతరార్థం జీవాత్మ పరమాత్మను చేరడమే. రసం అంటే రుచి. అన్నింటికన్నా మించిన మాధుర్యం గల రసస్వరూపుడు నారాయణుడే అని ఉపనిషత్తులు వర్ణించాయి. భగవంతుడు ఆనందాన్ని ఇస్తాడు. అదే రాసలీల. అదొక అలౌకిక సౌందర్య లీలా ఖేలన మనోజ్ఞ ప్రాభవం. సృష్టిలో ప్రతి వస్తువులో ప్రతిప్రాణిలో ఆ పరమాత్ముడు నిండి ఉన్నాడనే భావం కలిగినప్పుడు మనకు ఆయన దాసుడు అవుతాడనేదే శ్రీకృష్ణుని లీలావినోద సారాంశం.

### గో సంరక్షణే ధ్యేయం

రేపల్లెలో అల్లరి కృష్ణుణ్ణి తలుచుకోగానే పాల మీగడ, గోపికలతో సరసాలే కాదు ఆలమంద కూడా జ్ఞాపకం వస్తుంది. అనాదిగా గోవుని త్యాగానికీ, స్వచ్ఛతకూ ప్రతిరూపంగా భావిస్తున్నారు భారతీయులు. అందుకే ఆవును తల్లితో పోలుస్తారు. అందుకే గోమాత అని పిలుస్తారు. గోవులను సంతోషపెట్టేందుకే శ్రీకృష్ణుడు వేణుగానం చేసేవాడట. ఒక సందర్భంలో కృష్ణుడు గోవర్ధన గిరిని ఎత్తి ఇంద్రుడు కురిపించిన వర్షభీభత్సం నుంచి గోకులాన్ని రక్షించాడు. గోవులను కాపాడి పాలించేవాడు కనుకనే గోపాలకుడయ్యాడు. గోవ



## అల్లరి పనులు కావవి!

కిట్టయ్య అల్లరి పనులు అన్నీ ఇన్నీ కావు. ఆ చిన్ని కృష్ణుని చిలిపి పనులు చూస్తే ఎవరికైనా ముచ్చటేస్తుంది. గోకుల బాలకునిగా కన్నయ్య నడిపిన మధుర లీలలు వింటే ప్రతి ఒక్కరూ పరవశించాల్సిందే. ఆయన చేసిన అల్లరి పనులు, సరససల్లాపాల వెనుక ఓ అర్థం పరమార్థం దాగి ఉన్నాయి. ఈ పరమార్థాన్ని గ్రహించాలంటే, శ్రీకృష్ణతత్వాన్ని లోతుగా అధ్యయించాల్సిందే. ధర్మపరిరక్షణలో రాగద్వేషాలకతీతంగా వ్యవహరించినవాడు శ్రీకృష్ణుడు. జీవితంలోని ప్రతీ దశలోనూ మనిషి విజయం సాధించడం అంత తేలికైన విషయం కాదు. కానీ ద్వాపరయుగ జన్మకాలంలో అతడు నిర్వహించిన ప్రతి బాధ్యతలోనూ తనదైన ముద్ర వేసుకున్నాడు కన్నయ్య. అందుకే పరంలో మోక్షాన్ని అందించే భగవంతునిగానే కాదు ఇహంలో విజయం సాధించేందుకు మార్గం చూపే గురువుగా కూడా ఆయనని పూజిస్తారు.

ర్ధనగిరిని ఎత్తినవాడు కనుకనే గోవర్ధనగిరిధారి అయ్యాడు. సుమధుర మురళీగానలోలుడు కనుకనే మురళీ మోహనుడయ్యాడు.

### అన్నాచెల్లీ బంధానికి ప్రతీక

చెల్లెలి మనసు తెలిసినవాడు శ్రీకృష్ణుడు. చెల్లెలు సుభద్ర అర్జునుని ఇష్టపడుతోందని తెలుసుకుని వారిద్దరికీ వివాహం జరిగేలా చేశాడు. ఈ అన్నాచెల్లెళ్ళ బంధానికి ప్రతీకగా సుభద్రా సహిత బలరామ కృష్ణులు పూరీ జగన్నాథ్ ఆలయంలో విలసిల్లుతూ పూజలందుకుంటున్నారు. వీరి ప్రేమకు గుర్తుగా ప్రజలు ఏటేటా రథోత్సవం నిర్వహిస్తున్నారు. 'అన్న' అని పిలిచినా, అన్నయ్య అనే మాట చెప్పినా శ్రీకృష్ణుడికి ప్రాణం. పాండవ సతి ద్రౌపది తన చెల్లెలికి సవతి. అయినా ద్రౌపదిని తన సొంత చెల్లెలుగానే భావించాడు కృష్ణుడు. కురుసభలో ద్రౌపదీ వస్త్రాపహరణం చేస్తుంటే పాండవులు సైతం నేల చూపులు చూసిన వేళ రక్షాబంధనానికి గుర్తుగా నిండు సభలో ఆమె గౌరవాన్ని నిలబెట్టింది శ్రీకృష్ణుడే. కృష్ణా నన్ను నువ్వే కాపాడాలి అని ఆరోజు ద్రౌపది శ్రీకృష్ణుని శరణు వేడుకుంది. తనను నమ్మి శరణు వేడిన వారిని ఎప్పుడూ కాపాడతానని అభయమిచ్చేవాడు శ్రీకృష్ణుడు.

### దుష్ట శిక్షణ శిష్ట రక్షణ

**యథాయథాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత**
**అభ్యుద్ధానమధర్మస్య తథాత్మానం సృజామ్యహం**

ఎప్పుడైతే ధర్మానికి హాని సంభవిస్తుందో అప్పుడు తాను అవతారం ఎత్తుతానని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మే స్వయంగా చెప్పాడు. అన్ని లోకాలు శ్రీకృష్ణుడిలోనే ఉన్నాయి. ఆయన కాలి మువ్వలు పాతాళం, రసాతలం. ఆయన మోకాళ్ళ ప్రదేశం మహాతల లోకం. ఆయన హృదయం సురలోకం. ఆయన నాభి అనంతాకాశం. ఆయన శిరస్సు సత్యలోకం. దుష్టశిక్షణ, శిష్టరక్షణ దైవ లక్షణం కదా! అందుకే పూతనాది రాక్షసులను సంహరించాడు. కంసుణ్ణి హతమార్చాడు. యమునా నదీజలాలకు విష విముక్తి ప్రసాదించేందుకు, కాళీయుని కోరల్లోంచి వెలువడుతున్న విషం నుంచి పశుపక్ష్యాదులను రక్షించేందుకూ కాళీయమర్దనం చేశాడు.



### ధర్మక్షేత్రే కురుక్షేత్రే

మహాభారత సంగ్రామానికి మూలపురుషుడిగా నిలిచినా, యుగపురుషునిగా అవతరించినా అది శ్రీకృష్ణుడికే చెల్లింది. భగవద్గీత బోధనలతో ఆయన చెప్పిన వ్యక్తిత్వ వికాస పాఠాలు అనుసరణీయ మార్గాలు. తరచి చూస్తే అన్నింటా ఆ శ్రీకృష్ణ రూపమే. అంతా కృష్ణతత్వమే. నల్లనయ్య ప్రతిచేష్టలోని పరమార్థమూ లోకహితమే. కౌరవ పాండవ సంగ్రామం అనివార్యం అని తెలిసి కూడా తన వంతుగా సంధి యత్నాలు చేశాడు శ్రీకృష్ణుడు. రాయబారిగా యుద్ధాన్ని నిలవరించలేని పరిస్థితుల్లో అర్జునుడికి రథసారథిగా మారి మార్గ నిర్దేశనం చేశాడు. తనవారిని పరమార్చలేననీ యుద్ధం చేయననీ అన్నప్పుడు గీతాబోధతో అర్జునునికి కర్మసిద్ధాంతం, జీవితసారం బోధించాడు శ్రీకృష్ణుడు. చాలామంది జీవితాల్లో ఆ గీతా సారాంశం మార్పులు తీసుకుని వచ్చింది. భగవద్గీతకు మించిన వ్యక్తిత్వవికాస గ్రంథం మరొకటి లేదు. అందుకే శ్రీకృష్ణుడు గీతాచార్యుడయ్యాడు.

**జయతు జయతు దేవో దేవకీ నందనోయం**
**జయతు జయతు కృష్ణో వృష్ణి వంశ ప్రదీపః**
**జయతు జయతు మేఘశ్యామలః కోమలాంగో**
**జయతు జయతు పృథ్వీభారనాశో ముకుందః**

ఓ దేవకీ నందనా! ఓ వృష్ణివంశ మంగళ దీపమా! సుకుమార శరీరుడా! మేఘశ్యామ! భూభారనాశకా ముకుందా! నీకు సర్వదా జయమగుగాక! అంటూ ఆ కృష్ణ పరమాత్మను ఈ కృష్ణాష్టమి పర్వదినాన మనసారా స్మరించుకుందాం.

**- సంతోషలక్ష్మి దహగాం**

## శ్రీకృష్ణాష్టమి పూజ

లీలామానుషధారుడైన ఆ బాలకృష్ణుని బాల్యక్రీడలను స్మరించుకుంటూ అందుకు గుర్తుగా ఉట్టి కొడతారు, చిన్న పిల్లలను కృష్ణునిలా అలంకరించి వారి పాదాలతో చిన్ని చిన్ని అడుగులు వేయించి వాటిని సాక్షాత్తూ రేపల్లె చిన్ని కృష్ణుని పాదముద్రలుగా భావిస్తారు. శ్రీకృష్ణుడే తమ ఇంటికి వచ్చాడనే తియ్యని అనుభూతికి గురిచేస్తాయి పాదముద్రలు. పొన్నపూలతో బాలకృష్ణుని విగ్రహానికి పూజలు చేస్తారు. ధూపదీప నైవేద్యాలర్పిస్తారు. మినపపిండి, పంచదార మిశ్రమంతో చేసిన పదార్థాన్ని జన్మాష్టమిరోజున స్వామికి నైవేద్యంగా సమర్పిస్తారు. మరికొందరు శొంఠి, బెల్లం పానకం, నెయ్యి కలిపి చేసిన మిశ్రమాన్ని నైవేద్యంగా సమర్పిస్తారు. కృష్ణుడికి ఇష్టమైన బెల్లం కలిపిన అటుకులు, వెన్న, మీగడ, పాలు తప్పనిసరిగా నివేదన చేస్తారు. ఇలా పదహారు రకాల పిండివంటలతో నైవేద్యం పెడతారు. కృష్ణుడు జన్మించిన సమయం అర్ధరాత్రి కాబట్టి జన్మదినోత్సవాన్ని చాలా చోట్ల అర్ధరాత్రి జరుపుకుంటారు.



# మా ఊరి మట్టి వాసన

## మల్లాది రవిశంకర్

**ఏళ్ళ తర్వాత మళ్ళీ ఉత్తరాన్ని చూస్తున్నాను. స్మార్ట్‌ఫోన్లు, ఈ-మెయిల్స్, వాట్సాప్‌లు, వీడియోకాల్స్ పెరిగిన తర్వాత, ఉత్తరాలు మరుగున పడిపోయాయి. గొలుసుకట్టు రాతతో నాన్ననుండీ వచ్చిన ఉత్తరం మా ఊరి మట్టి వాసనను నింపుకుని వచ్చింది.**

నాన్న ఉత్తరాన్ని ఇష్టంగా నిమిరి మళ్ళీ చదవటం మొదలు పెట్టాను.

చిరంజీవి శంకరానికి,

ఆశీస్సులు. ఉభయ కుశలోపరి. మనవరాలు ప్రవీణ పెళ్లి కుదిరిందని నీ నుండి తెలిసిన వార్త విని అమ్మా, నేనూ చాలా సంతోషించాం. పెళ్ళి కొడుకు వాళ్ళు మనవైపు వాళ్ళే, మనవాళ్ళే అని తెలిసి ఇంకా చాలా సంతోషించాం. అమ్మాయి ఇంకా పసిదానిలాగానే అనిపిస్తోంది అమ్మకీ, నాకూ. అప్పుడే పెళ్ళి కూతురవుతోంది. మా శుభాకాంక్షలు పిల్లకీ, కోడలికి కూడా చెప్పు నాన్నా!

నాన్నా! మా వయసు అయిపోయింది. అంతే కాక అమ్మకి మోకాళ్ల నొప్పులు. ఆ దేశంలో చలి కూడా బాగా ఎక్కువ. ఈ వయసులో అమ్మా, నేనూ అంతదూరం ప్రయాణం చేసి దేశాంతరాలు రాలేము తండ్రీ. మా ఆశీస్సులు మీ అందరికీ ఎప్పుడూ ఉంటాయ్.

ఏదో మనసు ఊరుకోక ఇలా రాస్తున్నాను. ఏమీ అనుకోవద్దు. అమ్మాయి పెళ్ళి మన ఊళ్ళో, మన ఇంట్లో, మన సంప్రదాయం ప్రకారం చెయ్యొచ్చు కదా! తరాలుగా మన తాత తండ్రులు సుఖదుఃఖాలు పంచుకున్న ఇల్లు మనది. ఈ ముంగిట మనవరాలి పెళ్ళి జరిగితే అమ్మా, నేనే కాదు, మన పెద్దలందరూ ఏ లోకాన ఉన్నా సంతోషంగా పిల్లల్ని దీవిస్తారు. నీ కెరీర్ కోసం విదేశాలకు వెళ్ళావు బానే ఉంది. కనీసం పిల్ల పెళ్లయినా నువ్వు పుట్టిపెరిగిన ఈ గడ్డ మీద చేస్తే చాలా బాగుంటుంది నాన్నా.

ఆడపిల్ల పెళ్ళికి మన ఇంట ఒక ఆచారం ఉంది. మంగళ సూత్రానికి అయ్యే ఖర్చులో కనీసం ఒక రూపాయి అయినా, కొక్కిలిగడ్డలో మండవ వారి నుండీ, చలసాని వారి నుండీ తీసుకోవటం మన ఆచారం. వాళ్ళింటి పెళ్ళిళ్ళకి మన మంత్రం, మన ఇంటి ఆడపడుచు పెళ్ళికి మంగళ సూత్రం ఖర్చు కొంచెం వాళ్ళు భరించటం రివాజుగా వస్తోంది. మన మంత్రంలో వాళ్ళింటి పెళ్ళి జరిగితే వాళ్ళ ఆడపడుచులు సుఖసంతోషాలతో, సిరి సంపదలతో, పిల్లా పాపలతో హాయిగా ఉంటారని వాళ్ళ నమ్మకం. మంగళ సూత్రం ఖర్చులో వాళ్ళ డబ్బు పడితే మన పిల్లలకి మాంగల్య బలం. ఇది తరాలక్రితం చేసుకున్న ఒప్పందం. మన పౌరోహిత్యాన్ని అడుసుమిల్లి వారికి అప్ప చెప్పేసినా, ఇలా మంగళసూత్రానికి వారి నుండీ కొద్దిగా డబ్బు తీసుకోవటం మనం ఇంకా పాటిస్తూనే ఉన్నాం. వాళ్ళు మనింట ప్రతి పెళ్ళికీ వాళ్ళకి తోచిన సహాయం చేసి ఆ రివాజుని కాపాడుతున్నారు. నీకు గుర్తుందో లేదో, అక్క పెళ్ళికి కూడా మనం వాళ్ళింటికి వెళ్ళాం. మన ప్రవీణ పెళ్ళి ఇక్కడ నా మాటని మన్నించి జరిపితే, వాళ్ళ సహాయం తీసుకుందాం. ఇక్కడ డబ్బు ముఖ్యంకాదు. తరాలుగా వస్తున్న ఆచారాన్ని ఆచరించటం. అది మనకి శ్రీరామరక్ష. వారికి అది యశస్సు. ఇక్కడే పెళ్ళి చెయ్యటానికి నువ్వు ఒప్పుకుంటే, నేనే అన్ని ఏర్పాట్లుచేసి అంగరంగ వైభోగంగా మనవరాలి పెళ్ళి జరిపిస్తాను. నాన్నా! పెద్దవాణ్ణి. ఏదో నాకు తోచిన సలహా ఇచ్చాను. నీకు ఎలా వీలయితే అలా చేసుకో. నీ వీలే ముఖ్యం. ఇక్కడ కాదన్నా నేను నీ కష్టం అర్థం చేసుకుంటాను. నువ్వు ఫీలవ్వద్దు.

కోడలికి, మనవరాలికి నావీ, అమ్మవీ ఆశీస్సులు చెప్పు.

ఇట్లు,
ప్రేమతో నాన్న.

నాన్న ఉత్తరం చాలా ఉల్లాసాన్ని ఇచ్చింది. ఇది ఒక కొత్త ఆలోచన. నాకు రాని ఆలోచన. దాదాపు నా వర్కింగ్ లైఫ్, పావని వర్కింగ్ లైఫ్ అంతా ఈ దేశంలోనే గడిచిపోయింది. చాలా కాలంగా నేనూ, పావనీ ఇక్కడి సిటిజన్స్. ప్రవీణ ఇక్కడే పుట్టడంతో అది ఈ దేశపు సిటిజన్, బై బర్త్. మా స్నేహితులూ, శ్రేయోభిలాషులూ అంతా ఇక్కడే ఉన్నారు. పెళ్ళి నాన్న చెప్పినట్టు ఇండియాలో పెట్టుకుంటే, వీళ్ళెవరూ రాలేరు.

కానీ, ఇండియాలో పెళ్ళి అనే ఆలోచన, చాలా ఎమోషనల్‌గా, ఇష్టంగా అనిపిస్తోంది నాకు. బహుశా పిల్లలూ, పావనీ కూడా సంతోషంగా ఒప్పుకుంటారు. ఒక మంచి ఛేంజ్‌గా, వేదమంత్రాల మధ్య మా పెళ్ళిలాగానే, ప్రవీణ పెళ్ళి కూడా నాన్న చెప్పినట్టు మా ఇంట్లో జరిగితే చాలా బాగుంటుంది. ఈ ఆలోచన పెళ్ళికొడుకు ప్రదీప్‌తోనూ, తన పేరెంట్స్‌తో కూడా డిస్కస్ చెయ్యాలి. నాకున్న ఎమోషనల్ ఫీలింగ్ వాళ్ళకి కూడా ఉండాలి కదా!



## నవ్యవీక్లి- నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కథ

ఇలా ఆలోచిస్తుండగా..

అక్క పెళ్ళికి నేనూ, నాన్నా మండవ వారింటికీ, చలసాని వారింటికీ మా ఊరి నుండి కొక్కిలిగడ్డ వెళ్ళిన సంఘటన గుర్తుకొచ్చింది.

'మండవ' వారింటికి వెళ్ళినప్పుడు, వాకిట్లోనే మమ్మల్ని చూసిన రంగయ్య చౌదరిగారు..

"రండి పంతులుగారూ!" అని సాదరంగా ఆహ్వానించారు. ఆయన ఏదో కంగారుగానూ, ఆందోళనగానూ ఉన్నట్టు ఆయన ముఖమే చెపుతోంది.

"సరైన సందర్భంలో వచ్చినట్టు లేము చౌదరిగారూ! మీరేదో ఆందోళనలో ఉన్నట్టున్నారు" అన్నారు నాన్నగారు.

చౌదరిగారు "అదేం లేదండీ" అని తల పంకిస్తూ...

"కోడలికి ప్రసవ వేదనలు వస్తున్నాయి పంతులుగారు. ఇంతకుముందు పుట్టిన ఇద్దరూ ఆడపిల్లలే. నాకూ, నలుగురు ఆడపిల్లల తర్వాత మా వాడు పుట్టాడు. కోడలు వైపు కూడా, వాళ్ళంతా ఆడపిల్లలే. మళ్ళీ ఆడపిల్లే పుడుతుందేమోనని కొంచెం కంగారు. ఆడయినా, మగయినా దేవుడిచ్చిన సంతానం, ఎవరైనా మన పిల్లలే కానీ మన ఇంటి పేరు నిలవాలి కదా! అదే కంగారు".

నాన్న చెప్పారు. "చౌదరిగారూ! మీ కోరిక తప్పక నెరవేరుతుంది. నేను చెపుతున్నాను" అని భరోసా ఇచ్చారు.

చౌదరిగారి ముఖం వెలిగిపోయింది. "మీ నోటి మాట నిజం కావాలి పంతులుగారూ" అంటూండగానే...

పురిటి గదినుండీ కబురు... చౌదరిగారికి మనవడు పుట్టాడనీ, తల్లీబిడ్డా క్షేమమనీ...

ఆయన సంతోషానికి అవధులు లేవు. నాన్న కాళ్ళని కళ్ళ కద్దుకున్నారు. మేము వచ్చిన పని తెలుసుకొని, తాంబూలంలో నూట పదహార్లు పెట్టడమే కాకుండా అక్క పెళ్ళికి కూడా వచ్చారు.

ఇక 'చలసాని' వారింటికి వెళ్ళాం. బుచ్చయ్య చౌదరిగారు గొడ్లసావడిలో ఉన్నారు. ఆవు మోర ఎత్తి బాధగా అరుస్తూ, ఈనడానికి అష్టకష్టాలూ పడుతోంది.

మమ్మల్ని చూడంగానే చౌదరిగారు, 'రండి! పంతులుగారూ" అంటూ చాలా ఆత్మీయంగా ఆహ్వానించారు.

"ఏమిటి చౌదరిగారూ! పశువు ఈతకి వచ్చిందా?" అన్నారు నాన్న.

"అవును పంతులుగారూ! ఇంతవరకూ ఈ వసారాలో మగ గిత్తలే కానీ, ఆడ ఆవుదూడలు పుట్టలేదు. ఈ తడవ గోమాత పుడితే బాగుంటుందని ఆశ".

"మీకు ఆవుదూడ ఆడది కావాలంటే, ఆ నల్లనయ్య అదే ఇస్తాడు. పైగా ఆయన క్షీరప్రియుడు. మీ కోరిక తప్పక తీరుతుంది" అన్నారో లేదో..

పాలేరు ముత్యాలు.. "దొరా! ఈ తడవ గిత్త కాదు. ఆడ ఆవుదూడ పుట్టింది" అన్నాడు సంబరంగా.

చౌదరిగారి ఆనందానికి అవధులు లేవు. "ఇంటి సావిట్లో గోమాత ఉండడం శుభం పంతులుగారూ! మీ రాకతో ఆ కోరిక కూడా తీరింది. మీ వాక్కుకున్న బలం.." అన్నారు సంతోషంగా.

మేము వెళ్ళటం.. వాళ్ళింట శుభం కలగటం చాలా యాదృచ్ఛికమే అయినా, ఎందుకో మా ఇంటి శుభకార్యం, వాళ్ళకీ శుభాలనిస్తుందని ఆ రోజు వాళ్ళకీ, మాకూ కూడా అనిపించింది.

ఇప్పుడు ప్రవీణ పెళ్ళికి మండవ వారింటికి వెళ్తే... అక్క పెళ్ళికి పుట్టిన ఆయన మనవడో, కొడుకో మాకు తాంబూల మిస్తారేమో! చౌదరిగారు కాలం చేశారని నాన్న చెప్పినట్టు గుర్తు. నా ఆలోచనలకి, నాకే నవ్వొచ్చింది. మా ఊరునీ, నాన్ననీ, అమ్మనీ తలుచుకుంటూ, ఆఫీసు నుండే ఇంటిదారి పట్టాను. వీలయితే, ఈ రోజే పావనితోనూ, ప్రదీప్ తల్లిదండ్రులతోనూ, పిల్లలతోనూ ఈ విషయం డిస్కస్ చెయ్యాలని అనుకున్నాను.

•••

పావనికీ, ప్రదీప్ తల్లిదండ్రులకీ నాన్న ఆలోచనని చెప్పగానే వాళ్ళు సంతోషంగా 'సరే' అన్నారు. మీ, మా పెద్దల సమక్షంలో మన పిల్లలపెళ్ళి మీ ఊళ్ళోనే, మీ ఇంట్లోనే జరిపిద్దా మన్నారు.

పిల్లలు కూడా చాలా ఎగ్జయిట్ అయ్యారు. పెళ్ళయి వచ్చాక ఇక్కడ గ్రాండ్‌గా రిసెప్షన్ ఇద్దామని అందరం కలెక్టివ్‌గా అనుకున్నాం. అందరినీ ఒకటే మాట మీద ఉంచటం కూడా మా పెద్దల చలవే అనిపించింది.

పెళ్ళికి రెండు రోజుల ముందు మేమూ, ఒక రోజు ముందు పెళ్ళి వారూ వస్తారని నాన్నకి తెలియపరిచాం. అమ్మా, నాన్నా చాలా సంతోషించారు. అన్ని ఏర్పాట్లు యథావిధిగా చేస్తామని భరోసా ఇచ్చారు. మనవరాలి పెళ్ళి మా ఇంట్లోనే అని తెలిసిన మరుక్షణం అమ్మ మోకాళ్ళ నొప్పులన్నీ ఎగిరి పోయాయని నాన్న చెప్పారు.

•••

ఇండియా వచ్చి, దాదాపు పదేళ్ళు అయింది.



ప్రతి రెండేళ్ళకూ అమ్మా, నాన్నే మా దగ్గరకు వస్తూండటంతో మేము రావటం తగ్గిపోయింది.

స్టేషన్‌కి నాన్న వచ్చారు. మా బావమరిది కూడా వచ్చాడు. వాడూ నేనూ, కలిసి చదువుకున్నాం.

చాలా కాలం తర్వాత కలుసుకోవటంతో...

"ఏరా! బామ్మర్దీ అంటూ నేనూ... "చెప్పరా! బావా!" అంటూ వాడూ ఒకళ్ళనొకళ్ళం గట్టిగా వాటేసుకున్నాం.

ఇవేం పిలుపులు.... ఎప్పుడూ వినలేదే అని మా అమ్మాయి నవ్వుతూ, మా ఆవిడ ముచ్చటగా మా వంక చూశారు. నాన్న స్టేషన్‌కి ఎడ్లబండి తీసుకొచ్చారు. సామానంతా అందులో పెట్టించి, అందరం విశాలంగా కూర్చున్నాం. మా అమ్మాయికి ఎడ్లబండి ఎక్కటం మొదటిసారి... చాలా ఎగ్జయిట్ అయింది.

కార్తీకమాసం అవటంతో కొంచెం చలిగాలి వేస్తోంది. దారంతా పచ్చని తివాచీ పరిచినట్టుగా పంట పొలాలూ, పొలం సరిహద్దుల్లో పెద్ద మనుషుల్లాగా తాడిచెట్లు, అక్కడక్కడ మామిడి తోపులూ, నిమ్మ, అరటి తోటలూ, కొబ్బరి, పనస చెట్లు..

ఊరూ, దారీ శోభాయమానంగా ఉన్నాయి.

బండి ఇంటికి చేరుకుంది. ఇల్లంతా పెళ్ళికళ కొట్టొచ్చినట్టుగా కనిపిస్తోంది. ఇంటికి రంగులు వేయించారు. వాకిట్లో తాటాకుల పందిరి వేయించారు నాన్న. పక్కన ఖాళీస్థలం కల్యాణ వేదికగా తీర్చిదిద్దారు. ఆవు పేడతో స్థలాన్నంతా చాలా బాగా అలికించి, నాముతో అందమైన ముగ్గులు తీర్చిదిద్దారు.

కోడలికీ, మనవరాలికీ, నాకూ అమ్మ దిష్టి నీళ్ళు తీసి, ఆత్మీయంగా అక్కున చేర్చుకుంది.

"నాన్న ఆలోచనకి విలువిచ్చి, మనింట్లో పెళ్ళి చెయ్యటానికి ఒప్పుకోవటం చాలా ఆనందంగా ఉందర్రా" అంటూ అమ్మ ఒకటే హడావిడి. పావనీ వాళ్ళ తల్లిదండ్రులు కూడా వచ్చేశారు. ఇల్లంతా చుట్టాలతో హడావిడిగా ఉంది. వేడినీళ్ళకి కాగులు వేసినట్టున్నారు. పనివాళ్ళు మా అందరికీ స్నానాలకి వేడినీళ్ళు తోడిపెట్టారు. అందరం స్నానాలు కానించుకొని, అమ్మ చేయించిన కమ్మని వంటకాలతో భోజనం చేశాం.



అమెరికాలో ఇళ్ళు లేని నిరాశ్రయుల కంటే ఖాళీగా ఉన్న ఇళ్ళ సంఖ్యే ఎక్కువ!

అంతకుముందే రుబ్బించిన గోరింటాకుని మనవరాలి చేతికి, కాళ్ళకీ, కోడలి చేతులకీ, కాళ్ళకీ అమ్మ చాలా అందంగా పెట్టింది. అమ్మలో ఇంత ఆర్ట్ ఉందా అని నేను ఆశ్చర్యపోయాను. పెళ్ళికూతురు కాళ్ళకి పారాణిలాగా గోరింటాకు పెట్టింది.

నా కూతురి పెళ్ళికి బాబాయిలూ, పిన్నులూ, పెదనాన్నలూ, అక్కలూ, చెల్లెళ్ళూ... ఇంతమంది రావటం.. అందరూ పనులు తమ మీద వేసుకొని చెయ్యటం... చూస్తుంటే సంతోషంతో కళ్ళు చెమర్చాయి.

తెల్లారుతూనే ప్రవీణని పెళ్ళికూతుర్ని చేసి.. మంగళ స్నానాలు చేయించారు.

నా కూతురు పెళ్ళికూతురు అలంకారంలో, ముద్దులు మూట కడుతోంది. రాత్రి కాళ్ళకీ, చేతులకీ పెట్టిన గోరింటాకు, చాలా ఎర్రగా పండి, తెల్లని దాని రూపానికి మరింత అందాన్నిస్తోంది. దానికి ఇదంతా ఒక కొత్త అనుభవం.

**ఉత్తరాలు కనుమరుగైపోయిన ఈ కాలంలో దేశాంతరాలు దాటి అతడికోసమే వచ్చిందా లేఖ. మా ఊరి మట్టివాసనను మోసుకొచ్చిందంటూ తెగ సంబరపడ్డాడు ఆ కొడుకు. తండ్రి దస్తూరీ చూసి మరింత మురిసిపోయాడు. ఆ ఉత్తరంలో ప్రతిపాదనలపై ఆలస్యం లేకుండా భార్యాబిడ్డలతో చర్చించాడు. పరాయిదేశ పౌరసత్వం అనుభవిస్తున్న అతడి కుటుంబం ఆ ప్రతిపాదనల్ని అంగీకరించిందా? అసలా ఉత్తరంలో ఏం ఉంది?**

నాన్నా, నేనూ మండవ వారింటికీ, చలసాని వారింటికీ వెళ్ళివచ్చాం. వాళ్ళు చాలా ఆత్మీయంగా మమ్మల్ని ఆహ్వానించి, తాంబూలం ఇచ్చి పంపారు. మా ఆచారాన్నీ, నమ్మకాన్నీ, బాంధవ్యాన్నీ పటిష్టం చెయ్యటానికన్నట్టు మేమక్కడ ఉండగానే మండవ వారి అబ్బాయికి ఏదో కోర్టు గొడవల్లో ఉన్న ఆస్తి వ్యవహారం తేలిందనీ, తామే గెలిచామనీ లాయర్ నుండి ఫోన్‌కాల్ వచ్చింది. వారి ఆనందానికి అవధులు లేవు.

సాయంత్రం పెళ్ళి కొడుకు ప్రదీప్, వాళ్ళ పేరెంట్స్, బంధువులూ చేరుకున్నారు. వాళ్ళందర్నీ స్టేషన్‌లో రిసీవ్ చేసుకొని చక్కని మంగళ వాద్యాల మధ్య విడిదికి తీసుకొచ్చాం. విడిదిలో ఏర్పాట్లన్నీ చాలా జాగ్రత్తగా చేశాం. వాళ్ళు రాగానే పెళ్ళికొడుక్కి అమ్మా, పావనీ దిష్టి తీసి, కాళ్ళు కడిగించి లోపలికి తీసుకొచ్చారు. పెళ్ళికొడుకు చాలా బాగున్నాడని ఊరు ఊరంతా చెప్పుకున్నారు. అందరికీ ముందుగానే కోయించి చల్లగా ఉండటానికి నూతిలో పడేసి తీయించిన కొబ్బరి బోండాలు కొట్టించి ఇచ్చాం. చాలా బాగున్నాయని ఇష్టంగా తాగారు. ఫలహారాలు కూడా వాళ్ళందరికీ చాలా నచ్చాయి.

రాత్రి భోజనం సంప్రదాయ తెలుగు వంటకాలతో వండించి వడ్డిస్తే పెళ్ళివారు చాలా ఇష్టంగా తిన్నారు. అరిటాకుల్లో వడ్డన. మన కందిపొడి, గోంగూర పచ్చడి, స్వచ్ఛమైన కమ్మని నెయ్యిని అందరూ మళ్ళీమళ్ళీ వేయించుకుని తిన్నారు. విస్తరికీ విస్తరికీ మధ్య అరటికాయల్ని గుండ్రంగా తరిగి, అందులో సువాసనకోసం అగరుబత్తీని వెలిగించి పెట్టాం. మా చిన్నప్పటి పెళ్ళిళ్ళకి ఇలాగే చేసేవారు.

పెళ్ళికొడుకు తండ్రి నిజంగా చిన్నపిల్లాడయిపోయాడు. మా ఊరూ, పెళ్ళి ఏర్పాట్లూ ఆయనకి తెగ నచ్చాయి.

'ఏర్పాట్లలో ఏ లోపం ఉన్నా చెప్పండి, సరిదిద్దుకుంటాం' అని ఆయనకి చెపితే..

ఏర్పాట్లకేమండి! భేషుగ్గా ఉన్నాయ్. మళ్ళీ చిన్నతనాన్ని గుర్తుచేశారు. ఉత్సాహం తట్టుకోలేక... గోచీ పెట్టుకొని గోదార్లో దూకి ఈతలు కొట్టాలనిపిస్తోంది అన్నారు ఆనందంగా. ఇక మా బావగారు విష్ణుశర్మగారి పెళ్ళి పాటలు అద్భుతంగా, భావగర్భితంగా, హాస్యరస మేళవంగా ఉన్నాయి.

ఈ పెళ్ళి మాలోని చిన్నపిల్లల్ని మళ్ళీ నిద్రలేపింది. అందరం ఒక ఫ్యామిలీగా, ఒక యూనిట్‌గా అయిపోయాం.

తెల్లారగానే ప్రదీప్‌ని పెళ్ళికొడుకుని చేశారు. వేద మంత్రాల మధ్య స్నాతకం జరిగింది. కాశీ యాత్ర ఆపటమనే ఘట్టం చాలా సరదాగా జరిగింది. ప్రదీప్ వాళ్ళ పేరెంట్స్, మేమూ బంధుజనం అందరం చాలా ఎంజాయ్ చేశాం.

వరపూజా, మా అమ్మాయి గౌరీపూజా, బ్రాహ్మణులచే చెప్పబడిన మా ఇద్దరి గోత్రప్రవరా చాలా శాస్త్రోక్తంగా జరిగింది. మా వియ్యాల వారు ప్రతి క్షణాన్నీ బాగా ఎంజాయ్ చేశారు.

పెళ్ళికూతురు అవతారంలో ప్రవీణ, పెళ్ళికొడుకు అలంకారంలో ప్రదీప్ శ్రీమహావిష్ణువు, లక్ష్మీదేవి లాగా కళకళలాడి పోయారు.

ముహూర్త సమయానికి ప్రవీణ మేనమామలు ప్రేలగంపలో పెళ్ళికూతుర్ని కూర్చోబెట్టి తెస్తుంటే అది చాలా పావనంగా లక్ష్మీకళతో కళకళ లాడింది.

జీలకర్రా బెల్లం, మంగళసూత్రధారణ సరిగ్గా సుముహూర్తానికి నిర్విఘ్నంగా జరిగిపోయాయి ముహూర్త బలం వల్ల.

నా తల్లికి మధుపర్కం కట్టి ముత్తయిదువులు దీపాలతో వేదిక మీదకి తీసుకు వస్తుంటే... నిజంగా అమ్మవారి లాగానే ఉంది.

ఇలా ప్రతిఘటనా జీవితకాలం మా గుండె గోడల్లో పదిలంగా మిగిలిపోయేలాగా జరిగింది మా అమ్మాయి పెళ్ళి.

ఆఖరి ఘట్టం అప్పగింతలు. నిజంగా చాలా ఉద్వేగాన్ని నింపుకున్నాయి. పాలల్లో నా చిట్టితల్లి చేతులు ముంచి, ఇంతకాలం అపురూపంగా పెంచుకున్న నా కూతుర్ని, అప్పుడే అయిన భర్తకీ, అత్తమామలకీ అప్పగించి, దాని ఇంటిపేరుని ఇంత తేలిగ్గా మార్చేశానా? అనిపించి కళ్ళ నీళ్ళు ఆగలేదు. పావని కూడా ఏడ్చింది. ఎంత చదువుకున్నా, ఏ పొజిషన్‌లో ఉన్నా, ఉద్యోగపరంగా ఎంత పెద్ద బాధ్యతలు మోస్తున్నా, పిల్ల పెళ్ళి ఇలాగే ఎమోషనల్‌గా ఉంటుందేమో! నేను పుట్టిన ఈ గడ్డ మీద. నా ఇంట్లో పెద్దల సమక్షంలో పంచభూతాల సాక్షిగా నా కూతురు పెళ్ళి అంగరంగ వైభవంగా జరిపించారు నాన్న.

నాన్న ఆ రోజు ఆ ఉత్తరాన్ని రాయకపోతే మళ్ళీ మా ఊరి మట్టివాసనని ఇలా చూడగలిగే వాడినేనా? ఆ సౌరభాలని ఇలా ఆస్వాదించగలిగేవాడినేనా?

సెల్: ***98663 44590***

# సురభి



## ఎడారి హోటల్

ఎడారుల్లో దాహార్తి తీర్చుకోవాలంటే ఒయాసిస్సులే దిక్కు. ప్రయాణం చేయాలంటే ఒంటెలు మాత్రమే దిక్కు. జనసంచారం, రణగొణధ్వనులు ఉండవు సరికదా, ఎటుచూసినా ఇసుకదిబ్బలే దర్శనమిస్తాయి. మరి అలాంటి ఎడారిలో ఓ అద్భుతమైన హోటల్ నిర్మిస్తే! మంగోలియా ఎడారిలో సరిగ్గా అలాంటి హోటలే నిర్మించారు.

మంగోలియా దేశం గ్జియాంగ్‌షావన్ ఎడారిలో 'డెజర్ట్ లోటస్ హోటల్' నిర్మించారు. పేరుకు తగ్గట్టే ఇది తామరపువ్వు ఆకారంలో ఉంటుంది. రిసార్ట్ ఆవరణలో కాంక్రీట్ ఉపయోగించకుండా నిర్మించిన ఏకైక సృష్టి ఈ హోటల్! అంతేకాదండోయ్, దూరంనుండి చూస్తే ఈ హోటల్ ఇసుకలో తేలుతున్నట్లు కనిపిస్తుంది. ఇన్ని ప్రత్యేకతలున్న ఈ హోటల్‌కు వచ్చే పర్యాటకులకు సాంస్కృతిక ప్రదర్శనలు ఒక ప్రత్యేక ఆకర్షణ. మంగోలియా సంస్కృతిని ప్రతిబింబించే ఒంటె సవారీ, ఎడారి సర్ఫింగ్ లాంటి ఎన్నో వినోద కార్యక్రమాలు నిర్వహిస్తారు. వెరైటీగా, సరదాగా గడపాలనుకునే పర్యా టకులకు ఈ హోటల్ ఓ మంచి చాయిస్!

## కోకోనట్ ప్యాలెస్

భగవంతుడికి కొబ్బరికాయలు సమర్పిస్తాం. ఆరోగ్యానికి కొబ్బరిబోండాలు తాగుతాం. కొబ్బరాకులతో ఇంటి పైకప్పులు వేస్తాం. కానీ కొబ్బరిల్లు ఎక్కడైనా చూశారా! అయితే ఫిలిఫ్ఫీన్స్ వెళదాం పదండి. అక్కడి కోకోనట్ ప్యాలెస్‌ను చూస్తే నోరు తెరవాల్సిందే!

సాధారణంగా ఇళ్ళను ఇటుకలు, సిమెంట్‌తో నిర్మిస్తారు. కానీ ఈ ప్యాలెస్‌ను మాత్రం కొబ్బరి చెట్ల కొమ్మలు, ఆకులు, కాయలు, కాండం, వేర్లు...ఇలా అన్ని భాగాలను ఉపయోగించి నిర్మించారు. దీన్నే 'తహనంగ్ ఫిలిప్పినో' అని కూడా పిలుస్తారు. సిమెంటు పిల్లర్లకు బదులుగా కొబ్బరి చెట్టు మొదళ్ళను, పైకప్పుకి కొబ్బరి ఆకులను ఉపయోగించారు. నారతో కార్పెట్లు, కొబ్బరి చిప్పలతో షాండ్లియర్స్, డైనింగ్ టేబుళ్ళు రూపొందించారు. 1978 నాటి దేశాధ్యక్షుడు ఫెర్దినాండ్ మార్కోస్ సతీమణి ఇమెల్డా మార్కోస్ అభిరుచి మేరకు కోటి డాలర్లు ఖర్చుపెట్టిమరీ ఈ వైవిధ్యమైన ప్రత్యేక ప్యాలెస్ నిర్మించారు. సంపూర్ణంగా కొబ్బరిచెట్టులోని భాగాలను మాత్రమే ఇందులో ఉపయోగించారు.

ప్రస్తుతం ఈ ప్యాలెస్ ఆ దేశ ఉపాధ్యక్షుడి అధికారిక భవనంగా మారింది. అంతేకాదు, సందర్శకులను ఈ ప్యాలెస్ ఎంతో ఆకర్షిస్తోంది. ఈ భవనం అందాలు తిలకించేందుకు ప్రత్యేక సమయాల్లో పర్యాటకులను అనుమతిస్తుంటారు.

-నర్మద వాసిరెడ్డి



## కరగని ఐస్‌క్రీం

ఐస్‌క్రీం చూస్తే కొనేదాకా చేతులు ఊరుకోవు. తీరా కొన్నాక అది కరిగిపోతుంటే ఆబగా, గబగబా మింగేస్తాం. ఐస్‌క్రీం కరగకుండా ఉంటే ఎంత బాగుణ్ణు! మెల్లగా, తనివితీరా తినేవాళ్ళం కదా! అని చాలామంది అనుకోకుండా ఉండరు. ఇక అలా అనుకోవాల్సిన అవసరం లేదంటున్నాడు రాబిన్ కాలిగ్‌సన్. ఎందుకంటే అతడు కరగని ఐస్‌క్రీం తయారుచేశాడు కదా మరి!

లండన్‌కి చెందిన రాబిన్ కాలిగ్‌సన్ దాదాపు మూడున్నర సంవత్సరాల పాటు శ్రమించి ఈ కరగని ఐస్‌క్రీం తయారుచేశాడు. దీనికోసం ఉద్యోగాన్ని, సొంత ఇంటిని వదిలిపెట్టి ఎన్నో ప్రాంతాలు తిరుగుతూ, వివరాలు సేకరిస్తూ, చివరాఖరికి లక్ష్యాన్ని సాధించాడు. దానికి 'గ్యాస్ట్రోనట్ ఐస్‌క్రీం' అని పేరు పెట్టాడు. ఇంకా ఇందులో మెక్సికన్ చాక్‌లెట్ చిప్, కుకీస్ క్రీమ్, మింట్ చాక్‌లెట్ ఫ్లేవర్స్ ఉన్నాయి. అధిక ఉష్ణోగ్రత వద్ద కూడా ఇది ఘనపదార్థంగానే ఉంటుంది తప్ప కరగదు. ఈ ఐస్‌క్రీం మార్కెట్లో అందుబాటులో ఉంది.

## లింగమే లేని ఆలయం



శివలింగం లేని శివాలయాన్ని ఎక్కడైనా చూశారా? కానీ కేరళలో అలాంటి శివాలయం కనిపిస్తుంది. కేరళ చరిత్రలో సాంస్కృతిక రాజధానిగా విలసిల్లిన త్రిస్సూర్ (తిరుశివపెరూర్)లో ఉన్న వడక్కునాథన్ ఆలయాన్ని పరశురాముడు నిర్మించాడని చెబుతారు. పురాతన, చారిత్రక ప్రాశస్త్యమున్న ఈ ఆలయం అనేక కళలకు నిలయం. పురాతన ఆలయం అని చెబుతున్నారు కదా, మరి శివలింగం ఉండకపోవడమేమిటి? అనుకోకండి. ఇక్కడ శివలింగం ఉంది! కానీ వందల సంవత్సరాలుగా ఈ శివలింగానికి నెయ్యితో అభిషేకాలు చేసీ చేసీ అది ఒక గుట్టలా పేరుకుపోయిందని అంటారు. దాదాపు అయిదారు మీటర్ల ఎత్తున్న నెయ్యిగుట్ట కింద శివలింగం కప్పబడిపోయిందట. ఆ నెయ్యి కాస్తా గడ్డకట్టుకుపోయింది. అది మండే ఎండల్లోనూ కరగదు, వాసననూ వెదజల్లదు. అదీ సంగతి! ఏడాదిలోపు పిల్లలను ఈ ఆలయంలోకి అనుమతించరు. లోపలికి ప్రవేశించాలంటే సంప్రదాయ వస్త్రధారణ తప్పనిసరి. మహాశివరాత్రి పర్వదినాన లక్ష దీపాల అలంకరణతో తేజోవంతంగా భాసిల్లుతూ భక్తులకు కనువిందు చేయడం ఈ ఆలయ ప్రత్యేకత. ప్రపంచంలో శివలింగం కనిపించని ఏకైక శివాలయం ఇదొక్కటేనేమో!

5

# వెట్టి

(ది వారియర్)

-మధుబాబు



**తడి ఆరిపోయినట్లు తయారైన పెదవుల్ని నాలుకతో తడి చేసుకుంటూ ఆ వెహికల్స్‌లో ఉన్న వారందరినీ లెక్కపెట్టాడు అతను కనులతోనే.**

**దగ్గర దగ్గరగా పాతికమందికి పైనే ఉన్నట్టు అనిపిస్తోంది. కర్రలున్నాయి కొందరి దగ్గర... లావుపాటి ఐరన్‌రాడ్స్ ఉన్నాయి. బయటికి కనిపించకపోయినా, అందరిదగ్గరా పదునైన పేష్కప్‌లు డెఫినెట్‌గా ఉండే ఉంటాయి.**

బస్‌స్టేషన్ ముందు భాగంలోకి పోయిన పిచ్చమ్మి ఉన్నట్లుండి ఆగిపోయింది మెయిన్ ఎంట్రన్స్ దగ్గర.

ముడి ఊడిపోయి భుజాల మీదికి పరుచుకుంటున్న తన తలకట్టును తిరిగి గట్టిగా మెలిపెట్టి పైకి ముడుచుకుంటూ నిలబడి చుట్టూ చూస్తోంది ఆమె.

అప్పుడు తెలిసివచ్చింది అతనికి తాను చేసిన తప్పు. మట్టిరోడ్డుమీది నుంచి బస్‌స్టేషన్ వరకూ పోవటం వరకే ఆలోచించాడు తను. అక్కడినుంచి ఎటుగా పరిగెత్తాలో డిసైడ్ చేసుకోలేదు. ఆమెకు చెప్పలేదు.

పెద్దపెద్ద కనులను ఇంకా పెద్దవి చేసి, దేదీప్యమానంగా వెలుగుతున్న బస్‌స్టేషన్‌లోని కరెంట్ దీపాల వంక చూస్తోంది ఆమె.

'పరిగెత్తు తల్లీ.. ముందు నువ్వు అక్కడి నుంచి అవతలికి పరిగెత్తు. అందరి కళ్ళూ నీ మీదే ఉన్నాయి. అందరూ నీ వైపే చూస్తున్నారు' తనలో తను బిగ్గరగా అరుచుకున్నాడు అతను.

మనసులోని మాటలు ఆమెకు వినబడే అవకాశం లేదు గనుక, నిలబడిన ప్రదేశంలోంచి ఒక్క అంగుళం కూడా అవతలికి పోలేదు ఆమె.

'ఏందమ్మో.. ఎవరివి నువ్వు? యాడికి పోతున్నావ్?' ఉన్నట్లుండి విచిత్రంగా అడుగుతూ ఆమె ముందుకు పోయాడు ఒక పర్సనాలిటీ.

తలకట్టును ముడి వేసుకోవటం పూర్తి చేసుకుని, చేతుల్ని దుమ్ము ధూళితో కొంచెం మలినంగానే కనిపిస్తున్న పమిటె చెంగుకు తుడుచుకున్నది పిచ్చమ్మి.

'నిన్నే అమ్మి... నిన్నే అడుగుతున్నా... యాడికి పోతున్నావ్!' మరికొంచెం దగ్గరికి జరిగి - ఇంకా కొంచెం వెకిలిగా అడిగాడు ఆ మనిషి.

అతనికి తెలియకుండానే బిగుసుకున్నాయి వెట్టి పిడికిళ్ళు. ఎర్రబడ్డాయి కనుకొలకులు. ముందుకు వంగి నేలను తడిమి, ఏదైనా పలుకురాయిని అందుకోవాలని, తన దుస్తుల్లోనే భద్రపరచుకుని ఉన్న నాటు రివాల్వర్‌ని బయటికి తీయాలని వెంటవెంటనే అనిపించాయి.

పబ్లిక్ ప్లేసుల్లో, పదిమందీ చూస్తుండగా ఆ పనులు చేస్తే, ఆ తరువాత ఎదురయ్యే పరిణామాల్ని తట్టుకోవటం చాలా కష్టమైపోతుందన్న ఆలోచన అతన్ని కట్టడి చేసేసింది.

'కదులు తల్లీ, ముందు నువ్వు అక్కడి నుంచి కదులు..' మరోసారి మనసులోనే అనుకుంటూ, తను నిలబడిన ప్రదేశంలో నుంచి ముందుకు నడిచాడు.

'మాట్లాడవేంటి? మూగదానివా? మాటలు రావా? యాడి నుంచి వస్తున్నావ్?' అని అడుగుతూ ఇంకాస్త ముందుకు జరిగి, పిచ్చమ్మి చేతిని పట్టుకోబోయాడు ఆమె దగ్గరికి పోయిన మనిషి.

కంటికి కనిపించనంత వేగంతో కదిలింది పిచ్చమ్మి చేయి. టపాకాయ పేలినట్లు ఛట్‌మంటూ వినవచ్చింది శబ్దం.

కళ్ళవెంట నీళ్ళు గిర్రున తిరుగుతుండగా చెంపను అదుముకుంటూ రెండు అడుగులు వెనక్కి జరిగాడు ఆ మనిషి.

'నేను యాడినుంచి వస్తే నీకెందుకురా? నిన్నేమైనా దగ్గరికి పిలిచి దారి అడిగానా? పిచ్చివేషాలు వేస్తే మొఖం పగిలి పోతుంది జాగ్రత్త' ఖంగు

CHANDU

మంటున్న కంఠంతో హెచ్చరించింది ఆమె.

'కొడ్తావా? నన్నే కొడతావా? ఎవర్నో తెలుసా నేను?' చ(్రున రోషం ముంచుకు వస్తుండగా అడిగాడు అతను.

'నువ్వు ఎవరివైతే నాకెందుకురా? పో అవతలికి' అంటూ పక్కకు తిరిగి, బస్‌స్టేషన్ పక్కనే ఉన్న ఒక వీధి వైపు బయలుదేరింది పిచ్చమ్మి.

వేగంగా కదిలి తన చేతుల్ని జాచి, ఆమె తలకట్టును పట్టుకోబోయాడు ఆ మనిషి.

దగ్గర దగ్గరగా నలభై యాభై మంది జనం ఉన్నారు బస్‌స్టేషన్ ముందు. దాదాపు పాతికపైగా ఉన్నాయి రకరకాల దుకాణాలు. నోళ్ళు తెరుచుకు చూస్తున్నారు వాటిలోని యజమానులు. తమకు ఏమీ పట్టనట్లు నిర్లిప్తంగా నిలబడి ఉన్నారు బయటి జనం.

'ముక్కుమొహం తెలియని ఆడమనిషిని పట్టుకుని అసహ్యంగా ప్రవర్తించటం పద్ధతి కాదు' అంటూ అతని వెనుకే ప్రత్యక్షం అయ్యాడు వెట్టి.

అంతటితో ఆగలేదు. ఆ మనిషి మెడను బిగించి పట్టుకుని బ(్రున వెనక్కి లాగాడు.

ఎప్పుడయితే ఆ మనిషి తన తలకట్టును పట్టుకోబోయాడో, పళ్ళు పటమని కొరుకుతూ అతనికేసి తిరుగుతున్న పిచ్చమ్మి కోపం చిటుక్కున మాయమైపోయింది వెట్టిని చూస్తూనే.

'నువ్వు వస్తావని అనుకుంటూనే ఉన్నాను. అనుకున్నంత వేగంగా రాలేదు. వేసేయ్ వెధవని.. మొఖం పగలగొట్టేయ్..' నవ్వుతూ చెప్పింది.

తన నెత్తిమీద టపటపా చరుచుకోవాలన్న కోరికను అతి బలవంతంగా అదుముకున్నాడు వెట్టి. ఆమెకు, తనకు పరిచయం లేనట్టు ప్రవర్తిస్తూ, అవతలికి వెళ్ళిపోవాలన్న తన ఆలోచన చిటికెలో మట్టికొట్టుకుపోయింది.

మెడను పట్టుకున్న అతని చేతిని విదిలించి కొట్టాడు ఆ మనిషి. 'ఎవడ్రా నువ్వు? ఏమిటిరా నీకు సంబంధం?' గావురుగావురుమని అరుస్తూ పిడికిళ్ళు బిగించి అతని మీదికి ఎగబడ్డాడు.

అప్పుడు కూడా ఆ చుట్టుపట్ల ఉన్న జనంలో ఎవరూ రియాక్ట్ కాకపోవటాన్ని కనుచివరల నుంచి గమనిస్తూ, ఫెడీల్‌మని కొట్టాడు వెట్టి.

వెర్రిగా అరిచే అవకాశం కూడా ఆ మనిషికి లభించలేదు. ఆవులిస్తున్నట్టుగా నోరు తెరిచి, అమాంతంగా పోయి అవతల పడ్డాడు.

కళ్ళు గిర్రున తిరుగుతున్నట్టు, తనంతట తనే కిందికి జారిపోబోతున్నట్టు అనిపిస్తున్నా లెక్కచేయకుండా, వేగంగా కదిలి, ఆ మనిషి దగ్గరికి పోయి, ఎడమ పాదాన్ని గుండెల మీద వేసి బలంగా అదిమాడు వెట్టి.

'ఇంకోసారి కనిపించినా, దారికి అడ్డంగా వచ్చినా తల తెగి మట్టిలో పడిపోతుంది. పిచ్చివేషాలు వేస్తే నడుములు జారిపోతాయ్... ఖబడ్దార్..' కరుకుగా హెచ్చరించి, అలాగే నిలబడ్డాడు.

'నేను ఏమీ చేయలేదు. నువ్వు ఎవరని అడిగా. యాడికి బోవాలని మాత్రమే మాట్లాడినా, అంతే..' సన్నగా మారిపోయిన కంఠంతో గబగబా చెప్పాడు ఆ మనిషి.

ఆపైన అతనివైపు నుంచి తమకు ఎటువంటి ఇబ్బంది ఎదురుకాదని అర్థమైంది వెట్టికి. గుండెల్ని అదుముతున్న పాదాన్ని వెనక్కి తీసుకుని ఇవతలికి వచ్చేశాడు.

నడుము మీద చేతులు వేసుకుని నిలబడి ఉండవలసిన పిచ్చమ్మి, వెంటనే కనిపించకపోవడంతో ఉలిక్కిపడి చుట్టూచూశాడు.

అతను ఆ మనిషి మీద కలబడుతున్నప్పుడు అవతలికి వెళ్ళిపోయింది కాబోలు, అవతలి వీధి మొదల్లో అగుపించింది ఆమె. తల వంచుకుని తనదారిన తను వెళ్ళిపోవటం లేదు. ఆ వీధి పక్కనే ఉన్న ఒక కరెంటు స్తంభం దగ్గర కింద కూర్చుని ఉన్న ఒక బిచ్చగత్తె దగ్గర నిలబడి ఉంది.

'మనం ఇక ఇక్కడ ఉండడం మంచిది కాదు తల్లీ. అవతలికి వెళ్ళిపోదాం. ఈ వీధి చివర ఒక హోటలు ఉంది. మంచి భోజనం దొరుకుతుంది. పద తల్లీ. ముందు ఏదో ఒకటి పొట్టలోకి పోకపోతే చాలాకష్టమై పోయేటట్టుంది. నీరసం చాలా ఎక్కువై

## జరిగిన కథ

తనను తిరిగి బానిసగా మార్చాలని ప్రయత్నం చేస్తున్న గూండా ముఠాలకు కనిపించకుండా తప్పించుకు తిరుగుతూ ఉంటాడు వెట్టి. బస్సు ప్రమాదంలో చిక్కుక్కున్న ప్రయాణికుల్ని ప్రాణాలకు తెగించి కాపాడి ఆ ఊరివాళ్ళ ఆదరణ పొందుతాడు. ఎక్కడినుంచో ఆ ఊరికి వచ్చి నాగదేవతగా ఊరివాళ్ళ ప్రేమాభిమానాలు పొందుతుంది ఒక అమ్మి. వెట్టిని ఆ ఊరు నుంచి దూరంగా తీసుకుపోయి గూండాల బారిన పడకుండా కాపాడుతుంది. ఆమె తెగువ, నైపుణ్యం చూసి అబ్బురపడతాడు వెట్టి. అతడి ప్రయాణమార్గం తెలుసుకుని రౌడీలు దారికాచి నిలబడతారు. వారి నుండి కూడా అమ్మి వెట్టిని కాపాడుతుంది. ఆ తర్వాత......



పోతోంది' అంటూ ఆమె దగ్గరికిపోయాడు అతను.

ఆ మాటలు అస్సలు వినిపించుకోలేదు పిచ్చమ్మి.

'చీకటిపడిన తర్వాత కూడా నీకు ధర్మం చేసేవాళ్ళు ఎవరుంటారు? ఒకవేళ ఉన్నా, ఇలా చీకట్లో వీధుల దగ్గర కూర్చుంటే నిన్ను ఎవరు చూస్తారు? అందరికీ కనిపించేటట్టు వెలుతుర్లో కూర్చోవాలి' ఆ బిచ్చగత్తెకి యాచన ఎలా చేయాలో, ఎక్కడ చేయాలో చెబుతోంది.

'వాళ్ళ ఏడుపు ఏదో వాళ్ళు అడుక్కుంటారు, నీకెందుకు? నాకెందుకు? పద తల్లీ...' అంటూ ఆమె భుజం పట్టుకుని అవతలికి కదిలించే ప్రయత్నం చేశాడు అతను.

ఈగను విదిలించినట్టు అతని చేతిని విదిలించేసింది ఆమె. తన పిడికిట్లో ఉండగా చుట్టచుట్టి పట్టుకున్న కరెన్సీ నోట్లను విడదీసి ఆ బిచ్చగత్తె ముందు పడేసింది.

'ఇవాల్టికి నీ కడుపు నిండుతుంది. వెళ్ళిపో..' అంటూ సలహా కూడా ఇచ్చింది.

వీధి చివర హోటల్లో తాము ఆరగించబోయే తిండి కళ్ళముందు మెదులుతోంది వెట్టికి. గాలి బుడగ పేలిపోయినట్టు ఠప్పున పేలి మాయమై పోయింది ఆ దృశ్యం.

ఒకవేళ తాము విడిపోతే ఆమెకు ఉపయోగ పడతాయనే ఉద్దేశంతో తాను ఆమెకు ఇచ్చిన డబ్బు అది.

'పదపద... నాకు కూడా ఆకలి దంచేస్తోంది' అంటూ అక్కడినుంచి కదిలింది ఆమె.

తలను తీసుకుపోయి కరెంటు స్తంభానికి ఆరడుగుల దూరంలో ఉన్న ఒక ప్రహరీ గోడకు కొట్టుకోవాలన్న కోరిక వెంటనే కలిగింది వెట్టికి.



**జెల్లీ ఫిష్ శరీరం 95 శాతం నీటితో నిండి ఉంటుంది.**

తాము తన్ని దూరంగా తరిమేసిన హీరోల్ని కలుసుకుని, జరిగింది ఏమిటో వివరంగా తెలుసుకుని ఉంటారు బందోబస్తుకు బయలుదేరిన రిజర్వ్ పోలీసుల మాదిరి వేగంగా వంతెన వైపు వెళ్ళిన జనం.

ఏ క్షణంలోనైనా వెనక్కి వచ్చేయవచ్చు. ఈ లోపల తాము వేగంగా ఆ ప్రదేశాన్ని వదిలి వెళ్ళిపోవాలంటే, ముందుగా తన ఒంట్లో ఓపిక ఉండాలి. అందుకు తిండి తినాలి. ఆ పని చేయాలంటే పైసలు ఉండాలి.

దీనంగా చూసిన బిచ్చగత్తెకు దానం చేసేసింది పిచ్చమ్మి. ఇప్పుడు తనే తనకు ఆకలి దంచేస్తోందని అంటోంది.

'ఏమిటి ఆలోచిస్తున్నావు? వచ్చేది ఉందా లేదా?' పది అడుగులు వేసి, అతను కదలకపోవటాన్ని గమనించి కోపంగా అడిగింది ఆమె.

'వచ్చి ఏం చేయమంటావ్ తల్లీ? వట్టి చేతులతోను, ఖాళీ జేబులతోను హోటల్లోకెళితే, మెడ పట్టుకుని బయటికి నెట్టేస్తారు' అంటూ ఈసారి

**గూండాముఠాల్ని తప్పించుకుని వెట్టితో కలిసి ఒక వీధిలో ఉన్న భవంతిముందు ఆగింది ఆ అమ్మి. మునిరెడ్డిని పిలుచుకురా! అని ఖంగుమన్న గొంతుతో అక్కడున్న వ్యక్తిని ఆజ్ఞాపించింది. ఒక వృద్ధుడు బైటకు వచ్చి ఎవరు తల్లీ? అని ప్రశ్నించి ఆమె ముఖంలోకి నిశితంగా చూసి పక్షవాతం వచ్చినట్టు బిగుసుకుపోయాడు. నువ్వా? అంటూ ఉద్వేగానికి గురయ్యాడు. ఇంతకూ ఆమె ఎవరు? అతడెందుకలా బిగుసుకుపోయాడు?**

కళ్ళు గట్టిగా తిరగటంతో, బిచ్చగత్తె మాదిరిగానే, రోడ్డుపక్కన కూర్చుండి పోయాడు అతను.

నెమ్మదిగా నడుస్తూ వచ్చింది ఆమె అతని దగ్గరికి. కుడిచేతిని జాచి, అతని నుదురు మీద వేసింది.

'జ్వరం కాదు.. నీరసం మాత్రమే... తిండి తింటే సరైపోతుంది' అన్నది.

'ఎలా తల్లీ? ఏం పెట్టి తినమంటావు? ఎలా?' ఒంటిని పూర్తిగా ఆవరించుకున్న నీరసం, తన ఆలోచనల్ని అల్లకల్లోలం చేసేస్తుండగా, అడిగాడతను.

ముఖం మీదికి పడుతున్న ముంగురుల్ని వెనక్కి విదిలించుకోవటానికి విసురుగా తలను కదిలించింది ఆమె.

టెంపరరీగా వేసుకున్న ముడి మళ్ళీ వదులైపోయి, భుజాల నిండా పరుచుకున్నాయి కురులు.

ఎదురుచూడని విధంగా తనముందు పడిన కరెన్సీనోట్లను పట్టుకుని కూర్చుని ఉన్న బిచ్చగత్తె కళ్ళు విపరీతమైన ఆశ్చర్యంతో వెడల్పు అవటం అతనికి కనిపించింది.

శరీరంలో మిగిలి ఉన్న అతి కొద్ది ఓపికను బలవంతంగా కూడగట్టుకుంటూ కింది నుంచి లేచాడు అతను.

'తెలివితప్పి పడిపోవటం తప్పనప్పుడు ఆ పని ఇక్కడ చేయటం ప్రమాదం. ఊరి బయటికి పోయి పడిపోవటం మంచిది. పద తల్లీ..' అంటూ అడుగు కదిపాడు.

విడిపోయిన తల కట్టును తిరిగి సరిచేసుకుంటూ పాతిక అడుగుల దూరం ఒక్కమాట కూడా మాట్లాడకుండా నడిచింది పిచ్చమ్మి.

నియాన్‌లైటు వెలుగుతున్న ఒక భవనం ఆ వీధిలో కనిపించే సరికి, సడన్‌గా ఆగిపోయింది.

గుభిల్లుమన్నది అతని గుండెకాయ. 'తమ వెనుక ఉండవలసిన శత్రువులు చుట్టుదారిన తమముందు భాగంలోకి వచ్చేశారన్న ఆలోచన కలిగింది. తనకు తెలియకుండానే చినిగిపోయిన ప్యాంటుజేబులో చేతిని పెట్టి నాటు రివాల్వర్ పట్టుకున్నాడు.

'నువ్వు అనవసరంగా భయపడకు. ఇప్పుడు మనజోలికి వచ్చేందుకు ఇక్కడ ఎవరూ లేరు. ఒక పని చేయాలనిపించింది. అది మంచిదో కాదో ఆలోచిస్తున్నాను' నడుము మీద చేతులు వేసుకుని, నియాన్ లైటున్న భవనం వైపే చూస్తూ అతనికి చెప్పింది ఆమె.

'ఏ పని చేయాలని అనుకుంటున్నావు తల్లీ... కొత్తకొత్త పనులు చేస్తే తట్టుకోవటం నాకు చేతకాదు కదూ..' తడి ఆరిపోయిన కంఠంతో అన్నాడు అతను.

'తట్టుకోవాల్సింది నువ్వు కాదు... నేను. ఏదైనా ఇచ్చింది అంటూవస్తే అది నాకు వస్తుంది. నీకు కాదు. నోరు మూసుకుని నా వెనకే వచ్చేయ్' అన్నది ఆమె. తన ఆలోచన పూర్తయినట్టు గట్టిగా ఒక నిట్టూర్పు విడిచి ఆ బిల్డింగ్ మెయిన్‌గేటు దగ్గరికి పోయింది. ఐరన్‌గేటు అది. గడియ గేటుకు పైభాగంలోనే ఏర్పాటు చేయబడి ఉంది. దాన్ని కొంచెంగా పైకిఎత్తి కింద ఉన్న ఐరన్ బద్దకేసి టపటపా కొట్టింది.

తలుపులు తడుతున్నట్టు షార్ప్‌గా వినవచ్చింది ఆ శబ్దం.

పది క్షణాల తరువాత సడన్‌గా ఓపెన్ అయ్యాయి మూసి ఉన్న బిల్డింగ్ తలుపులు. పాదాలకు అడ్డం పడుతున్న పంచెను పైకి తీసుకుంటూ పెద్దపెద్ద అడుగులు వేస్తూ గేటు దగ్గరికి వచ్చాడు ఒక వ్యక్తి.

'ఎవరు నువ్వు? ఈ చీకటివేళలో ఎందుకు వచ్చావ్? వెళ్ళిపో? వెళ్ళిపో..' కోపంగా చూస్తూ చాలా బిగ్గరగా అరిచాడు.

'మునిరెడ్డిని పిలువ్.. త్వరగా బయటికి రమ్మని చెప్పు' గేటును వదిలి నడుము మీద చేతులు వేసుకుంటూ, కమాండ్ చేసింది ఆమె.

'మునిరెడ్డిని పిలవాలా? నువ్వెవరివి?' ఆమె అవతారాన్ని తల దగ్గర్నించి పాదాల దాకా పట్టి పట్టి చూస్తూ అడిగాడు ఆ మనిషి.

'లాగిపెట్టి కొట్టానంటే మూతిపళ్ళు మొత్తం రాలి కింద పడిపోతాయ్. వెళ్ళరా.. వెళ్ళి ముందు ఆయన్ని పిలుచుకురా' తుపాకీ తూటా మాదిరి ఖంగుమన్నది పిచ్చమ్మి కంఠం.

తన ముఖం మీద నిజంగానే దెబ్బపడినట్టు అదిరిపడి, అప్రయత్నంగా రెండు అడుగులు వెనక్కి వేశాడు ఆ మనిషి.

'ఆయన్నెవర్నో పిలవమని చెపుతున్నది కదా.. తలుపుల్ని విరగదన్ని తనంతట తనే లోపలికి రావటం లేదు కదా.. మర్యాదగా మాట్లాడితే మీ ఊర్లో వారికి అర్థం కాదు?' గేటును ఆనుకుని నిలబడుతూ అంత నీరసంలోనూ, వెక్కిరించకుండా ఉండలేకపోయాడు వెట్టి.

గిరుక్కున వెనక్కి తిరిగి బిల్డింగ్‌లోకి పరిగెత్తాడు ఆ మనిషి. సరిగ్గా రెండు... రెండంటే రెండు నిమిషాల తర్వాత జుట్టు వెలిసిపోయి, ముఖం ముడతలుపడి ఉన్న వృద్ధుడు ఒకతన్ని వెంటబెట్టుకు వచ్చాడు.

'ఎవరమ్మా నువ్వు? ఏంటి మావోడిని అదర గొడుతున్నావంట?' గంభీరమైన కంఠంతో అడుగుతూ, పిచ్చమ్మి వైపు తేరిపార చూసి, పక్షవాతం వచ్చినట్లు బిగుసుకుపోయాడు ఆ వృద్ధుడు.

'తల్లీ... జయమ్మ తల్లీ.. నువ్వు? నువ్వేనా? నిజంగా నువ్వేనా?' తనంతట తనే గేటును బార్లా తెరుస్తూ అడిగాడు చాలా ఉద్వేగంగా.

తను ఆనుకుని ఉన్న గేటు సడన్‌గా తెరుచుకోవటంతో కింద పడిపోబోయి, ఆఖరి క్షణంలో ప్రహరీగోడను పట్టుకుని నిలదొక్కుకున్నాడు వెట్టి.

'తాడిచెట్టు మాదిరి నీ ఎదుట నిలబడి ఉంటే, నిజంగా నువ్వేనా అని అడుగుతావేంటి? నమ్మకం కలగటం లేదా? ఆధారాలు చూపించాలా?' నొసలు ముడివేసి కోరగా చూస్తూ అడిగింది పిచ్చమ్మి.

'అయ్యయ్యో... అలాంటిదేమీ లేదు తల్లీ. నువ్వు ఆధారాలు చూపించటం ఏమిటి? అసలు గేటును విరగదన్ని లోపలికి వచ్చేయకుండా రోడ్డుమీదే నిలబడటం దేనికి? నీ బిల్డింగ్ తల్లీ ఇది. నేను మీ పనోడిని. లోపలికి వచ్చేయ్ తల్లీ..' బిల్డింగ్ వైపు చేయి చూపిస్తూ గబగబా అన్నాడు ఆ వృద్ధుడు.

'నేను రాను' నడుము మీద చేతులు వేసుకుంటూ చెప్పింది ఆమె.

చప్రున పక్కకు తిరిగి, తన చెవుల్ని, తన కనుల్ని తనే నమ్మలేనట్లు చూస్తున్న మొదటి మనిషి చెంప పగిలి పోయేటట్లు కొట్టాడు వృద్ధుడు.

'ఏం మాట్లాడావురా? పెద్దమ్మాయిగారు వచ్చి గేటుముందు నిలబడిన వెంటనే లోపలికి పిలవకుండా ఏమని వాగావు? నిన్ను గేటుకు వేలాడదీసి వీపు పగిలిపోయేటట్టు..' ఆపైన మాటలు రాక, ఇంకోసారి అతని చెంపమీద కొట్టబోతున్న వృద్ధుడిని-

'చాలు... ఆపేయ్...' అంటూ ఆపేసింది పిచ్చమ్మి.

'ఆపేశాను తల్లీ. ఆపేశాను. ఇప్పుడు నన్ను ఏం చేయమంటావో చెప్పు... నువ్వు ఏం చెపితే అది చేసేస్తాను" వినయంగా అన్నాడు వృద్ధుడు.

'ఇదుగో.. ఇతను నా మనిషి. ఒంట్లో బాగా లేదు. నీరసం.. కళ్ళు తిరిగి కిందపడిపోతున్నాడు. ముందు డాక్టర్‌ని పిలవాలి. అంతకంటే ముందు తినటానికి ఏదైనా కావాలి. వేడివేడిగా పాలు..' చెప్పటం మొదలుపెట్టిన పిచ్చమ్మిని, వృద్ధుడు అడ్డుకోలేదు. వెట్టి ఆపేశాడు.

'డాక్టరు వద్దు. అసలు ఈ ఊళ్ళో ఇంకెవరూ నన్ను చూడకుండా ఉంటే చాలా బాగుంటుంది. తిండి దొరికితే అన్నీ సర్దుకుంటాయ్' అన్నాడు.

'విన్నావు కదా... తిండి చాలంటున్నాడు. ఆ పని చూడు..' అన్నది పిచ్చమ్మి.

'ముందు మీరిద్దరూ లోపలికి రండి తల్లీ' అంటూ పక్కకు జరిగి మరోసారి బిల్డింగ్ వైపు చేయి చూపించాడు వృద్ధుడు.

'డాక్టరు వద్దని అంటున్నాడు గదా... ఒంటి మీది దెబ్బలకు ఏదైనా ఆయింట్‌మెంట్ తెప్పించు. ఒళ్ళునొప్పులు తగ్గటానికి మాత్రలు.." ముందుకు అడుగులు వేస్తూ చెప్పింది పిచ్చమ్మి. నాలుగు అడుగులు వేసిన తర్వాత ఇంకేదో గుర్తుకు వచ్చినట్టు 'ఇదిగో ఒక్కమాట..' అన్నది వెనక్కి చూస్తూ.

## నయనకు నో చెబుతున్న హోటల్స్?



*ఇదేమిటి? నయనతారకు హోటల్స్ ఎందుకు నో చెబుతాయన్న అనుమానం వస్తోందా? ఇది నిజమే! నయనతారకు తమ హోటల్‌లో రూమ్‌లు అద్దెకివ్వడానికి కొందరు స్టార్ హోటల్స్ వాళ్ళు అంగీకరించడం లేదట! దీనికి వాళ్ళు చెబుతున్న కారణాలు ఇవి. నయనతారకు కోపం ఎక్కువట! కోపం వస్తే వస్తువులు గిరాటు వేస్తూ రూంని డ్యామేజ్ చేస్తుందట! అంతేకాదు తన ప్రతాపం హోటల్ సిబ్బంది మీద కూడా చూపిస్తుందట! రూం ఖాళీ చేసే సమయంలో డ్యామేజ్‌కి సంబంధించి ఖర్చు మొత్తం చెల్లించినా సుమారు మూడు నాలుగు రోజుల పాటు ఆ రూమ్‌ను ఎవరికీ ఇవ్వడం కుదరదట! ఇవన్నీ దృష్టిలో పెట్టుకున్న హోటల్స్ వారు నయనతారకు రూమ్ అంటే ముందే ఖాళీ లేవంటూ తప్పించుకుంటున్నారట! కొందరేమో ముఖం మీదే నో అని చెప్పేస్తున్నారట! మొత్తానికి ఈ వార్త టాలీవుడ్‌లో హాట్ టాపిక్ అయింది.*

మరోసారి చెప్పవలసిన అవసరం లేకుండా, ఆమె చెప్పినది తీసుకురావటానికి గేటు బయటకి పోతున్న మనిషి చటుక్కున ఆగిపోయాడు.

'నా గురించి గాని, ఇతన్ని గురించి గాని ఎవరికీ తెలియకూడదు. ఎవరికైనా చెప్పినట్లు తెలిసిందంటే నీ బతుకు బుగ్గిపాలు అయిపోతుంది. అర్థం అయిందా?' అడిగింది ఆమె.

అర్థం అయినట్లు తల ఊపి, అంతకు ముందు కంటే వేగంగా రోడ్డుమీదికి వెళ్ళి చిటికెలో మాయం అయిపోయాడు ఆ మనిషి.

నిద్రలో నడిచినట్లు అడుగులు వేశాడు వెట్టి. రాజభవనం మాదిరి అలంకరించబడి ఉంది ఆ బిల్డింగ్ లోపలి భాగం.

విశాలమైన పెద్ద హాల్లో సుతిమెత్తటి సోఫాల్లో వారిని కూర్చోబెట్టాడు వృద్ధుడు. అతడు పిలవకముందే పరుగులాంటి నడకతో అక్కడికి వచ్చేశారు ఆడవాళ్ళు.

'అమ్మా... తల్లీ.. ఏమైపోయారు తల్లీ? పెద్దమ్మగారు ఎంతగా కంగారుపడుతున్నారో తెలుసా? మీకోసం వెతికించని ఊరంటూ లేదు. తిరిగి తిరిగి అందరికీ కాళ్ళు పట్టేసినయ్. లోపలికిరండి తల్లీ.. ముందు లోపలికి వచ్చేయండి' వృద్ధుడి భార్య కాబోలు ఒక పెద్దావిడ పిచ్చమ్మి చుబుకం పట్టుకుని ఆప్యాయంగా, ఆదరణగా అనునయించింది.

'పాముల్ని వెతికి పట్టుకోవాలంటే ఊళ్ళమ్మట తిరిగితే ఏం లాభం? పుట్టల్ని వెతకాలి. భక్తితో చేతులు జోడించి ప్రార్థనలు చేయాలి. అప్పుడు మాత్రమే కనిపిస్తాయి' కాలు మీద కాలు వేసుకుని మహాఠీవిగా చెప్పింది పిచ్చమ్మి.

అదిరిపడి ఆమెకు దూరంగా జరిగిన ఆడంగుల్ని చూసి తనలో తను నవ్వుకున్నాడు వెట్టి.

'తల్లీ... వీళ్ళు చెపుతున్న దాంట్లో ఒక నిజం ఉంది. లోపలికి పోయి ముందు శుభ్రంగా స్నానం చేయండి. మంచి చీర తెప్పించి కట్టుకోండి' అని చెప్పాడు.

'ఈ వేళప్పుడు స్నానం బాగుంటుందా? అయినా నాకు స్నానం దేనికి? అవసరం అయితే తప్ప పాములు నీళ్ళల్లోకి దిగవు కదా...' అంది పిచ్చమ్మి.

ఆడంగులు అందరూ మరో రెండు అడుగులు దూరంగా జరగటాన్ని కనుచివరల నుంచి చూసి, ఇంకోసారి నవ్వుకున్నాడు వెట్టి.

'ఒట్టిస్నానం కూడా కాదు తల్లీ. తలకట్టు దుమ్ము కొట్టుకుపోయింది. షాంపూలు వద్దు. కుంకుడు కాయ రసంతో తల రుద్దుకోండి. బాగుంటుంది' చిన్నగా చెప్పాడు.

రెండు క్షణాలు ఆలోచిస్తున్నట్టు ముఖంపెట్టి చిన్నగా తల ఊపింది పిచ్చమ్మి. 'నువ్వు చెపుతున్నావు కదా.. అలాగే చేస్తాను' అంటూ 'ఇదిగో... మునిరెడ్డి' అని పిలిచింది.

'తల్లీ చెప్పండి' అంటూ ముందుకు వచ్చాడు వృద్ధుడు.

'ఇతని పేరు మునిరెడ్డి. మా ఎస్టేటులో పండే పంటలకి మార్కెట్ వెతికిపెట్టే ఏజెంటు. నా చిన్నప్పటినుంచీ మా దగ్గరే పని చేస్తున్నాడు. బాగానే సంపాదించాడు' చుట్టూ ఉన్న ఫర్నీచర్‌ని, అలంకరణల్ని కనులతోనే చూపిస్తూ వెట్టికి చెప్పింది.

నమస్కారం చేశాడు వెట్టి.

'అయ్యా, తమరి పేరు?' వినయంగా అడిగాడు వృద్ధుడు.

'అది నీకు ఇప్పుడు అవసరం లేదు' అంటూ వెంటనే అడ్డుకుంది పిచ్చమ్మి.

'నేను చెప్పదలచుకున్నది ఏమిటంటే, నాకు మంచి ధర్మవరం చీర తెప్పించు. ఇదిగో... ఇతనికి కూడా రెడీమేడ్‌వి తీసుకో.. సైజు సరిగ్గా గుర్తు పెట్టుకో' ఆర్డర్ ఇచ్చింది పిచ్చమ్మి.

తల ఊపి బిల్డింగ్ బయటికి వెళ్ళిపోయాడు వృద్ధుడు.

అతను అంతకుముందే సైగ చేసినట్లున్నాడు. అందమైన ట్రేలో వెచ్చటి పాలగ్లాసుల్ని తెచ్చి సోఫాల దగ్గర ఉన్న టీపాయ్ మీద పెట్టింది ఒక ఆడమనిషి.

'నువ్వు పాలు తాగుతూ ఉండు. నేను స్నానం

చేసి వస్తాను' అంటూ వెట్టికి చెప్పి, తనను పల కరించిన పెద్దావిడ భుజం మీద చెయ్యి వేసి లోపలి గదుల్లోకి వెళ్ళిపోయింది పిచ్చమ్మి.

●●●

'అమ్మా, పెద్దమ్మగారూ.... పెద్దమ్మగారూ...' పడక గది తలుపుల మీద దబదబ తడుతూ ఒక పని మనిషి బిగ్గరగా పిలవటంతో, ఉలిక్కిపడి లేచి కూర్చున్నది ఆమె.

మెల్లగా అడుగులు వేస్తూ లోపలికి వచ్చింది ఆ పనిమనిషి.

'ఏమిటే గోల? ఇప్పుడు టైం ఎంతయిందో చూశావా?' కనులను అరచేతులతో అదుము కుంటూ విసుగ్గా అడిగింది పెద్దమ్మ.

'తల్లీ... బంగిడి నుంచి మునిరెడ్డి ఫోను చేశాడు..' అంటూ ఇంకా ఏమిటో చెప్పబోయిన ఆమెను మధ్యలోనే ఆపేసింది ఆమె.

'పోయిన నెల బత్తాయిల్ని సరఫరా చేశాం. ఇంతవరకూ లెక్కలు చెప్పలేదు. డబ్బు పంపించ లేదు. ఏమని అనుకుంటున్నాడు తనని గురించి? నాకు మతిమరుపు వచ్చేసిందని అనుకుంటు

'ఇప్పుడే నాలుగు నిమిషాల క్రితం వచ్చింది ఫోను..' అంటూ అప్పటికప్పుడు ఒక నెంబర్ డయల్ చేసి రిసీవర్‌ని ఆమెకు అందించాడు.

'మునిరెడ్డి...' పలకరించింది పెద్దమ్మ గద్గదమై పోతున్న కంఠంతో.

'అమ్మగారూ... మీరు బాధ మర్చిపొండి. అమ్మాయిగారు హేపీ... స్నానం ఇప్పుడే పూర్త యింది. తల ఆరబెట్టుకుంటున్నారు. ఏదైనా ఆర గించిన తర్వాత మీతో మాట్లాడిస్తాను' విన వచ్చింది అవతలివైపు నుంచి.

'నా బిడ్డ క్షేమంగానే ఉంది కదా మునిరెడ్డి' అడిగింది పెద్దమ్మ.

'చెప్పకపోవటం దేనికి తల్లీ... వేళకి తిండి తినకపోవడం వల్ల కాబోలు కొద్దిగా నలిగి పోయి నట్లుంది. అంతే. అంతకుమించి ఇంకేమీ లేదు' అన్నాడు అవతలి పక్కన ఉన్న మునిరెడ్డి.

'మాటలు ఎలా ఉన్నాయి? బాగానే ఉన్నాయా?' అడిగింది పెద్దమ్మ.

'ఇదివరకటి మీద చాలా బెటరు తల్లీ... ఎటు వంటి మాటలు మాట్లాడినా... ఆ హుందాతనం.




న్నాడా?' కోపంగా అన్నది.

'అదికాదు తల్లీ... అక్కడ' అంటున్న పని మనిషి వైపు ఈసారి కోపంగా చూసింది ఆమె.

'ఇప్పుడు నేను ఎటువంటి విషయం విన దలుచుకోలేదు. పోయి నువ్వు శంకరరెడ్డికి చెప్పు. పో...' అంటూ తలగడ మీదికి వాలి కనులు మూసుకోబోయింది.

'పెద్దమ్మాయి గారు తనంతట తనే మునిరెడ్డి దగ్గరికి వచ్చారట తల్లీ... ఇప్పుడు బంగిడిలోనే ఉన్నార్ట..' తాను చెప్ప వచ్చింది ఏమిటో గబు క్కున బయట పెట్టేసింది పనిమనిషి.

వయసుగత్తె మాదిరి చెంగున బెడ్‌మీదినించి దిగింది పెద్దమ్మ. పెద్దపెద్ద అడుగులు వేస్తూ సభా భవనం వంటి హాల్లోకి వచ్చింది.

అప్పటికే అసలు విషయం ఆ భవనంలో ఉన్న వారందరికీ తెలిసిపోయింది కాబోలు - అక్కడే గుమికూడి ఉన్నారు.

విపరీతమైన సంతోషంతో మతాబు మాదిరి వెలిగిపోతోంది మేనేజరు శంకరరెడ్డి ముఖం.

ఆ ఠీవి అబ్బో... అది మీ వంశం. చాలా బాగుంది' సంతోషంగా చెప్పాడు అతను.

'ఎక్కడికీ పోకుండా జాగ్రత్తగా చూసుకో. మేము వెంటనే బయలుదేరుతున్నాం. రేపు పదింటికో పన్నెండింటికో వస్తాం' అన్నది ఆమె.

'అమ్మ... ఒక్కమాట.. ఒక్కమాట...' అంటూ అభ్యంతరం చెప్పాడు అతను.

'ఏమిటది?' అనుమానంగా అడిగింది ఆమె.

'అమ్మాయిగారికి ముందుగా చెపుతాను. చెప్పక పోతే తనంతట తానుగా తెలుసుకుంటుంది. తనకు చెప్పలేదని కోపం చేయచ్చు. మళ్ళీ మాయం అయి పోవచ్చు' అన్నాడు అతను.

ఏమని అర్థం చేసుకోవాలో తెలియనట్లు శంకరరెడ్డి వైపు చూసింది పెద్దమ్మ.

'దగ్గరగానే నిలబడి ఉండడం వల్ల, రిసీవర్‌లో నుంచి వినవచ్చిన మాటల్ని అతను ఆలకించాడు.

'అమ్మాయిగారు కనిపించారు కాబట్టి మనం కంగారు పడవలసిన పనిలేదు తల్లీ. అతను చెప్పినట్టే చేద్దాం. అసలు ఇప్పటికిప్పుడు ఏమీ

మాట్లాడవద్దు. సుఖంగా నిద్రపొండి. అమ్మాయి గారు కూడా ఒక నిద్రతీసిన తర్వాత మాట్లాడ వచ్చు' తన అభిప్రాయాన్ని వెల్లడించాడు.

'అంతేనంటావా?' సాలోచనగా అన్నది పెద్దమ్మ.

'అంతేతల్లి.. మీరు నిశ్చింతగా పడుకోండి. నేను మునిరెడ్డితో మాట్లాడతాను. వెళ్ళండి తల్లీ. వెళ్ళి పడుకోండి' ఆమె చేతిలోనుంచి రిసీవర్‌ని తీసు కుంటూ మృదువుగా చెప్పాడు అతను.

అయిష్టంగానే ఇచ్చింది ఆమె రిసీవర్‌ని. తడి అయిన కనుల్ని తుడుచుకుంటూ తన పడకగది వైపు వెళ్ళిపోయింది.

●●●

తను కూడా స్నానం చేశాడు వెట్టి. మునిరెడ్డి స్వయంగా తీసుకువచ్చిన ప్యాంటు, షర్టు వేసు కుని హాల్లోకి వచ్చాడు.

ఇద్దరు ఆడవాళ్ళు సోఫాలో ఒక చివరగా కూర్చున్న పిచ్చమ్మి తలకట్టును అతి జాగ్రత్తగా పట్టుకుని కనిపించారు అతనికి. సాంబ్రాణి పొగ వేస్తోంది మునిరెడ్డి భార్య.

'భగవంతుడు మీ వంశం వాళ్ళకి ఇచ్చిన వరం ఈ తల కట్టు. జాగ్రత్తగా చూసుకోవాలి తల్లీ. దుమ్ముధూళి తగలనీయకూడదు' తలస్నానం చేయించేప్పుడు మడ్డి విపరీతంగా కనిపించింది కాబోలు, సున్నితంగా హెచ్చరిస్తోంది.

'నువ్వు చెప్పేది నిజమే. నేల మీద తిరిగితే అలాగే జాగ్రత్త పడవచ్చు. నేను అప్పుడప్పుడు నేల లోపలికి పోతూ ఉంటాను. మకిలిపట్టడం సహజం' సోఫా వెనక్కి చేరగిలబడి అరమూసిన కనులతో చాలా క్యాజువల్‌గా చెప్పింది పిచ్చమ్మి.

తల కట్టును పట్టుకుని ఉన్నవాళ్ళతో సహా అక్కడ ఉన్న ఆడంగులందరూ ఇంకోసారి ఒకరి వంక ఒకరు చూసుకోవటాన్ని గమనించాడు వెట్టి.

'మట్టిపడితే తలకట్టు మాసిపోతుంది. ఊడి పోదు. మనసు నిర్మలంగా ఉంటే చాలు. అది ఎక్క డికీ పోదు' అంటూ తను కూడా ఇంకో సోఫాలో కూర్చున్నాడు.

'పాలు తాగవా?' కనులు తెరిచి చూస్తూ అడిగింది పిచ్చమ్మి.

'తాగను తల్లీ... ఓపిక వచ్చింది. మునిరెడ్డి ఏవో మాత్రలు కూడా తెచ్చిచ్చారు. వేసుకున్నాను. ఒళ్ళు నొప్పులు కూడా కొద్దిగా తగ్గిపోయినయ్..' తన దుస్తుల్ని తడుముకుంటూ చెప్పాడు.

'మునిరెడ్డికి ఫ్యాషన్ల గురించి బాగా తెలుసు. నీకు చక్కగా ఉన్నాయి దుస్తులు..' అంటూ తన చీరవైపు చూసింది ఆమె.

'ఎలా ఉంది ఇది?' అని అడిగింది.

'కలరు బాగున్నది గాని, వయసు మీరిపోతున్న వాళ్ళు కట్టుకునేది. మీకు అనవసరం' తడుము కోకుండా చెప్పాడు అతను.

'నేను పడుచుపిల్లనని అనుకుంటున్నావా? నీ అంత బిడ్డ ఉంది నాకు' అంటూ సడన్‌గా ముని రెడ్డి వైపు చూసింది ఆమె. 'నా బిడ్డ ఎలా ఉంది?' అని అడిగింది.

**(ఇంకావుంది)**




## పుస్తక పఠనంతో పెరిగే జీవిత కాలం



పుస్తకపఠనం వలన మానసికానందంతో పాటు జీవితకాలం కూడా పెరుగుతుంది అంటున్నారు పరిశోధకులు. ప్రతిరోజూ ఏదో ఒక పుస్తకం చదివేవారు అకాల మృత్యువు బారిన పడే అవకాశాలు చాలా వరకు తగ్గుతాయని, వారి జీవితకాలం పెరుగుతుందనీ అమెరికాలో నిర్వహించిన ఓ పరిశోధనలో వెల్లడైంది. సుమారు మూడున్నరవేల మంది స్త్రీ పురుషుల మీద పన్నెండు సంవత్సరాల పాటు అధ్యయనం చేశారు. వారంలో మూడున్నర గంటల పాటు పుస్తకాలు చదివే వారిలో 17 శాతం జీవిత కాలం పెరగగా అంతకన్నా ఎక్కువ గంటలు చదివే వారిలో 23 శాతం జీవిత కాలం పెరిగిన విషయాన్ని పరిశోధనల్లో గమనించారు. అస్సలు పుస్తకాలు చదవని వారు అకాల మృత్యువాత పడడాన్ని వీరు గుర్తించారు. పుస్తకపఠనం కారణంగా మానసిక ప్రశాంతత చేకూరుతుందనీ, తద్వారా రక్తపోటు, ఒత్తిడి వంటివి దరిచేరవనీ, పఠితల జీవితకాలం పెరగడానికి కారణం ఇదేనని వీరు విశ్లేషిస్తున్నారు. పుస్తకాలు చదివే పురుషులలో కన్నా స్త్రీలలో మరణాల శాతం తగ్గిందని వీరు అంటున్నారు. అయితే కేవలం పుస్తక పఠనం కారణంగానే మరణాల రేటు తగ్గిందా? లేక మరేదైనా కారణం ఉందా? అన్న విషయాన్ని వీరు పరిశీలిస్తున్నారు.

## దంతక్షయంతో గుండెజబ్బులు?



దంతక్షయం గురించి పెద్దగా పట్టించుకోం. దంతాలు నొప్పి పుట్టినా, పంటి చిగుళ్ళ నుంచి రక్తం వచ్చినప్పుడు అప్పటి కప్పుడు చర్యలు తీసుకోవడం తప్ప దాని గురించి ముందు జాగ్రత్తలు పాటించం. నిర్లక్ష్యం చేస్తే దంతక్షయం గుండె జబ్బులకు దారితీస్తుంది అంటున్నారు ఫిన్‌లాండ్ పరిశోధకులు. గుండెజబ్బులకు ఊబకాయం, ఒత్తిడి, రక్తపోటు వంటివే కాకుండా దంత క్షయం కూడా కారణం అవుతుందన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. సుమారు ఐదువేల మంది మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరిలో కొందరు దంతక్షయంతో బాధపడుతున్న వారు ఉన్నారు. మిగతావారితో పోలిస్తే వీరికే గుండెజబ్బులు వచ్చే అవకాశం 27 శాతం ఉన్న విషయాన్ని వీరు గమనించారు. దంతక్షయంతో బాధపడేవారు వెంటనే వైద్యుణ్ణి సంప్రదిస్తే గుండెజబ్బుల బారి నుంచి కొంత వరకూ తప్పించుకోవచ్చని వీరు సూచిస్తున్నారు.

## ముడి ధాన్యాలతో వ్యాధులు పరార్

ముడి ధాన్యాలను ప్రతిరోజూ ఆహారంలో చేర్చుకోవడం ద్వారా ప్రాణాంతక వ్యాధుల బారి నుంచి తప్పించుకోవచ్చు అంటున్నారు అమెరికా పరిశోధకులు. సుమారు రెండున్నర లక్షల మంది మీద సుదీర్ఘకాలం పరిశోధనలు చేసి ఈ విషయం వెల్లడించారు. ముడి ధాన్యాలను ఏదో ఒక రూపంలో ఆహారంగా తీసుకున్న వారిలో 21 శాతం గుండెజబ్బులు, 11 శాతం కేన్సర్ వ్యాధి, 18 శాతం అకాల మరణాలు తగ్గుతాయన్న విషయం ఈ పరిశోధనలో వెల్లడైంది. ప్రతిరోజూ మూడు పూటలా 90 గ్రాముల చొప్పున ముడి ధాన్యాలు తీసుకున్న వారిలో గుండెజబ్బులు, కేన్సర్ వంటి వ్యాధులే కాకుండా ఊపిరితిత్తుల సమస్యలు కూడా తగ్గుముఖం పట్టడాన్ని వీరు గుర్తించారు. ముడిధాన్యాలు తీసుకోని వారు పలురకాల వ్యాధులతో అకాల మరణానికి గురయ్యారని పరిశోధకులు చెబుతున్నారు. సంపూర్ణ ఆరోగ్యంతో జీవించాలంటే ముడిధాన్యాలను ఏదో ఒక రూపంలో తీసుకోవలసిందేనని వారు స్పష్టం చేస్తున్నారు.



## యోగర్ట్‌తో డిప్రెషన్ దూరం?



అధికంగా క్రీమ్ కలిగిన గడ్డపెరుగు(యోగర్ట్) తీసుకోవడం ద్వారా డిప్రెషన్ నుంచి తప్పించుకోవచ్చు అంటున్నారు స్పానిష్ పరిశోధకులు. యోగర్ట్‌లో డిప్రెషన్‌ను దూరం చేసే పదార్థాలు ఏవి ఉన్నాయో నిర్ధారణ కాకపోయినప్పటికీ ప్రతిరోజూ తినడం వలన డిప్రెషన్ దూరం చేసుకోవచ్చన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. సుమారు 15 వేల మంది స్త్రీ పురుషుల మీద వీరు సుదీర్ఘకాలం పరిశోధనలు నిర్వహించారు. వీరందరూ డిప్రెషన్‌తో బాధపడుతున్న వారే! వీరిలో కొందరికి ప్రతిరోజూ క్రీమ్ ఉన్న యోగర్ట్‌ను ఇచ్చారు. మరికొందరికి మామూలు యోగర్ట్‌ను మాత్రమే ఇచ్చారు. మామూలు యోగర్ట్ తిన్న వారిలో డిప్రెషన్ లక్షణాలు అలాగే ఉండగా, క్రీమ్ కలిగిన యోగర్ట్‌ను తీసుకున్న వారిలో డిప్రెషన్ లక్షణాలు తగ్గుముఖం పట్టడాన్ని పరిశోధకులు గుర్తించారు. వీరు కేవలం యోగర్ట్‌ను తినడం వలనే డిప్రెషన్ తగ్గుముఖం పట్టిందా? అన్న విషయం మీద వీరు పరిశోధనలు నిర్వహిస్తున్నారు.

-అవినాష్

# కొండచిలువలు

## డా॥యండమూరి సత్యాకమహేంద్రనాథ్

**సాయంత్రం ఆరుగంటలయినా మిట్టమధ్యాహ్నపు వడగాలులు ఇంకా వీస్తూనే ఉన్నాయి. బీటలు వారిన నేల దాహార్తితో చినుకుల కోసం ఎదురుచూస్తోంది. కనుచూపుమేరలో అక్కడక్కడ తుమ్మమొక్కలు కనిపిస్తున్నాయి తప్పించి పచ్చదనం ఎక్కడా కనపడటం లేదు. అడపాదడపా పడే వర్షం కూడా ఆ మొక్కలకోసమేనన్నట్లు కాస్తనీటిని చిలకరించి వెళ్ళిపోతోంది. నాలుగు సంవత్సరాల నుంచీ ఇదేవరుస. కరువు-క్షామం అంటే ఆ ఊరి ప్రజలకు తెలిసినంతగా మరెవరికీ తెలియదేమో!**

పొలం గట్టుమీద కూర్చొని ఉన్నాడు శివయ్య. దిగాలుగా ఉన్నాడు. మనసంతా భారంగా ఉంది. నలువైపులా దిక్కులు చూస్తున్నాడు. తన చిన్నప్పుడు తండ్రితో కలిసి వచ్చినప్పుడు పొలం ఎలా ఉండేదో తలచుకుంటూ ఉంటే బాధగా ఉంది. దూరంగా కొండచిలువ పాకుతూ వెళుతోంది. అదిచూసి అడవిలో తిండి లేకా? తిన్నది సరిపోక ఊరి మీద పడుతోందా? అనిపించింది. తను మాత్రం తినడానికి ఉన్నా లేకపోయినా ఊరు వదిలి వెళ్ళలేని పరిస్థితి అనుకున్నాడు.

ఉదయం జరిగిన సంఘటన గుర్తుకు వచ్చింది. రోజూలానే ఉదయాన్నే పొలం గట్టుమీద కూర్చున్నాడు. కరణంగారి పాలేరు వచ్చి "అయ్యగారు రమ్మన్నారు" అని చెప్పాడు. అతనితో కూడా కరణంగారి ఇంటికి వెళ్ళాడు. అరుగుమీద కరణంతో పాటు పెద్దమనిషి కూర్చొని ఉన్నాడు. దగ్గరకు వెళ్ళగానే "శివయ్య! ఈయన కొత్తగా వచ్చిన బ్యాంక్ మేనేజరు. ఋణాలు వసూలు చేసుకోవడానికి వచ్చారు. నువ్వు ఋణం తీసుకొని సుమారు నాలుగు సంవత్సరాలయింది. ఇంతవరకు వడ్డీ కూడా కట్టలేదు" అన్నాడు కరణం.

"నిజమే బాబయ్య! పరిస్థితులన్నీ మీకు తెలుసు. కనీసం తిండి గింజలకే కష్టమయి పోతోంది" అన్నాడు శివయ్య.

"అది మన బాధ. ఆయనది ఉద్యోగ ధర్మం. ఎంతో కొంత కడితే మరికొంత కాలం ఆయన్ని బ్రతిమాలి నోటీసు రాకుండా చెయ్యవచ్చు. ఈలోపులో అదృష్టం బాగుంటే వర్షాలు పడతా యేమో చూద్దాం'.

"సరే బాబయ్య! ఏదో ఒక ప్రయత్నం చేస్తా" అంటూ వెనుదిరిగాడు. అదే ఆలోచనతో ఇంటికి వచ్చాడు. గంజి కూడా తాగబుద్ధి కాలేదు. అలానే నేలమీద వాలాడు. అర్ధరాత్రవుతున్నా నిద్రపట్టటం లేదు. పదేపదే మెలకువ వస్తోంది.

తన నిర్ణయం సబబా! కాదా! అనే మీమాంసలో ఉన్నాడు. పుట్టినప్పట్నించి తన ఎదురుగా పెరిగినవి. పిల్లలులేని తనకు పిల్లలు అవే అనుకుంటూ మూపురం మీద చెయ్యివేసి రాస్తున్నాడు. శివయ్య చెయ్యి ఒంటిమీద పడగానే తల్లిస్పర్శలా భావన కలిగి కళ్ళుతెరిచి శివయ్య వైపు చూస్తున్నాయి ఆ ఎద్దులు. ఆ కళ్ళల్లో తమ యజమాని మీద ప్రేమ, నమ్మకం ప్రస్ఫుటంగా కనపడుతున్నాయి. ఆ రెండు ఎడ్లలో ఏ ఒక్కదాన్నీ దూరం చేసుకోవడానికి మనస్సు ఒప్పటం లేదు శివయ్యకి. కానీ తప్పదు. గుండెను ఎంత రాయిలా చేసుకుందామన్నా గుండెలో అలజడి, చిన్నతడి. భార్యవైపు చూశాడు. వెల్లకిలా పడుకొని ఇంటి పైకప్పులో నుంచి అక్కడక్కడ కనపడే ఆకాశం చూస్తోంది. "నిద్రరావటం లేదా!" అడిగాడు.

"నువ్వెన్నిసార్లు పిల్లల దగ్గరకు వెళ్ళి వస్తున్నావో చూస్తూనే ఉన్నాను. నాకు మాత్రం నిద్ర వస్తుందా?" అంది.

"ఏంచెయ్యగలం చెప్పు... పిల్లలు లేని మనకు అవే పిల్లలు. అందుకే మనకు తిండిగింజలు లేకపోయినా వాటికోసం కూలి పని చేస్తున్నాం. ఇంకా ఎంత కాలానికి వర్షాలు వస్తాయో... లేదో తెలియదు. ఎండుగడ్డి కూడా దొరకటం లేదు. వాటికి తిండి పెట్టగలిగే స్థితి కూడా తగ్గిపోతోంది. ఋణ భారం పెరిగిపోతోంది. మంచి యజమాని దగ్గరకు చేరితే కనీసం మంచి తిండి అయినా వాటికి దొరుకుతుందేమో" అన్నాడు.

•••

రాత్రి పదకొండు గంటలవుతోంది. కొద్దిగా వెన్నెల... హైవే పక్కగా రావిచెట్టు. ఆ చెట్టు వెనకాల తన మోటార్ సైకిల్ ఉంచి రోడ్డు పక్కగా సివిల్‌డ్రెస్‌లో నిలబడి ఉన్నాడు పోలీస్ ఎస్.ఐ. త్రివిక్రమ్. అప్పటికి మూడు రోజుల నుంచీ మాటు వేస్తున్నాడు. కానీ తనకు కావల్సిన ఫలితం దక్కలేదు. చుట్టుపక్కల ఏవో అరాచక కార్యకలాపాలు జరుగుతున్నాయని తనకి సమాచారం వచ్చింది. తన ఏరియాలో గంజాయి స్మగ్లింగ్ ఎక్కువ. ఎంత కష్టపడైనా సరే స్మగ్లర్స్‌ని పట్టుకోవాలనే దీక్షతో ఉన్నాడు. స్మగ్లింగ్ అనే పదం వింటేనే విరుచుకుపడతాడు. తన తడాఖా ఏంటో స్మగ్లర్లకు చూపాలనే దృఢ నిశ్చయంతో రాత్రిళ్ళు హైవే మీద మాటు వేస్తున్నాడు. హెడ్‌కానిస్టేబుల్‌ని హైవే మీద నాలుగు

**నాలుగేళ్ళుగా వర్షాలు కురవడంలేదు. ఆ గ్రామంలో రైతులంతా అల్లాడిపోతున్నారు. రైతులకు తిండిలేదు. అప్పులు తీర్చేమార్గం లేదు. ఎడ్లకు గడ్డిలేదు. గ్రామంలో పచ్చదనం లేదు. అక్కడి అడవిలో తిరిగే కొండచిలువకు సైతం ఆహారం లేదు. అది ఊరిమీద పడింది. కంటికి కనిపించని కొండచిలువలు కూడా అప్పటికే ఊరిమీద పడ్డాయి. మరి శివయ్య కూడా ఆ కొండచిలువల బారిన పడ్డాడా? ఆ గ్రామంలో ఏం జరిగింది?**

కిలోమీటర్ల దూరంలో నిలబడి ఉండమన్నాడు. అటునుంచి ఇటుకానీ, ఇటునుంచి అటుకానీ వస్తున్న బండ్లు, అనుమానం వస్తే ఆపాలి. పారిపోతే రెండో వైపు ఉన్న వ్యక్తికి వెంటనే సమాచారం ఇస్తే ఆ వ్యక్తి తక్షణం రియాక్ట్ అవ్వాలి. అదీ వారిద్దరి ప్లాను. అర్ధరాత్రి దాటుతూ ఉండగా త్రివిక్రమ్ ఫోన్ మోగింది. చూస్తే కానిస్టేబుల్ దగ్గర్నించి. "చెప్పు ఏంటి సంగతి" అడిగాడు. "ఇద్దరు ఆగంతకులు మోటార్ సైకిల్‌మీద వస్తూంటే అనుమానం వచ్చి ఆపుచేసినా ఆగలేదు సార్. మీవైపే వస్తున్నారు. వారి దగ్గర పెద్ద ఎయిర్ బ్యాగ్ ఉంది" అన్నాడు కానిస్టేబుల్.

"సరే, నువ్వు వెంటనే బయలుదేరిరా" అని తన మోటార్‌బైక్ తీసి రాబోయే ఆగంతకులకు ఎదురుగా తాగినవాడిలా రోడ్డు మీద ఆ పక్కనుంచి ఈ పక్కకి వంకరగా నడపసాగాడు. ఎదురుగా మోటార్‌బైక్ లైట్ కనపడింది. వంకర్లుగా తిరుగుతూనే మోటార్‌బైక్ ఎదురుగా వెళ్ళాడు. మోటార్‌బైక్ స్లో అయింది. తన మోటార్‌బైక్ ఎదురుగా నిలబెట్టాడు. ఆగంతకులు మోటార్‌బైక్ ఆపుచేశారు. త్రివిక్రమ్ వాలకాన్ని చూసి మోటార్ బైక్ మీద వెనక కూర్చున్న వ్యక్తి "ఏ మిస్టర్ ఎంత తాగావేవిటి?" అడిగాడు.

"నా తాగుడు సంగతి తర్వాత! ముందు బైక్ దిగండి" అంటూ హేండిల్‌మీద చెయ్యివేశాడు త్రివిక్రమ్. ఇద్దరి మధ్యలో ఉన్న ఎయిర్‌బ్యాగ్ త్రివిక్రమ్ దృష్టిలో పడింది.

"మమ్మల్ని ఆపు చెయ్యడానికి నువ్వెవరు?" అడిగాడు మోటార్ సైకిల్ నడుపుతున్న వ్యక్తి.

"నేను ఈ ఏరియా పోలీస్ ఆఫీసర్ని" అన్నాడు.

వెనుకనున్న వ్యక్తి గబాలున దిగి కత్తి తీశాడు. రెప్పపాటులో నడుముకి ఉన్న బెల్ట్‌లో నుంచి రివాల్వర్ తీసి 'చూడండి! నేను అన్నింటికి సిద్ధమయ్యే వచ్చాను. మర్యాదగా లొంగిపొండి. లేదా ఎలా లొంగదీసుకోవాలో నాకు బాగా తెలుసు. నా సర్వీసులో మీలాంటి వాళ్ళని ఎంతోమందిని చూశాను. ఆ బ్యాగ్‌లో ఏముంది?" అడిగాడు త్రివిక్రమ్.

"నీకనవసరం" అన్నాడు నిర్లక్ష్యంగా ఇద్దరిలో ఒకడు. "నీవు చెప్పకపోతే స్టేషన్‌లో ఎలా చెప్పించాలో నాకు తెలుసు" అంటుండగానే కానిస్టేబుల్





## సెల్ఫీలకూ రేట్లు?

కాదేదీ వ్యాపారానికి అనర్హం అన్నట్టుంది ప్రస్తుత పరిస్థితి. సెల్ఫీల మోజుతో కొందరు ప్రాణాల మీదకి తెచ్చుకుంటుంటే వీటితో వ్యాపారం చేస్తున్నారు కొందరు సినీ హీరోయిన్లు. మొబైల్ ఫోన్ల కంపెనీలతో మాట్లాడుకుని సెల్ఫీలు దిగుతున్నట్టు పోజు ఇచ్చి ఆ ఫోటోను వేరే వాళ్ళతో తీయించి సోషల్ నెట్‌వర్క్‌లో షేర్ చేస్తున్నారట! పైకి హీరోయిన్లే సెల్ఫీలు తీసుకుంటున్నట్టు కనిపించినా, అది నిజం కాదంటున్నారు కొందరు! ఒక్కొక్క హీరోయిన్ సెల్ఫీలకు 50 నుంచి 75వేల వరకూ తీసుకుంటుందని అంటున్నారు. అయితే ఇంత మొత్తం కాస్త పేరున్న హీరోయిన్‌కే చెల్లిస్తారట! అంతగా పేరులేని హీరోయిన్లకు 10 నుంచి 20వేల వరకూ ఇస్తారట! ఇక స్టార్ హీరోయిన్లు మాత్రం వీటి జోలికిపోవడం లేదని అంటున్నారు. సెల్ఫీల వ్యాపారం బయటకు వస్తే తమ పేరు డ్యామేజ్ అవుతుందన్న ఉద్దేశంతో స్టార్ హీరోయిన్లు వీటికి దూరంగా ఉంటున్నారట! అదీ సంగతి. హీరోయిన్ల సెల్ఫీలు చూసి వారి అభిమానులు తెగ సంతోషిస్తారు. కానీ, వీటి వెనుక వ్యాపారం దాగి ఉందన్న విషయం వారికి తెలియదు అంటున్నారు సినీ జనాలు.

తన మోటార్‌బైక్ మీద వచ్చి పక్కన నిలబడ్డాడు. త్రివిక్రమ్‌కి తోడుగా కానిస్టేబుల్ వచ్చేసరికి ఆగంతకులు మెత్తబడ్డట్లు నటించారు. "నీ మోటార్ బైక్ పక్కనపెట్టి ఆ బైక్‌మీద వెనక కూర్చొని స్టేషన్‌కి రా. నేను ఒకణ్ణి నాతో తీసుకొని వెళ్తాను" అన్నాడు త్రివిక్రమ్, కానిస్టేబుల్‌ని చూస్తూ.

"ఎస్ సర్" అన్నాడు కానిస్టేబుల్.

కానిస్టేబుల్ ఆగంతకుడి వెనక కూర్చుంటే, రెండవ వ్యక్తి త్రివిక్రమ్ వెనక కూర్చొని త్రివిక్రమ్ గమనించకుండా సెల్‌ఫోన్‌లో మెసేజ్ పంపాడు. కానిస్టేబుల్ వారి ఎయిర్‌బ్యాగ్ పట్టుకొని "పద" అన్నాడు బైక్ నడుపుతున్న వ్యక్తితో.

రెండు మోటార్ సైకిళ్ళు పోలీస్‌స్టేషన్ ముందు ఆగాయి. త్రివిక్రమ్ బైక్ మీద నుంచి దిగి "పదండి" అంటూ ఆగంతకులిద్దరినీ స్టేషన్‌లోనికి తీసుకొని వెళ్ళాడు.

త్రివిక్రమ్ తన సీట్లో కూర్చొని "ఎక్కడ నుంచి వస్తున్నారు" అడిగాడు. ఇద్దరూ మాట్లాడలేదు. గద్దించాడు. అయినా మౌనమే సమాధానం. కానిస్టేబుల్ టేబుల్ మీద పెట్టిన ఎయిర్‌బ్యాగ్ తెరిచి చూశాడు. ఆశ్చర్యపోయాడు. "ఎక్కడివి ఇవి? ఎవరికి సంబంధించింది ఇంత డబ్బు" అడిగాడు.

ఇద్దరూ మాట్లాడలేదు. "మీతో ఎలా చెప్పించాలో నాకు బాగా తెలుసు" అంటూ బ్యాగ్ మూసి కానిస్టేబుల్ని పిలిచి "ఇద్దరినీ సెల్‌లో వెయ్యి. వీళ్ళసంగతి, డబ్బు సంగతి ఉదయం తేలుద్దాం. అంతవరకు ఈ బ్యాగ్ జాగ్రత్త! లాక్‌లో పెట్టు" అంటూ ఎయిర్ బ్యాగ్ కానిస్టేబుల్‌కి ఇచ్చాడు

ఇంతలో స్టేషన్ ఫోన్ రింగయింది. తీసి "హలో" అన్నాడు. అవతలి వ్యక్తి ఎవరు మాట్లాడుతున్నదీ తెలిసేసరికి అప్రయత్నంగా "సర్" అంటూ లేచి నిలబడ్డాడు. అవతలి వ్యక్తి చెప్పినదంతా విని "సరేసర్! మీ ఇష్టం. మీరు చెప్పినట్లే చేస్తాను" అన్నాడు.

త్రివిక్రమ్ మొహంలో రంగులు మారడం కనబడింది కానిస్టేబుల్‌కి. "వీళ్ళిద్దరినీ వదిలేయ్. బ్యాగ్ లోపల పెట్టు. మనిషివచ్చి తీసుకుంటాడు" కానిస్టేబుల్ వైపు చూసి అన్నాడు త్రివిక్రమ్. ఆ మాటల్లో చెప్పలేని భావన దృగ్గోచరమయింది.

●●●

తెల్లవారుతోందనటానికి సంకేతంగా కోడిపుంజు కూతలు, పక్షుల కిలకిలారావాలు వినపడుతున్నాయి. శివయ్య లేచాడు. మనసంతా అమావాస్య చంద్రుడిలా ఉంది. కాలకృత్యాలు తీర్చుకున్నాడు. బయలుదేరే సమయానికి భార్య ఎదురుగా నిలబడి ఉంది. ఇద్దరూ కళ్ళతోనే సంభాషించుకుంటున్నారు. ఇద్దరి మనస్సుల్లో మూగవేదన... నోటితో పలకరించుకోలేని నిస్సహాయ వేదన... నయనాల వెంబడి చిమ్మే అశ్రుధారలు... నిశ్శబ్దంగా నడుస్తూ ఎద్దుల దగ్గరకు వెళ్ళాడు. రెండింటి మీద చెయ్యి వేసి తనివితీరా నిమిరాడు. ఎద్దుల కళ్ళలో నీరు చూసి "తననుంచి వేరయిపోతున్నామని వాటికి తెలిసిందా! లేక తాము విడిపోతున్నామని అర్థమయిందా? భాషలో చెప్పలేని భావాలు కళ్ళతో చెపుతున్నాయా!" అంటూ శివయ్య మనస్సు పరిపరి విధాల పోయింది. స్తబ్ధుగా నిలబడ్డాడు.

"ఏం ఆలోచిస్తున్నావ్?" అడిగింది భార్య.

"రెండింటిలో దేన్ని అమ్మేయాలన్నా మన సొప్పటం లేదే!"

"నాకూ అలానే ఉంది. పిల్లల్ని అమ్ముకోవటానికి ఏ తల్లి ఇష్టపడుతుంది చెప్పు. కానీ గట్టెక్కాలి కదా! మనకి మరో దిక్కు లేదు" అంది.

"రెండింటినీ అమ్మేద్దామా? అక్కడ ఒకదానికి ఒకటి తోడు ఉంటాయేమో? లేకపోతే తన జత లేదని అక్కడ ఒకటి, ఇక్కడ ఒకటి బెంగపెట్టుకొని చచ్చిపోతాయేమో! రెండింటినీ దూరం చేసుకుంటే మనం బెంగ పెట్టుకుంటామేమో! అయినా రెండింటినీ ఒకరే కొంటారని నమ్మకం ఏమిటి! ఏం చెయ్యాలో పాలు పోవడం లేదు" అన్నాడు శివయ్య.

"ఏది ఏమయినా అమ్మక తప్పదు. కరణం గారు బ్యాంక్‌కి డబ్బు కట్టమన్నారు. కట్టకపోతే ఆయన పరువు, ఊరి పరువు పోతుంది. ఓ పని చేద్దాం. బొమ్మా బొరుసు వేద్దాం. బొమ్మని ఉంచుకొని బొరుసుని అమ్మేద్దాం" అంది భార్య.

విధిలేక నాణెం ఎగురవేసి బొరుసుపడ్డ ఎద్దు మెడలో పలుపుతాడు కట్టి బాధగా "నువ్వెళ్ళిపోక తప్పదు. మా కోసం నువ్వీ త్యాగం చెయ్యాలి" అన్నాడు. గొంతు జీరపోయింది. అర్థమయినట్లు తల ఊపుతూ మూగజీవి యజమాని వైపు చూసింది.

ఎద్దుని తోల్కొని బయలుదేరాడు. తల్లి, తండ్రి తమ పిల్లల్ని సాగనంపుతూ పడే ఆవేదన ఇద్దరిని సముదాయిస్తోంది.

దారి పొడవునా ఏడుస్తూనే శివయ్య సంతకు చేరాడు. తన దేహంలో ఏదో కోల్పోతున్నాననే భావన, సుడిలాంటి ఆలోచనల మధ్య సంతకు చేరాడు. సంతలో తనలా ఎంతో మంది తమ పశువులతో అమ్మకానికి నిలబడి ఉన్నారు. ఈ రోజు వరకు ఎవరితోనైనా తోడుగా రావటమే



**ప్రపంచంలో మూడు అగ్రశ్రేణి ధనిక కుటుంబాల సంపదను కలిపితే 48 పేద దేశాల సంపదతో సమానంగా ఉంటుంది!**

తప్పించి వ్యాపార నిమిత్తం రాలేదు. తన ఎద్దు ఎంత ఖరీదు చేస్తుందో కూడా తెలియదు. సంతలో ఓ మూలగా నిలబడి "కనీసం వడ్డీకట్టే పంట ఖరీదయినా వచ్చి ఉంటే ఈ రోజు దీన్ని అమ్మే అవసరం లేదుకదా" అని విచారిస్తున్నాడు.

వెనుక నుంచి "శివయ్య" అని పిలుపు వినపడింది. వెనక్కి తిరిగి చూశాడు. ఎదురుగా పురుషోత్తమ చౌదరి. ఆయన సంతలో ఎడ్లు కొని అమ్మటం చేస్తుంటాడు. చాలామంచి వ్యక్తి

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## పి.సి.ఓ.డి. నివారణకు సమర్థవంతమైన వైద్యం

డా. శ్రీకాంత్ మొర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



ప్రస్తుత కాలంలో ఆధునికతతో ముందుకు సాగుతున్న నేపథ్యంలో మానవుని జీవన విధానంలో ఎన్నో మార్పులు ఏర్పడుతున్నాయి. వీటి కారణంతో రోజువారీ సరైన ఆహార నియమాలు పాటించకపోవటం, అధిక మానసిక ఒత్తిడికి లోనవడం, ప్రతి నిత్యం వ్యాయామాలు చేయకపోవటం వంటి అంశాల వలన ఎన్నో ఆరోగ్య సమస్యలకు గురవుతున్నారు. ఇలాంటి అనేక సమస్యలలో ప్రధానమైన సమస్య PCOD. ఇది నేటికాలంలో ఎక్కువ మంది స్త్రీలను వేధిస్తున్న సమస్య. ముఖ్యంగా హార్మోన్‌ల అసమతుల్యత వలన ఏర్పడే PCOD వలన ఋతుచక్ర సమస్యలు కలుగుతాయి. యుక్త వయస్సు వారిలో ఇది తొలుత మొటిమలు, అవాంఛిత రోమాలు, అధిక బరువును కలుగజేస్తే, వివాహిత మహిళలలో సంతానలేమి సమస్యకు దారి తీస్తుంది. ఈ సమస్యకు సరైన చికిత్స అందించకుండా నిర్లక్ష్యం వహిస్తే ఇది డయాబెటిస్ మరియు గుండె సంబంధిత వ్యాధులకు దారి తీసే అవకాశం ఉంటుంది.

**పి.సి.ఓ.డి. అంటే:** అపరిపక్వమైన అండం (ఇమ్మెచ్యూర్ ఫాలికల్) నీటి బుడగల వలే మారి అండాశయపు గోడలపై ఉండిపోవడాన్ని పాలిసిస్టిక్ ఒవేరియన్ డిసీజ్ (పి.సి.ఓ.డి.) అని అంటారు. సాధారణ రీతిలో ఋతుచక్రము ఉన్న మహిళలలో నెలసరి అయిన 11–14 రోజుల మధ్యన, రెండు అండాశయాలలోని ఒక అండాశయం నుండి అండం విడుదల అవుతుంది. ఈ విధంగా ప్రతి నెలా ఎడమ వైపు లేదా కుడివైపున ఉన్న అండాశయం నుండి ఒక అండం విడుదల అయి, ఫలదీకరణకు సిద్ధంగా ఉంటుంది. కానీ పి.సి.ఓ.డి. ఉన్న మహిళలలో అండాశయం నుండి అండం విడుదల కాకుండా, అపరిపక్వత చెందిన అండాలు నీటి బుడగల వలె మారి అండాశయపు గోడలపై కనిపిస్తాయి. ఇలా రెండు అండాశయాలపై నీటి బుడగలు ఏర్పడటాన్ని వైద్యపరిభాషలో బైలేటరల్ పి.సి.ఓ.డి. అంటారు.



**కారణాలు:** ఈ సమస్యకు గల ఖచ్చితమైన కారణాలు తెలియరాలేదు, కానీ కొన్ని జన్యుపరమైన అంశాల వలన మరియు వంశపారంపర్యత వలన ఈ సమస్య తలెత్తే అవకాశం ఉంది • F.S.H., L.H., ఈస్ట్రోజన్, టెస్టోస్టిరాన్ హార్మోన్‌ల అసమతుల్యత, సరైన జీవనశైలి లేకపోవడం అంటే వ్యాయామం చేయకపోవడం మరియు ఆహార నియమాలను పాటించకపోవడం, పిండి పదార్థాలు, జంక్ ఫుడ్స్ ఎక్కువగా తీసుకోవడం • అధిక మానసిక ఒత్తిడికి లోనవడం వంటి అంశాలు కారణాలుగా చెప్పవచ్చు • ఇన్సులిన్ రెసిస్టెన్స్ : దీని వలన రక్తంలో ఇన్సులిన్ శాతం పెరిగి టెస్టోస్టిరాన్ హార్మోన్ స్థాయిలు పెరుగుతాయి. ఇది స్థూలకాయానికి దారితీసి పి.సి.ఓ.డి. సమస్యను ప్రేరేపిస్తుంది.

**లక్షణాలు:** నెలసరి రాకపోవడం, నెలసరిలో ఎక్కువ లేదా తక్కువ రక్తస్రావం కావటం, నెలసరిలో రక్తస్రావం 4–5 రోజులకు మించి కొనసాగటం, రెండు ఋతుచక్రముల మధ్యలో రక్తస్రావం అవడం • నెలసరి సరిగా వచ్చినా కూడా, అండాశయం నుండి అండం విడుదల కాకపోవడం • ముఖం మరియు వీపు భాగంలో మొటిమలు రావడం • చర్మపు మడతలలో మరియు మెడ భాగంలో చర్మం మందంగా మరియు నల్లగా మారటం • సంతానలేమి సమస్యలు • తలనొప్పి • బరువు పెరగడం • తల వెంట్రుకలు ఎక్కువగా రాలిపోవటం • కొందరిలో బరువు సాధారణంగా మరియు మరికొందరిలో బరువు తగ్గటం కూడా గమనించవచ్చు • ముఖం, ఛాతీ పైన మగవారికి మాదిరిగా వెంట్రుకలు రావడం • మానసిక అశాంతి (Mood Swings) వంటి లక్షణాలు కనిపిస్తాయి.

**దుష్ప్రభావాలు:** టైప్-II డయాబెటిస్, గుండె జబ్బులు, కొలెస్ట్రాల్ సమస్యలు, అధిక రక్తపోటు, ఎండోమెట్రియల్ క్యాన్సర్ వంటి సమస్యలకు పి.సి.ఓ.డి. దారి తీస్తుంది.

**తీసుకోవలసిన జాగ్రత్తలు:** జీవన విధానంలో మార్పులు చేసుకోవాలి – ముఖ్యంగా ఒత్తిడిని తగ్గించుకోవాలి. క్రమం తప్పకుండా వ్యాయామం చేయాలి. • బరువును అదుపులో ఉంచుకోవడం ద్వారా డయాబెటిస్, అధిక రక్తపోటు, కొలెస్ట్రాల్ వంటి సమస్యలకు దూరంగా ఉండవచ్చు. • కొవ్వు అధికంగా ఉండే పదార్థాలు మరియు జంక్ ఫుడ్స్ తీసుకోకపోవడం వంటి జాగ్రత్తలతో పి.సి.ఓ.డి. సమస్యను కొంతవరకు నియంత్రణలో ఉంచవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హార్మోన్‌ల అసమతుల్యతల వలన వచ్చే ఎలాంటి వ్యాధులనైనా హోమియోపతి మందులతో పూర్తిగా నయం చేయవచ్చు. హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా ఎలాంటి దుష్ప్రభావాలు లేకుండా పి.సి.ఓ.డి. సమస్యను పూర్తిగా నయం చేయడమే కాకుండా, ఎటువంటి కాంప్లికేషన్స్ ఉన్నా వాటన్నింటినీ తప్పక తగ్గించవచ్చు. యుక్తవయస్సులోనే పి.సి.ఓ.డి. సమస్యను గుర్తించి, సరైన చికిత్స తీసుకోవడం వలన ఇన్‌ఫెర్టిలిటీ మరియు ఒబేసిటీ వంటి దుష్ప్రభావాల నుండి మనల్ని మనం కాపాడుకోవచ్చు.

ఉచిత కన్సల్టేషన్ **955 000 1188 / 99**

www.homeocare.in

అని, నిజాయితీపరుడని పేరు ఉంది.

"నమస్కారం బాబయ్యా" అన్నాడు శివయ్య. "ఏంటి? ఇలా వచ్చావ్" అడిగాడు చౌదరి.

"ఈ ఎద్దుని అమ్ముదామని".

"అదేంటి శివయ్యా! నీ ఎడ్లే నీ ప్రపంచం అని బ్రతుకుతున్నవాడివి. ఎన్నిసార్లు అమ్మమని అడిగినా ససేమిరా అనేవాడివి. ఈ రోజు ఇలా?" తన అవసరం, పరిస్థితులు, పోషించలేని స్థితి చెప్పాడు శివయ్య.

"సరే! ఆ డబ్బులేవో నేనే ఇస్తాలే. ఇంతకీ ఎంత వస్తుందనుకుంటున్నావ్" అడిగాడు చౌదరి.

"దీని విలువ నాకు తెలియదు. నిజానికి ఇక్కడకు వచ్చి మిమ్మల్నే అడిగి అమ్ముదామను కున్నా. మీరే తీసుకునేటట్లయితే మీమీద నాకు నమ్మకం ఉంది. ఎంతిచ్చినా సరే" అన్నాడు శివయ్య.

"సరే నా కూడారా!" అంటూ దూరంగా ఉన్న ఎ.టి.ఎం. వైపు నడిచాడు చౌదరి. ఎ.టి.ఎం.లో నుండి డబ్బులు తీసుకువచ్చి శివయ్య చేతికి ఇచ్చి "లెక్కపెట్టుకో శివయ్య" అన్నాడు.

శివయ్య లెక్కపెట్టుకున్నాడు. తను ఊహించిన దానికంటే ఎక్కువగానే ఉంది. వడ్డీయే కాకుండా కొంచెం అసలు కూడా కట్టుకోవచ్చు అనుకున్నాడు.




కృతజ్ఞతతో "మీ ఋణం తీర్చుకోలేను బాబయ్యా" అంటూ కాళ్ళకు దండం పెట్టబోయాడు.

వంగబోతుండగానే భుజాలు పట్టిలేపి "నువ్వు వస్తువు ఇచ్చావు - నేను డబ్బు ఇచ్చాను. ఆపదలో ఉన్నవాడికి ఆపన్నహస్తం ఇస్తే జీవితాంతం గుర్తుండిపోతుంది. మనకు సంతృప్తి మిగులు తుంది. నువ్వెళ్ళి బ్యాంక్‌లో డబ్బుకట్టేయ్. వెళ్ళే టప్పుడు కరణంగారిని కూడా తీసుకొని వెళ్లు. ఆ కాగితాలు.. వ్యవహారం నీకు తెలియదు" అన్నాడు చౌదరి. "నమస్కారం బాబు" అంటూ ఇంటివైపు నడిచాడు. ఇంటికి చేరేసరికి ఇల్లంతా బోసిపోయి నట్లనిపించింది. అడుగుపెట్టగానే, అడుగుల ధ్వనికి తలలూపే ఎద్దులవైపు చూశాడు. ఒంట రిగా, దిగులుగా ఉంది అక్కడ ఉన్న ఎద్దు. గుమ్మంలో నీళ్ళచెంబుతో నిలబడి ఉంది భార్య. "అమ్మేశావా" అడిగింది.

"ఆ! చౌదరిగారు కొన్నారు. మనం అనుకున్న దానికన్నా కాస్త ఎక్కువే ఇచ్చారు. పుణ్యాత్ముడు" అన్నాడు.

"నిన్నసాయంత్రం కొండచిలువని చూశా నన్నావ్ కదా! ఊరు చివర మంగాయమ్మగారి మేకను మింగేసిందట".

"ఆకలికి తట్టుకోలేకపోయి ఉంటుంది. అడ విలో జంతువులకి కొదవ వచ్చి ఉంటుంది. ఊళ్ళ మీద పడింది. చెట్లే నరికేస్తుంటే జంతువులు మాత్రం ఏం మిగుల్తాయి" అంటూ సగం చెంబు నీళ్ళతో కాళ్ళు కడుక్కొని మిగిలిన నీళ్ళు భార్య చేతికి ఇచ్చి,

"రేపు ఉదయాన్నే కరణం గారిని తీసుకొని వెళ్ళి బ్యాంక్‌లో కట్టేస్తాను. కనీసం మరికొంతకాలం గడుస్తుంది. ఆ లోపులో దేవుడు దయతలిస్తే మన పొలం మనకు దక్కుతుందేమో?" అన్నాడు.

పొద్దున్నే లేచి డబ్బు తీసుకొని కరణంగారి ఇంటికి బయలుదేరాడు. దారిలో పొలం కన పడింది. ఆగాడు. పొలం వైపు చూశాడు. ఏదో వెలితిగా అనిపించింది. ఆలోచించగా అర్థమయింది. నాగలి దున్నేటప్పుడు జతగా ఉండే ఎద్దు మరింక ఉండదని తలచుకునే సరికి కళ్ళు చెమర్చాయి. తన దీనావస్థ గుర్తుకు వచ్చింది. ఏ దురలవాట్లు లేక ఎంత జాగ్రత్తగా ఉన్నా, అప్పులు పాలవ్వక తప్పలేదు. తను, భార్య కలిసి కూలిపని చేసినా వడ్డీలు తీర్చలేక, ఒక భుజాన్ని నరుక్కోవాల్సి వచ్చింది. రేపట్నించి ఒకవైపు ఎద్దు మరోవైపు తన భుజం కలిపి నాగలి దున్నాలేమో అనుకున్నాడు.

కరణంగారి ఇంటికి చేరేసరికి ఆయన అరుగు మీదే కూర్చొని ఉన్నారు. శివయ్య ఎదురవ్వగానే, "ఏం శివయ్యా! ఏం చేశావ్ బ్యాంక్ సంగతి" అడి గారు.

"కొంతలో కొంత సర్దుబాటు చేస్తున్నాను బాబయ్యా" అన్నాడు శివయ్య.

"ఎలా సంపాదించావ్".

"ఒక ఎద్దుని అమ్మేశాను".

"ఏమిటీ? నువ్వు ఒక ఎద్దుని అమ్మేశావా?" ఆశ్చర్యంగా అడిగాడు కరణం.

"తప్పలేదు".

"సొంతపిల్లల్లా చూసుకుంటావ్ కదా! అలాం టిది ఎలా అమ్మాలనిపించింది?"

"ఏం చెయ్యను బాబయ్యా! దేవుడి పరీక్ష. మీ మాట తీసెయ్యలేను. మీ పరువు, ఊరి పరువు పోకూడదని అమ్మేశాను. సంతలో పురుషోత్తమ చౌదరిగారు కొన్నారు. నామీద జాలి తలచి కాస్త ఎక్కువ ధర ఇచ్చారు. ఈసారికి గట్టెక్కుతాను. మళ్ళీ ఇదే పరిస్థితి ఎదురైతే ఉన్న ఎద్దు, పొలం కూడా అమ్మేసి అప్పు తీర్చేసి, నేను మా ఆవిడా ఏ నుయ్యో గొయ్యో చూసుకోక తప్పదు అన్నాడు శివయ్య.

"ఆ పని చెయ్యకు. కాలవలు తవ్వుతున్నారు కదా! పై ఏటికి నీరు రావచ్చేమో?"

"అయన్నీ రాజకీయ పథకాలు బాబయ్యా. ఈ ఎన్నికల ముందు మొదలుపెట్టారు. మళ్ళీ ఎన్నికలకి మరో అడుగు తవ్వుతారు. అలా తవ్వి తవ్వి మమ్మల్ని అందులో కప్పేస్తారు. అంతే. ఈ లోపులో ఆ డబ్బు నాయకులు, అధికారులు అందరూ పంచుకుంటారు. వడ్డీ మాఫీ అన్నారు. బ్యాంక్ మేనేజర్ వసూళ్ళ కోసం వచ్చారు కదా! అయినా అదంతా ఎందుకులే బాబయ్య. బ్యాంక్‌కి వెళ దామా" అన్నాడు.

ఇద్దరూ కలిసి బ్యాంక్‌కి వెళ్ళారు. మేనేజరు వీళ్ళిద్దర్నీ చూడగానే క్యాబిన్‌లోని ఆహ్వానించాడు. కరణం కుర్చీలో కూర్చుంటే శివయ్య పక్కన నిల బడ్డాడు. శివయ్య తన దగ్గర డబ్బుని మేనేజర్‌కి ఇచ్చాడు. శివయ్య ఆ డబ్బు ఎలా సంపాదిం చిందీ కరణం మేనేజర్‌తో చెప్పాడు.

"అలాగా" అంటూ జాలిపడి "కరణంగారూ! మనం మాత్రం ఏం చెయ్యగలం. విధి నిర్వహణ తప్పదు కదా!" అని కేషియర్‌ని పిలిచి డబ్బు ఇచ్చి శివయ్య పేరు మీద జమ చేయమన్నాడు మేనేజర్.

కొంతసేపటి తర్వాత కేషియర్ క్యాబిన్‌లోకి వచ్చి మేనేజర్‌కి కొన్ని వెయ్యిరూపాయల నోట్లు ఇచ్చి, "సార్! అవి దొంగనోట్లు" అన్నాడు. వినగానే "ఆ" అంటూ ఉన్నచోటే కుప్పకూలిపోయాడు శివయ్య.

●●●

దొంగనోట్లు ఎ.టి.ఎం.లో వచ్చినందుకు శిక్షగా బ్యాంక్ మేనేజర్‌ని దూర ప్రాంతాలకు బదిలీ చేశారు. ఉద్యోగ నిర్వహణలో నిర్లక్ష్యంగా ఉన్నా వంటూ ఉద్యోగం తీసేసినంత పనిచేసి, జాలి చూపిస్తున్నామంటూ, ఓ హెచ్చరిక చేసి త్రివిక్రమ్‌ని గిరిజన ప్రాంతాలకు బదిలీ చేశారు.

●●●

ఖరీదైన ఓ ఆతిథ్య బంగ్లా. చుట్టూ తోట. బంగ్లా మధ్యలో పెద్దహాలు. హాలు మధ్య నగిషీలు చెక్కిన టేబుల్, టేబుల్ చుట్టూ మూడు కుర్చీలు ఉన్నాయి. కుర్చీల్లో మూడు కొండచిలువలు కూర్చొని ఉన్నాయి. టేబుల్ మీద మూడు గ్లాసులు స్కాచ్ విస్కీతో నింపబడి ఉన్నాయి. మూడు చేతులు విస్కీగ్లాసుల్ని ఎత్తి గాలిలోకి లేపాయి. గ్లాసులు గలగల లాడాయి. "మన వ్యాపార సామ్రాజ్యం నిరవధికంగా విస్తరించాలని త్రీ చీర్స్" అంది ఒక గొంతు. మరో రెండు గొంతులు ఆ గొంతుతో జత కలిపాయి. ఆ మూడు కొండచిలువలు ఒకటి అధికారికంగా ఎ.టి.ఎం.లో డబ్బు చేరవేసే కాంట్రా క్టర్, రెండోది డి.ఐ.జి., మూడోది హోం మంత్రి.

ఎన్ని మేకలను మింగినప్పటికీ కొండచిలువ లకి ఆకలి తీరదు కాబోలు.

*సెల్: 0884-2348526*

# ష్..! గప్‌చుప్!

**మీరు ఆ ప్రదేశానికి వెళ్లారనుకోండి అక్కడ మీ సెల్‌ఫోన్లు ఏవీ పనిచేయవు. పోనీ ఎవరినైనా దారి అడిగి ముందుకు వెళదామనుకున్నా కొన్ని కిలోమీటర్లదూరం వరకు మీకు అక్కడ చెప్పే వాళ్లు ఎవరూ ఉండరు. పోనీ వెంట దిక్సూచీ తీసుకెళ్లి దిక్కులు గమనిస్తూ వెళదాం అనుకున్నా సరే కుదర్దు. ఎందుకంటే అక్కడ దిక్సూచీ కూడా పనిచేయదు మరి! పాటలు వినాలన్నా రేడియో పనిచేయదు. అసలక్కడ ఏమీ ఉండదు, అదో నిశ్శబ్ద మండలం. మరి ఆ ప్రాంతం గురించి మనకెందుకు అనుకుంటున్నారా! ఆ నిశ్శబ్ద మండలంలో జరిగే చర్యలను ఇప్పటివరకు ఎవరూ కనిపెట్టలేకపోయారు మరి!**

మెక్సికో దేశ సరిహద్దు ప్రాంతంలో ఉంది ఈ నిశ్శబ్ద మండలం. ఈ ప్రాంతానికి ప్రత్యేకమైన పేరేమీ లేదు. దీని సమీప గ్రామం పేరు మాపిమి. అందుకే ఈ ప్రదేశాన్ని మాపిమి అంటే సైలెంట్ జోన్ అని పిలుస్తారు. ఇక్కడ ఎలాంటి శబ్దాలూ ఉండవు. అందుకే దీన్ని నిశ్శబ్దమండలం (సైలెంట్ జోన్) అని పిలుస్తున్నారు.

### ఎగిరే వస్తువుల్ని లాక్కుంటోందా?

ఆకాశంలో ఎగిరే విమానాలు, హెలికాప్టర్లు, రాకెట్లు లాంటివి ఈ ప్రదేశం గుండా పోతే అంతే సంగతులు. నేరుగా వచ్చి ఈ మండలంలో పడాల్సిందే. ఆకాశంలో నుంచి వస్తువులను ఈ మండలం లాక్కుంటుందట. పోనీ ఆ వస్తువులు లాక్కునేటప్పుడు భారీ శబ్దం రావాలి కదా! కానీ అలా లాక్కునేటప్పుడు కూడా ఎలాంటి శబ్దమూ అక్కడ వినపడదట. అపోలో రాకెట్ బూస్టర్లు, పరీక్షా క్షిపణులు, ఒక భారీ ఉల్క ఈ మండలంలో పడి ఉన్నాయట. ఇక్కడ రేడియో పని చేయదు. దిక్సూచీ దిక్కులు చూపించదు. ఈ మండలంలో ఉండే పువ్వులు, జంతువులు ప్రకృతి స్వభావ విరుద్ధంగా ఉంటాయట. అంటే జన్యులోపాలతో ఉంటాయన్నమాట!

### గ్రహాంతర వాసులున్నారా?

వినడానికే ఆశ్చర్యంగా ఉన్న ఈ ప్రాంతాన్ని ఈ మధ్యనే కనుక్కున్నారు. భూమ్మీద ఇలాంటి చోటు ఒకటి ఉన్నదని చాలామందికి తెలియదు. ఐతే 1970ల్లో కొందరికి మాత్రం ఈ ప్రాంత స్వభావం గురించి తెలుసుగానీ పెద్దగా ఎవరూ పట్టించుకోలేదు. ఇప్పుడిప్పుడే ఈ నిశ్శబ్ద మండలం గురించి ప్రజలు బాగా చర్చించుకుంటున్నారు. ఐతే ఈ నిశ్శబ్ద మండలంలో గ్రహాంతర వాసులు వచ్చి కలుసుకుంటున్నట్లు వేడి గులకరాళ్లు ఈ ప్రాంతంలో పడుతున్నట్లు, అతీత శక్తులు తిరుగుతున్నట్లు కథలు ప్రచారంలోకి వచ్చాయి. దీంతో పర్యాటకులు, ఇలాంటి విషయాలపై విద్యాపరమైన ఆసక్తికలవారు ప్రపంచం నలుమూలల నుంచి ఈ ప్రాంతానికి రావడం ప్రారంభించారు.

### ఎలా బైటపడింది?

అమెరికావారు తమ వైట్ సాండ్స్ క్షిపణి కేంద్రం నుండి 1970లో జరిపిన ఒక క్షిపణి పరీక్ష విఫలమైంది. లక్ష్యం తప్పి ఎడారిగా ఉన్న ఈ నిశ్శబ్ద మండలంలో పడిపోయింది. మెక్సికో సరిహద్దులో ఒక ఎడారి ఉన్నట్టు ప్రపంచానికి అప్పుడే తెలిసింది. ఈ క్షిపణి శకలాలను అందులోని అత్యంత ఆధునిక కంప్యూటర్ భాగాలను సేకరించేందుకు మెక్సికో అనుమతితో అమెరికా విమానదళ బృందం అక్కడికి వెళ్ళింది. కానీ క్షిపణి ఆచూకీ దొరకలేదు. క్షిపణి జాడ కనిపెట్టేందుకు ఎంత ప్రయత్నించినా వారి దగ్గరున్న పరికరాలు వాకీటాకీ, రేడియో పనిచేయలేదు. కొంత ప్రయత్నం, నిర్ధారణల తర్వాత ఆ ప్రాంతంలో ఏదో కనిపెట్టాల్సిన విషయం ఉందని వారు గ్రహించారు.

### అందరి దృష్టీ దీనిపైనే

ఈ ప్రాంతంలో ఏదో అబ్బురం ఉందని తెలియడంతో ఔత్సాహిక శాస్త్రవేత్తలు దృష్టి సారించారు. అమెరికా శాస్త్రవేత్తలు కూడా బృందాలుగా విడిపోయి నలువైపులా వెతకడంతో మూడువారాల తర్వాత క్షిపణి జాడ తెలిసింది. పెద్ద పెద్ద ముక్కలుగా విరిగిపడి ఉంది. ఆ శకలాలు తరలించేందుకు రన్ వే నిర్మించాల్సి వచ్చింది. మొత్తం ఈ వ్యవహారమంతా హడావుడిగా, రహస్యంగా ఉంచడం వల్ల దీనిపై దృష్టి పెట్టిన మిగిలిన ప్రపంచ దేశాల్లో కూడా సంచలనం కలిగింది. ఇది ఎన్నో ఊహాగానాలకు దారి తీసింది. దాంతో అక్కడి జీవావరణ పరిస్థితుల అధ్యయనానికి ఇటీవలే ఒక పరిశోధనా కేంద్రాన్ని ఏర్పాటు చేసింది మెక్సికో ప్రభుత్వం. ఈ విషయాలన్నీ ఈ కేంద్రం ద్వారానే బహిర్గతమయ్యాయి.

### అసలు రహస్యమేంటి?

ఒక ఎడారి ప్రాంతంలో ఇలాంటి విడ్డూరం ఉందంటే సాధారణంగా నమ్మరు. కానీ అల్లన్డే అనే ఒక ఉల్క 1969లో ఈ నిశ్శబ్ద మండలంలో పడింది. ఇక్కడేదో అద్భుత శక్తి ఉందనడానికి దీన్నే బలమైన సాక్ష్యంగా చెబుతారు. 1950లో మెక్సికో పైలట్ ఫ్రాన్సిస్కో సరబియా ఈ ఎడారి గగనతలంపై నుంచి వెళుతుండగా విమానంలోని కమ్యూనికేషన్ పరికరాలు పనిచేయడం లేదని పై అధికారులకు తెలియజేశాడు. మెక్సికో ప్రభుత్వం దగ్గర దీనికి సంబంధించిన రికార్డులున్నాయి. ఈ సంఘటనలన్నీ ఎందుకు జరుగుతున్నాయి? ఏ కారణంగా జరుగుతున్నాయి? ఈ ప్రాంత భూగర్భ స్వభావం? గాలి స్వభావం ఎలాంటిది? వంటి విషయాలన్నీ ఇంకా పరిశోధనల్లో తెలియాల్సి ఉంది.

- విక్రం దహగాం





# గే.మ్.ఆ.ఫ్.లై.ఫ్

-కంఠంనేని రాధాకృష్ణమూర్తి



**జీవితం ఎప్పుడూ ఒకే రకంగా ఉండదు. ఎప్పుడు ఏం జరుగుతుందో తెలియదు. మీరెంతో సంతోషంగా అంతా సజావుగా ఉందనుకుంటూ బ్రతుకుతున్న వేళ హఠాత్తుగా ఏదో అనర్థం లేక దుర్ఘటన జరిగి మీకు దిమ్మదిరిగిపోవచ్చు.**

- ఉద్యోగం ఊడటం
- వ్యాపారంలో నష్టం రావటం, సర్వాస్నీ కోల్పోవటం
- వివాహం విచ్ఛిన్నం కావటం
- ప్రేమ విఫలం కావటం, లేక ప్రేమలో మోస పోవటం
- ఏ యాక్సిడెంటులోనో ఆత్మీయుల్ని కోల్పోవటం.

# ఈ జీవితం మీది, దీని బాధ్యత మీదే!!

ఇలాంటివి లేక వేరే రకపు ఘటనలు ఊహించని విధంగా సడన్‌గా జరిగితే ఆ మనిషి కుంగిపోవటం సహజం.

చాలామంది తమ జీవితంలో జరిగే ఇలాంటి చెడు సంఘటనలు, ఆటుపోట్లను వేరే వాళ్ళ మీదకు నెడుతుంటారు.

"వాళ్ళు కల్పించుకోబట్టి ఇలా అయింది"

"వాళ్ళు చేయబట్టి నాకీ పరిస్థితి వచ్చింది"

"అది మోసం చేసింది"...ఇవన్నీ అవతలి వాళ్ళను బ్లేమ్ చేయటం, తన తప్పులేదనే ప్రయత్నాలు.

బిజినెస్‌లో భాగస్వామి మోసం చేయటంతో చిప్ప చేతికొచ్చింది. అతడు మోసం చేశాడని చెప్పుకోవటం ఎంతవరకూ సబబు?! ఆ అవకాశం ఇవ్వటం తన తప్పు కాదా? తన బాధ్యత కాదా? తనను బాధ్యుడుగా చేసుకోవటం.

ఎంతటి నెగెటివ్ సంఘటన జరిగినా, అది జరగటానికి బాధ్యత, ప్రమేయం, తనదేమీ లేకపోయినా కూడా "దీనికి బాధ్యుణ్ణి నేనే", 'దీనికి బాధ్యత నాదే" అనుకోవటం హుందాతనాన్ని సూచిస్తుంది. అప్పుడతను 'స్మార్ట్ పర్సన్' అవుతాడు. కొన్ని సినిమాల్లో చూస్తాం, హీరో దొంగతనాలు, దోపిడీలు చేస్తాడు. ఎవరెవరినో చంపుతుంటాడు. ఆఖరుకు పట్టుబడి కోర్టులో జడ్జి ముందు నిలబడి ఆవేశపూరితంగా ఇంత పొడవు డైలాగ్ చెబుతాడు. "ఈ తప్పు నాది కాదు, నన్ను పురిగొల్పిన సమాజానిది, లేకపోతే, నేరం నాది కాదు, ఆకలిది" అంటూ.



ఒక దుర్ఘటన బాధ్యతను వేరే వాళ్ళ మీదకు నెట్టటం కంటే బాధ్యతను తనమీద వేసుకుని హుందాగా ముందుకు సాగటం, కర్తవ్యం గురించి ఆలోచించటం ఉత్తమ లక్షణం!

ఇతరుల మీదికి నెపం నెట్టటం, బ్లేమ్ చేయటం నెగెటివ్ ఆలోచన (Negative Thinking)లో భాగం. జీవితాన్ని సీరియస్‌గా తీసుకోనివాళ్ళ లక్షణం అది.

జీవితాన్ని సీరియస్‌గా తీసుకోనివాళ్ళకి విలువలతో పని లేదు, ఎలా బ్రతికినా ఫరవాలేదు. ఏ అసౌకర్యం లేకుండా ఇప్పటికిప్పుడు కంఫర్టబుల్‌గా బతికితేచాలు. రేపటి సంగతి రేపు చూసుకోవచ్చుననే సంకేతాన్ని తమ మెదడులోకి (అన్ కాన్షస్) పంపుతున్న వాళ్ళవుతారు. క్రమేపీ ఆ సంకేతాలు వాళ్ళ మనస్సులో ఇంకిపోయి ఆఖరికి అది నెగెటివ్‌గా వ్యక్తిత్వంలో ఒక భాగమైపోతుంది.

చేతికి ఎలా అందితే అలా బతికేయటం తప్ప ఒక లక్ష్యం వైపు ప్రయాణం, పరిస్థితులకు ఎదురీదటం లాంటి ప్రయత్నాలేమీ ఉండవు. దారం తెగి గాలిలో కొట్టుకుపోతున్న గాలిపటంలా ఉంటుంది వాళ్ళ జీవితం.

మనిషి ఉండాల్సింది అలా కాదు. గాలిపటం గాలిలో ఎగరక తప్పదు. కాని దాని దారం మన చేతిలోనే ఉండాలి. తెగిపోనివ్వకూడదు. మన ఇష్టమొచ్చినంత ఎత్తుకు, ఇష్టమొచ్చిన వాలుకు మన చేతిలో దారాన్ని కంట్రోల్ చేస్తుండాలి. జీవితాన్ని సీరియస్‌గా తీసుకోవటం అంటే జీవిత మనే స్టీరింగ్ వీల్ మన చేతిలో ఉంచుకోవటం, కంట్రోల్ చేయడం. జీవితంలో సంఘటనలకు

సమాజంలో ఇలాంటి నేరప్రవర్తనగల వాళ్ళు ఉంటూనే ఉంటారు. కాని వాళ్ళు అలా తయారు కావటానికి కారణం సమాజమో, వేరొకళ్ళో కాదు, వాళ్ళకు వాళ్ళే కారణం! అలాంటి స్థితిలో బతికే వాళ్ళు ఇంకా చాలామంది ఉంటారు కూడా. కాని అందరూ అలా నేర ప్రవర్తన ఎన్నుకోరు. తమకున్న పరిధి, పరిమిత అవకాశాలను ఉపయోగించుకుంటూ వాళ్ళలో కొందరు ఉన్నత స్థానాలకు ఎదిగిన వాళ్ళూ ఉంటారు. ఎవరినీ నిందించకుండా, నేరప్రవర్తన ప్రదర్శించకుండా 'మంచి పౌరుడు'గా బ్రతుకుతున్నవాళ్ళూ ఉంటారు.

ఎమోషనల్‌గా పరిపక్వత సాధించని వాళ్ళు మాత్రమే తమకు జరిగే నెగెటివ్ సంఘటనలకు కారణాల్ని వేరే వాళ్ళమీదకు నెడుతుంటారు. మంచిగా జరిగే సంఘటనలకు మాత్రం తమను కారణంగా చెప్పుకుంటారు.

ఒక చిన్నపిల్లవాడికి మీరు కొన్ని చాక్లెట్లు చూపించి, "నువ్వు ఇపుడు తింటానంటే ఒక చాక్లెట్ మాత్రమే ఇస్తాను. రేపు తింటానంటే ఐదు చాక్లెట్లు ఇస్తా. ఏది కావాలి?" అన్నారనుకోండి.

అతను ఒక చాక్లెట్ తీసుకోడానికే మొగ్గు చూపిస్తాడు.

తమకు జరిగే చెడు సంఘటనలకు నెపాన్ని వేరేవాళ్ళ మీదకు నెట్టేవాళ్ళు కూడా ఈ చిన్న కుర్రాడిలాంటి వాళ్ళే!!

## మూడు ప్రేరణలు

మన ప్రవర్తన మీద మూడు ప్రేరణలు పని చేస్తుంటాయి అవి:

- శరీరం
- 'నేను' అనే స్వార్థం (ఇగో)
- అంతరాత్మ (Soul లేక SuperEgo)

శరీరం తను మంచిగా 'భావించిన' మంచిగా 'ఫీలయిన' పనుల్ని చేయమంటుంది. మంచిగా 'కనిపించే' పనుల్ని చేయమంటుంది. అంతరాత్మ 'మంచిపనుల్ని' చేయమంటుంది.

'శరీరం' తనకు సుఖకరంగా ఉండే పనులు చేయమంటుంది. అందులో 'మంచి' 'చెడు'లకు సంబంధించిన వివేచన ఉండదు. సుఖకరంగా ఉండే పనులంటే,

- హాయిగా రెస్టు తీసుకోవటం, పడుకోవటం, నిద్ర పోవటం లాంటివి. అతి నిద్ర కూడా ఇందులోదే.
- కడుపునిండా తినటం, రుచికరంగా ఉంటే చాలు, హానికరమైన ఆహారమైనా తినమంటుంది. కడుపు పగిలేట్లు అతిగా తినటం కూడా ఈ కేటగిరీలోకే వస్తుంది.
- సెక్స్ సంబంధమైన కోర్కె. మనస్సు అదుపు చేసుకోక పోతే సమాజానికి ఆమోదయోగ్యం కాని, నేరపూరితమైన సెక్స్ ప్రవర్తనను కూడా ప్రేరేపిస్తుంది.
- 'నేను' (స్వార్థం) మనల్ని తెలివిగా ప్రవర్తించ మంటుంది. మనం మంచిగా ఉండటం కాదు, లోకానికి 'మంచిగా' కనిపించేట్లు ప్రవర్తించ మంటుంది.

మరో మాటలో చెప్పాలంటే మనం వెధవ పనులు చేయవచ్చుగాని లోకానికి తెలిసేట్లు, లోకానికి కనిపించేట్లు చేయకూడదంటుంది.

లోకం దృష్టిలో మనకు 'మంచి ఇమేజ్' వచ్చేట్లు ప్రవర్తించమంటుంది.

'ఛుపా రుస్తుం'లు వీళ్ళు. వీళ్ళలోని చెడుని కనిపెట్టటం అంత తేలికకాదు. లోకం నిండా ఇలాంటి వాళ్ళే ఎక్కువగా లుకలుకలాడుతుంటారు.

ఇక అంతరాత్మ ప్రేరణతో జీవితాన్ని సాగించే వాళ్ళు మూడో రకం. తమ పట్ల తమకు అపార మైన గౌరవం (SelfEsteem) ఉంటుంది వీళ్ళకి.

వాళ్ళు తమలోని, సమాజంలోని 'మంచి' 'చెడు' లను ఎప్పటికప్పుడు బేరీజు వేసుకుంటుంటారు. ఇతరులు 'మంచి' అనేదానిని కాకుండా తమకు 'మంచి' అనిపించే పనుల్ని మాత్రమే చేస్తారు.



తమ అవసరాలు, స్వార్థానికి నష్టం కలిగించేదైనా సరే తనకు మంచిగా అనిపించిన, తను మంచిగా భావించిన పనిని మాత్రమే చేస్తారు. తమ జీవితంలో జరిగే 'చెడు'కు కారణాన్ని ఏనాడూ ఒకరి మీదకు నెట్టరు. అందుకు బాధ్యత తమదేనంటారు. ఈ ప్రేరణతో జీవితాన్ని సాగించే వాళ్ళు లోకంలో చాలా కొద్దిమంది మాత్రమే ఉంటారు.

మనకు తెలిసిన పబ్లిక్‌ఫిగర్స్‌లో నిన్నటి తరానికి సంబంధించి ఎన్టీ రామారావు, నేటి తరంలో పవన్‌కల్యాణ్ ఈ కోవకు చెందుతారు. ఆదర్శనీయమైన వ్యక్తిత్వం వాళ్ళది.

## సెల్ఫ్-డిసిప్లిన్

మీ జీవితంలో జరిగే ప్రతి తప్పుకూ, చెడుకూ, అపజయానికీ బాధ్యతను మీ మీద వేసుకోవటం మీ మనో క్రమశిక్షణ(Self Discipline)ను తెలియ జేస్తుంది. సెల్ఫ్-డిసిప్లిన్ పాటించటం అంత తేలికైన పనేం కాదు.

సెల్ఫ్ డిసిప్లిన్‌ని మీరు ఎంతగా పాటిస్తే అంతగా జీవితంలో సక్సెస్, సంతోషం, సంతృప్తి పొందగలుగుతారు.

ఇది మీ జీవితం. దేనికో రిహార్సల్ కాదు. మీరో స్టేజ్‌మీద ఉన్నారు. గేమ్ నడుస్తోంది. ఇందులో మీరు ప్రధాన పాత్రధారి. గేమ్ రక్తి కడుతుందా లేదా, గేమ్‌లో మీరు గెలుస్తారా లేదా అనేది మీ చేతుల్లోనే ఉంది. బాధ్యత మీదే. మరెవరూ ఆ బాధ్యత తీసుకోరు. లోకం మొత్తం ఒకవేపు, మీరొక్కరే ఒకవేపు.

"ఎవరో వస్తారని, ఏదో చేస్తారని, ఎదురుచూసి మోసపోకుమా" అని సినీ కవి అన్నట్లుగా, ఎవరో వచ్చి మిమ్మల్ని ఆదుకుంటారు, సహాయ పడతారు అనుకుంటే అది మీ భ్రమే. భంగ పడతారు.

జీవితంలో జరిగే సంఘటనలకు మూలం - బాధ్యత - మీదేనని అనుకోవటం చాలా కఠినతరమైనది. ఇందుకు ఎంతో మనోక్రమశిక్షణ అవసరం. ఆ డిసిప్లిన్ లేకుండా ఎవరూ సక్సెస్ సాధించలేరు.

లోకంలో 80 శాతం మంది తమ జీవితంలో జరిగే సంఘటనలకు - నెగెటివ్ సంఘటనలకు - తమదే పూర్తి బాధ్యత అని ఒప్పుకోరు.

తమకేదన్నా చెడు జరిగితే దానికి వేరేవాళ్ళను బాధ్యుల్ని చేస్తారు. వేరే వాళ్ళను బ్లేమ్‌చేస్తారు. ఆ వేరే వ్యక్తిని విలన్‌గానూ తనను బాధితుడుగానూ చెప్పుకుంటారు. మాటిమాటికీ దాని గురించి చెప్పుకుంటూ బాధపడిపోతుంటారు. ఆ బాధ్యత వేరే వాళ్ళమీద కాకుండా తనమీదే వేసుకుంటే ఇంత బాధ, నిస్సంతోషం తగ్గిపోతాయి. మనస్సుకు స్పష్టత, ప్రశాంతత చేకూరి మంచి నిర్ణయాల్ని తీసుకో గలుగుతారు. తనకు జరిగే చెడు సంఘటనలకు కారణం వేరే వాళ్ళ మీదకు నెడుతున్నంత కాలమూ ఆ మనిషి మానసికంగా చిన్న పిల్లవాడైపోతాడు. నిస్సహాయంగా ఫీలవుతాడు. దుర్బలుడుగా మిగిలిపోతాడు.

అదే మీరు బాధ్యతను మీ మీద వేసుకున్నపుడు మీ మీద మీకు కంట్రోల్ ఉన్నట్లు ఫీలవుతారు. శక్తిమంతంగా ఫీలవుతారు.

## బాధ్యత అంటే (Responsibility)

సక్రమంగా స్పందించగలిగే శక్తిని కలిగి ఉండటం.

జీవితానికి సంబంధించి మనిషి పాటించాల్సిన ముఖ్య సూత్రం ఏమిటంటే, గతంలో జరిగిన చెడును మర్చిపోవటం, మర్చిపోతూ ముందుకు సాగటం, అంతే తప్ప ఆ చెడుని తల్చుకుంటూ, కుమిలిపోతూ ఒకచోట నిలిచిపోకూడదు. ఎల్లలు లేని అందమైన భవిష్యత్తు మీ కళ్ళముందు నిలిచి ఉంది. మీ కోసం ఎదురుచూస్తోంది. పదండి ముందుకు-

"సూర్యునికి ఎదురుగా నిలబడితే నీడ మీ వెనక్కి వెళ్ళిపోతుంది" అంటుంది హెలెన్ కెల్లర్.

గతంలోని చెడుతాలూకు నీడలు కూడా అంతే. బాధ్యతను స్వీకరించటం అనే కాంతికి ఎదురుగా నిలబడితే గతంలోని చెడు మీకు కనపడదు. మీ వెనక్కు వెళ్ళిపోతుంది.



***(ఇంకావుంది)***

# వంటలు

## బీట్‌రూట్ పూర్ణాలు



**కావలసిన పదార్థాలు:**

బీట్‌రూట్ తురుము - కప్పు, బొంబాయిరవ్వ - అర కప్పు, కొబ్బరి తురుము - పావుకప్పు, పంచదార - ఒకటిం పావు కప్పు, యాలకుల పొడి - రెండు చెంచాలు, మిన ప్పప్పు - కప్పు, బియ్యం - రెండు కప్పులు, నెయ్యి - రెండు చెంచాలు, నూనె - వేయించడానికి సరిపడా, ఉప్పు - చిటికెడు

**తయారీ పద్ధతి:**

బియ్యం, మినప్పప్పును నాలుగు గంటల ముందు నానబెట్టు కుని ఆ తరువాత మెత్తగా పిండిలా రుబ్బుకుని ఉప్పు వేసుకోవాలి. ఓ గిన్నెలో అరకప్పు నీళ్ళు మరి గించి బీట్‌రూట్ తురుము, బొంబాయి రవ్వ, పంచదార వేసు కోవాలి. ఇందులో చెంచా నెయ్యి వేస్తే అడుగు అంట కుండా ఉంటుంది. ఐదారు నిమిషాలకు బొంబాయిరవ్వ ఉడికి మిశ్రమం దగ్గరపడు తుంది. అప్పుడు కొబ్బరితురుము, యాలకుల పొడి వేసుకుని పొయ్యి కట్టేయాలి. ఇది చల్లారాక ఉండల్లా చేసి పెట్టుకోవాలి. ఈ ఉండల్ని ముందుగా చేసిపెట్టుకున్న పిండిలో ముంచి కాగుతోన్న నూనెలో వేయాలి. ఎర్రగా వేగాక తీసేస్తే కమ్మని బీట్‌రూట్ పూర్ణాలు సిద్ధం.

## ఫూల్‌మఖానా ఖీర్

**కావలసిన పదార్థాలు:**

ఫూల్‌మఖానా (తామర గింజలు) - ఒక కప్పు, పాలు - అరలీటర్, పంచదార - 4 టేబుల్ స్పూన్లు, నెయ్యి - ఒక టేబుల్ స్పూన్, యాలకుల పొడి - అర టీ స్పూన్, బాదంపప్పు - 4

**తయారుచేసే పద్ధతి:**

ఒక బాండీలో కొంచెం నెయ్యి వేసి ఫూల్‌మఖా నాని ఎర్రగా, క్రిస్పీగా అయ్యేదాకా వేయించి పక్కన పెట్టాలి. వేయించిన ఫూల్‌మఖానాలో కొన్ని మిక్సీ జార్‌లో వేసి పొడిచేసి పెట్టాలి. అడుగు మందంగా ఉన్న బాండీ లేదా గిన్నెలో పాలు పోసి మరిగించాలి. మరిగిన పాలలో పొడిచేసి పెట్టిన ఫూల్ మఖానా వేసి బాగా కలపాలి. ఇందులో పంచదార, యాలకుల పొడి వేసి కలపాలి. ఇప్పుడు మిగిలిన ఫూల్‌మఖానా కూడా వేసి, బాగా కలిపి, స్టవ్‌ని సిమ్‌లో ఉంచి 9 - 10 నిమిషాలు ఉడికించాలి. బాదం పలుకులు కూడా వేసి, స్టవ్‌ని పూర్తిగా సిమ్‌లో ఉంచి రెండు నిమిషాలు ఉడికించి స్టవ్ ఆఫ్ చేయాలి. టేస్టీగా, ఈజీగా తయారయ్యే ఫూల్ మఖానా ఖీర్ రెడీ. దీన్ని వేడిగా కానీ, చల్లగా కానీ తినొచ్చు. చల్ల బడితే కొంచెం చిక్కగా తయారయి బాగుంటుంది.

## పారోళి



**కావలసిన పదార్థాలు:**

శనగలు - 150 గ్రా, పచ్చిమిర్చి - 3, పచ్చిమిర్చి తరుగు - మూడు టీ స్పూన్లు, ఉల్లిపాయ - 1, ఉల్లితరుగు - అరకప్పు, ఉప్పు - తగినంత, జీలకర్ర - టీ స్పూను, నూనె - తగినంత, కరివేపాకు - నాలుగు రెమ్మలు, ఆవాలు - టీ స్పూను, శనగపప్పు - టీ స్పూను, మినప్పప్పు - టీ స్పూను, అల్లంముక్క - చిన్నది, అల్లం తురుము - టీ స్పూను, ఎండుమిర్చి - 6.

**తయారీ:**

శనగలను ఒకరోజు రాత్రంతా నానబెట్టాలి. నానిన శనగలను శుభ్రంగా కడిగి నీరు తీసేసి మిక్సీలో వేసి కచ్చాపచ్చాగా రుబ్బుకో వాలి. రుబ్బుతున్నప్పుడే అందులో జీల కర్ర, ఉప్పు, పచ్చిమిర్చి, అల్లం, ఉల్లిపాయ వేయాలి. తరువాత ఒక బాణలిలో నూనె వేసి కాగాక అందులో శనగ పప్పు, మినప్పప్పు, ఆవాలు, జీలకర్ర, ఎండు మిర్చి, పచ్చిమిర్చి తరుగు, అల్లం తురుము, కరివేపాకు ఒకదాని తరువాత ఒకటి వేస్తూ వేయించాలి. తరు వాత ఉల్లితరుగు వేసి వేయిస్తూ, రుబ్బి ఉంచుకున్న ముద్దను వేసి అన్నీ బాగా కలిపి మూత పెట్టాలి. మంట బాగా తగ్గించాలి. మధ్యమధ్యలో కలుపుతూ కొద్ది కొద్దిగా నూనె వేస్తుండాలి. (దీనికి నూనె ఎక్కువ అవ సరం అవుతుంది). సుమారు అరగంట తరువాత ఈ మిశ్రమం పొడిపొడిలాడినట్లుగా అవుతుంది. అప్పుడు దింపేయాలి. ఇది అన్నంలోకి చాలా రుచిగా ఉంటుంది.

## శ్రావణ కుడుములు

**కావలసిన పదార్థాలు:**

బియ్యప్పిండి - పావు కిలో, శనగపప్పు - 100 గ్రా, కొబ్బరి తురుము - కప్పు, అల్లం తురుము - టీ స్పూన్, జీలకర్ర - 10 గ్రా, ఆవాలు - టీ స్పూను, నూనె - 3 టేబుల్ స్పూన్లు, ఉప్పు - రుచికి సరిపడా

**తయారీ పద్ధతి:**

శనగపప్పు నాన బెట్టాలి. బియ్యప్పిండిలో గోరువెచ్చని నీళ్ళు కలిపి మెత్తగా ముద్దలా చేయాలి. బాణలిలో నూనె వేసి ఆవాలు, జీలకర్ర, కొబ్బరి తురుము, నానబెట్టి నీళ్ళు వంపిన శనగపప్పు, ఉప్పు వేసి వేయించుకోవాలి. బియ్యప్పిండిని చిన్న పూరీలా చేసి అందులో వేయించిన మిశ్రమాన్ని పెట్టి, మోదకంలా అంటే వెల్లుల్లిపాయ మాదిరిగా మడవాలి. ఇలాగే అన్నీ చేసి ఇడ్లీ కుక్కర్ లేదా కుక్కర్‌లో పెట్టి ఆవిరి మీద పది నిమిషాలు ఉడికించాలి. అంతే శ్రావణ వరలక్ష్మికి ఇష్ట నైవేద్యానికి కుడుములు రెడీ అయినట్లే!

# థైరాయిడ్

థైరాయిడ్సమస్య నేడు ప్రపంచంలోని పారిశ్రామిక ప్రదేశాలలో మరియు తక్కువ అభివృద్ధిచెందిన ప్రదేశాలలో ఎక్కువగా విస్తరించింది. సాధారణంగా ఈ సమస్య పురుషులతో పోలిస్తే స్త్రీలలోఎక్కువగా కనిపిస్తుంది. మానవుడి శరీరంలో ముఖ్యమైన గ్రంథులలో థైరాయిడ్ ఒకటి. థైరాయిడ్ గ్రంథి మెడ మధ్యభాగంలో గొంతు ముందు సీతాకోకచిలుక ఆకారంలో శ్వాస నాళానికి ఇరు ప్రక్కలా ఉంటుంది. ఈ గ్రంథి పిట్యూటరి గ్రంథి ఆధీనంలో ఉంటుంది. ఇది థైరాయిడ్ హార్మోన్లను ఉత్పత్తి చేస్తుంది. ఇవి రక్తప్రసరణలోకలిసి శారీరక ఎదుగుదలతో పాటు వివిధ జీవప్రక్రియలను నిర్వహి స్తాయి. శరీరంలో తగిన మోతాదులో థైరాయిడ్ హార్మోన్లు లేనప్పుడు పిట్యూటరీ గ్రంథి అవసరాన్ని గ్రహించి టి.ఎస్.హెచ్, హార్మోన్ని విడుదల చేస్తుంది. ఈ టి.ఎస్.హెచ్. సంకేతాలతోనే థైరాయిడ్ గ్రంథి టీ3 (ట్రై ఐడో థైరోనిన్), టీ4 (థైరాక్సిన్)అనే థైరాయిడ్ హార్మోన్లను ఉత్పత్తిచేసి రక్తప్రవాహంలోకి పంపుతుంది. థైరాయిడ్ గ్రంథిలో ముఖ్యంగా రెండుతేడాలను చూస్తాం. అవి టీ3, టీ4 తగ్గటం వల్ల హైపో థైరాయిడిజమ్, రక్తపరీక్షలో టీ.ఎస్.హెచ్ పెరగటం, టీ3, టీ4 తగ్గటం లేదా నార్మల్గా ఉంటుంది. టీ3, టీ4 పెరగటం వల్ల హైపర్ థైరాయిడి జమ్ చూస్తాం. థైరాయిడ్గ్రంథి జీవక్రియలకు ముఖ్య మైనది. ప్రపంచ జనాభాలో సుమారు 7.5 శాతం థైరాయిడ్ సమస్యలతో బాధ పడుతున్నారు. పురుషులలో కేవలం 1.5 శాతం కలదు. టీ3, టీ4 హార్మోన్లు శరీరంలో 1బి.యం.ఆర్ మెటబాలిక్ రేట్ పెంచుతుంది. కార్బో హైడ్రేట్ కొవ్వు పదార్థాల సంశ్లేషణ వ్యవస్థల మీదప్రభావం చూపుతుంది. థైరాయిడ్ హార్మోన్ ఉత్పత్తిలో అయోడిన్ పాత్ర ముఖ్యమైనది. ఈ అయోడిన్ లోపం వల్ల కూడా థైరాయిడ్ డిజార్డర్స్వస్తాయి. థైరాయిడ్ హార్మోన్ల ఉత్పత్తి ఎక్కువైనా, అలాగే తక్కువైనా కూడా అది సమస్యగా పరిణమిస్తుంది. వీటి అసమతూల్యత వలన హైపో థైరాయిడ్, హైపర్ థైరాయిడ్ మరియు గాయిటర్ అనే దీర్ఘకాలిక సమస్యలు తలెత్తుతాయి. **హైపో థైరాయిడ్:** ఇది సర్వసాధారణంగా కనిపించే థైరాయిడ్ సమస్య. మన శరీరంలో థైరాయిడ్ హార్మోన్లు కావలసిన దాని కంటే తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడం వలన ఇది వస్తుంది. **లక్షణాలు:** దీనివలన అలసట, ఏకాగ్రత లేక పోవటం, జుట్టు రాలడం, స్త్రీలలో ఋతుసమస్యలు, బరువు పెరగడం ఈ హైపోథైరాయిడిజమ్ ఈ దశాబ్దంలో పురుషుల కంటే స్త్రీలలో చాలాఎక్కువ శాతం చూస్తుంటాము. **హైపర్ థైరాయిడి జమ్:** శరీరంలో థైరాయిడ్ హార్మోన్లు అవసరాన్ని మించి ఎక్కువ మొత్తం లో ఉత్పత్తి అవుతుండటాన్ని హైపర్ థైరాయిడిజమ్ అంటారు. ఈ సమస్య ఏ వయసులో వారికైన రావచ్చు, కాకపోతే 20-40సం॥ల మధ్యవయసువారిలోఎక్కువగా కనిపిస్తుంది. మొత్తంబాధితుల లో 80%హైపోథైరాయిడి జమ్ కనిపిస్తే, మిగతా 20% హైపర్ థైరాయిడిజమ్ కనిపిస్తుంది. కానీ దీన్ని త్వరగా గుర్తించ లేకపోయినా, నిర్లక్ష్యం చేసినా దుష్ప్రభావాలు తీవ్రంగా ఉంటాయి. లక్షణాలు:1.ఆకలిబాగా ఉంటుంది. కానీబరువుతగ్గుతారు. 2.అధిక వేడిని తట్టుకోలేక పోవడం.



డా. మురళి అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి

**గాయిటర్:** థైరాయిడ్గ్రంథి వాపు వలన వచ్చే సమస్యలను గాయిటర్అంటారు. ఇది ముఖ్యంగా అయోడిన్ లోపం వలన వస్తుంది. దీనిలో నొప్పి ఏమి ఉండదు. కానీ ఏదైనా థైరాయిడ్ గ్రంథికి ఇన్ఫెక్షన్ వచ్చినపుడే నొప్పి ఉంటుంది. దీనిని థైరాయిడ్ హైటస్ అంటారు. **లక్షణాలు:** గొంతుక్రిందవాపు,స్వరంలో మార్పులు, ఆహారం మింగడానికీకష్టంగాఉండటం,శ్వాస తీసుకోవటంలో ఇబ్బందులు ఏర్పడతాయి. **చికిత్స:** థైరాయిడ్ సమస్యలకు జీవితకాలం మందులు వాడే పని లేకుండా, ఈ సమస్యరావడానికీ గల మూల కారణాన్ని గుర్తించి, వ్యక్తిగతంగా రోగి స్థితిగతులకు అనుగుణమైన హోమియోపతి వైద్యం చేయడం ద్వారా థైరాయిడ్ హార్మోన్ సమస్యలను నయం చేయవచ్చు. హోమియోపతి మందులు హెచ్.ఆర్.టి విధానంతో కాకుండా థైరాయిడ్ గ్రంథి అసమతూల్యతను సరిచేసి టీ3, టీ4 హార్మోన్స్ను సహజపద్ధతిలో విడుదల చేయడా నికీ ఉపయోగ పడతాయి. హోమియోపతి వైద్య విధానంలో థైరాయిడ్ రావటానికీ మూలకారణాలన కనుగొని, శారీరక, మానసిక లక్షణాలు వివారించి సరైన హోమియో మందుల తత్వవిచారణ ద్వారా చికిత్స చేయవచ్చును.



## ఆస్టియో ఆర్థరైటిస్ను తగ్గించవచ్చు

**ఆస్టియోఆర్థరైటిస్...వయసు పైబడిన వారిలో కనిపించే సాధారణ సమస్య. అది గతం. ఇప్పుడు 30 నుంచి 40 ఏళ్ళలోపు వారిలో కూడా ఈ సమస్య కనిపిస్తోంది. ఇందుకు ప్రధాన కారణం జీవన విధానంలో మార్పుల, ఆహార అలవాట్లలో మార్పులు చోటు చేసుకోవడమే. అస్టియో ఆర్థరైటీస్చికిత్స లేదని, చికిత్సతీసుకున్నా పెద్దగా ఫలితం ఉండదని చాలా మంది భావిస్తుంటారు. కానీ ఆయుర్వేద వైద్యంతో ఆ వ్యాధి శాశ్వతంగా తగ్గిపోతుందని అంటున్నారు ఆయుర్వేద వైద్య నిపుణులు డాక్టర్ మనోహర్.**

ఆస్టియోఆర్థరైటిస్ను ఆయుర్వేద శాస్త్రంలో వాత ప్రధాన వ్యాధిగా పరిగణిస్తారు. దీనిని ఆయుర్వేద ఆచార్యులు సంధివాతంగావివరించారు.సామాన్య పరిభాషలో కీళ్ళు అరిగి పోయాయని చెప్పు కుంటారు. ఈ వ్యాధి 40ఏళ్ళు పైబడిన వారిలో కనిపిస్తుంది. ఇందులో ఎముకల మధ్య రాపిడి వల్ల నొప్పి పుడుతుంది. ఆస్టియో ఆర్థరైటీస్ నలభైఎళ్ళు దాటిన మహిళల్లో ఎక్కువగా వచ్చే అవకాశం ఉంటుంది. అయితే ఒకసారి అస్టియో ఆర్థరైటీస్ బారిన పడితే ఇక ఆ వ్యాధి తగ్గదని అనుకుంటారు. కానీ అది నిజం కాదు. శరీరంలో డిఫెన్స్మెకానిజం ఉంటుంది. దీనిని రోగ నిరోధకశక్తిగా పరిగణిస్తాం. సమస్య తీవ్రత తక్కువైతే ఈ మెకానిజం తనకు తాను సర్దుబాటు చేసుకుంటుంది. వ్యాధితీవ్రత ఎక్కువైతే మరమ్మత్తుకు వీలుకాదు. అప్పుడు మోకాలు కీలు, తుంటి కీలు వాస్తాయి. కీలు లోపల ఒక సున్నితమైన పొర ఉంటుంది. దీనిని శ్లేషక కల అంటారు. ఇక్కడ శ్లేషకకఫం ఉత్పత్తి అయి సంధికార్యం చేస్తుంది. వాతప్రకోపంవల్ల, శ్లేషక కఫం తగ్గి,శ్లేషకకల అరిగిపోవడం వల్ల ఈ సంధి వాతం వస్తుంది. దీనినే ఆస్టియో ఆర్థరైటిస్ అంటారు.

**ప్రధాన కారణాలు:** మధుమేహం, స్థూలకాయం ఉన్న వారిలో ఈసమస్యవచ్చే అవకాశంఎక్కువ. ఆహారంలో పోషకవిలువల లోపంవల్ల కూడా ఈ వ్యాధి వస్తుంది. జీవన విధానంలో కొన్ని రకాల మార్పులు అంటే ఎక్కువగా ద్విచక్ర వాహనాలపై ప్రయాణించడం, అధిక బరువులు మోయడం, కంప్యూటర్స్ ముందు గంటల తరబడి కూర్చుని పని చేయడంవంటివి ఈ సమస్యకు కారణ మవుతాయి.

**కొన్ని లక్షణాలు:**ఆస్టియోఆర్థరైటిస్ వచ్చినప్పుడు కీళ్ళు వాచి, జిగుసుకుపోయి బాధిస్తాయి. కీలు భాగాన్ని సులభంగా కదిలించలేరు. కీళ్ళ దగ్గర రాపిడి, శబ్దం వస్తుంది. వ్యాయామం చేసినపుడు ఆ బాధ మరింత పెరుగుతుంది. వ్యాధి తీవ్రత పెరిగిన కొద్దీ కీళ్ళభాగాలు వాచిపోతాయి. వాపు వచ్చి తగ్గిపోతుంటుంది. కొన్నిసార్లు నొప్పి ఎక్కువ అవుతుంది. వాతావరణంలో మార్పులవల్ల (ముఖ్యంగా చల్లగాలికి), అలాగే శారీరక కదలికల వల్ల వేదన పెరుగుతుంది. ప్రారంభ దశలో బాధ, జిగుసుకు పోవడం ఎక్కువగా ఉంటుంది. మెనోపాజ్కి చేరిన దశలో మహిళల్లో ఈ సమస్య ఎక్కువగా ఉండి ఆ తరువాత ఇదే విధంగా మెడ భాగంలో ఉండే వెన్నుపూసలో అరుగుదల వంటి సమస్యల వల్ల గ్రీవగత వాతం (సర్వైకల్ స్పాండి లోసిస్) వస్తుంది. దీనివల్ల చేతుల్లో తిమ్మిర్లు ఏర్పడటం జరుగుతుంది. అలాగే కటిభాగంలో ఉండే వెన్నుపూసలో మార్పులవల్ల వచ్చే కటిశూలనుకూడా సంధివాతం గానే పరిగణించవచ్చు.

**సరైన చికిత్స:** ఆయుర్వేద శాస్త్రంలో ఆస్టియో ఆర్థరైటిస్కు మూడు పద్ధతుల్లో చికిత్స అందించ వచ్చు. నిధానపరివర్జనం. వ్యాధికి కారణమవు తున్న వాటిని పాటించకుండా ఉండాలి.

ఉదా॥పగలు నిద్రపోవడం, రాత్రి మేల్కొని ఉండటం వంటి కారణాలను సమయానికి భోజనం చేయాలి. తగినవ్యాయామం చేయాలి. తగినవిశ్రాంతి తీసుకోవాలి.

**ఔషద సేవనం: శమన:** దోషాలనుబట్టి ఔషధ సేవనం. **శోధన:** పంచకర్మ చికిత్స, స్నేహకర్మ, స్వేదకర్మ, పూర్వకర్మలు. వామన, విరేచన, వస్తి చికిత్సలు వ్యాధినితగ్గించడానికి బాగా ఉపయోగ పడతాయి. అభ్యంగ, శిరోధార, శిరోవస్తి, గ్రీవవస్తి, కటివస్తి, జానువస్తి వంటి చికిత్సలు తీసుకోవడం వల్ల కూడా ఫలితం ఉంటుంది.

డా. మనోహర్. M. D (Ayurveda)
స్టార్ ఆయుర్వేద



# సినీ నారాయణీయం

## (ఎమ్మెస్ నారాయణ జీవితచిత్రం) 31

**పోతే పోయిందిలే అని మా అబ్బాయిని ఫీల్డులోకి దింపాం. మనం సినిమా పని తప్ప ఏం చెయ్యలేం. చేయటానికి వాడికేం సోర్స్ లేదు. డిగ్రీ పాసయ్యాడు. ఇవాళ ఎంబీఏ, బీటెక్ లాంటివి చెయ్యాలి. కానీ అవన్నీ చేయించలేదు. రఫ్ అండ్ టఫ్‌గా బతికాం మనం. ఈ అవకాశాలన్నీ ఆ భగవంతుడు ఇచ్చినవే. డబ్బులు మనవి కావు. సినిమా నచ్చింది ఆయనకి.**

## లక్ష్యంపై ఏకాగ్రత లేనివాడు ఎప్పటికీ పైకి రాలేడు

అంత పెద్దాయన చెప్పినప్పుడు సక్సెస్ కొడతాం అని అనుకుంటే, మధ్యలో భగవంతుడు నీకు బుద్ధి రాలేదు, అప్పుడు అలా పోగొట్టుకున్నావు, ఇప్పుడు మళ్ళీ ఆ వదిలేసిన వేషాలు కూడా పోతాయి కదా, ప్రజలకు దూరమవుతావు కదా అని మళ్ళీ మొట్టికాయ వేశాడు. దాసరి నారాయణ గారు తీయకుండా ప్రొడ్యూసర్ దేవీవరప్రసాద్ గారికి అప్పజెప్పారు. చిరంజీవి గారితో, ఎన్టీఆర్ గారితో సినిమాలు తీసిన వ్యక్తి ఆయన. అప్పటి పంథాలో ఆయన గ్రేట్ ప్రొడ్యూసర్. కానీ దాసరి నారాయణరావు గారంటే ఎప్పుడూ వర్క్‌లో ఉండటం వల్ల షార్ప్‌గా ఉన్నారుగానీ, ఇక్కడకి వచ్చేటప్పటికి దేవీవరప్రసాద్‌గారు అవుట్ డేటెడ్. ఇక్కడ మళ్ళీ నాన్‌సింక్.

### కర్ణుడి చావుకి కారణాలెన్నో

డైరెక్టర్‌కి, ప్రొడ్యూసర్‌కి ఏది మనకి రాకూడదో అది మళ్ళీ మనకు అప్లయ్ అయింది. కాబట్టి ఒకసారి మనసు నాన్‌సింక్‌లోకి వెళ్ళిన తరువాత మనం ఎంత బానిసత్వం చేసినా కుదరదు. అది మళ్ళీ మొట్టికాయన్నమాట. ఇక్కడ జరిగిందేంటంటే చావుతప్పి కన్ను లొట్టబోయింది. మన వేషాలకొచ్చే డబ్బు పోయింది తప్ప, భగవంతుడి దయవల్ల బయటపడ్డాం. ఎప్పుడైతే మన కథలో వేలుపెట్టి అలా కాదు ఇలా తియ్యి అన్నారో అప్పుడే నేను నా డైరెక్టరు పోస్టు కోల్పోయాను. ఒక సామాన్య వ్యక్తిలాగానే ఆ సినిమా తీయాల్సి వచ్చింది. దాని మీద మనసులేదు నాకు. అది నాకు తెలిసిపోయింది. ఎందుకంటే ఇది నాది కాదు. నేను అనుకున్నదీ, దాసరి నారాయణరావుగారికి నేను చెప్పిందీ తీయటంలేదు. మరింక అదెలా సక్సెస్ అవుతుంది? సరే గ్రిప్ పోయింది. నాకు తెలుసది. అవమానపడతాననీ తెలుసు. పడ్డాను. కర్ణుడి చావుకి అనేక కారణాలు అన్నట్టు, ఆ సినిమాకు పక్క మనుషుల నుంచి అలాగా ఇలాగా...అని అనేక అవరోధాలు. అప్పుడనుకున్నా ఇంక సినిమా తీయకూడదని. ఇప్పటికీ నా మనసుకు ఏమనిపిస్తుందంటే, చదువుకున్నాను, డైరెక్షనంటే తెలుసు. ఇన్ని సినిమాలు చేశాను, ఏది బాగుంటుందో, ఏది కరెక్టో తెలియకుండా లేను. కానీ డైరెక్టర్‌గా అంత ఫెయిలైపోయానేంటి? అనిపిస్తుంది. అది కూడా పాసవ్వాలనే కోరిక ఒకటుంది నాకు. కానీ 99 శాతం ఆ కోరికను చంపుకునే బతుకుతానుతప్ప నెరవేర్చుకోను. ఎందుకంటే ఇప్పుడున్న పరిస్థితులకు ఆ టేకింగ్ మనవల్ల కాదు. నేను ఎంతైనా నాలెడ్జ్ కలిగి ఉండొచ్చుగానీ, వయస్సు, ఆలోచనా పరంగా ఫుల్ యూత్‌గా, ఆ ఆలోచనా ధోరణిలోకి రాలేను. కాబట్టే ఆ కోరిక అణిచిపెట్టా. పోన్లే డైరెక్షన్ అంటే చాత కాదు అని అనుకుంటారు, అంతే కదా! అసలు ఆ ట్రాక్‌లో ఆలోచించటం ఎందుకు? అందరూ నన్నొక గొప్ప నటుణ్ణని ఆదరిస్తున్నారు కదా! ఆ టెంపో నిలబెట్టుకుని, ఆ ఆనందం నింపుకుని ముందుకెళ్ళిపోదామని నిర్ణయించుకున్నా.

### కెరీర్ నిర్ణయం వాడికే వదిలేశా

మా అబ్బాయి విషయంలో నాకో ఆలోచన వచ్చింది. అసలు వాణ్ణి తీసుకొచ్చి ఇందులో దింపింది నేనేకదా. లేకపోతే ఇంకేదైనా చదువుకుని ఏదన్నా చేసేవాడేమో, ఏమో, కాబట్టి వాణ్ణి ఏం చెయ్యాలా? అని ఆలోచించాను. మహామహా నటులంతా ఏం చేశారు? వారివారి తండ్రులు నటులు కాకపోయినా, ఎవరితోనూ సంబంధం లేకుండా ఆ మహానటులు ఈ ఫీల్డులోకి వచ్చి ముందు ఎలాంటి వేషాలు వేశారు? ఎలాంటి వేషాలు వేస్తూ తమ ప్రతిభ కనబరచి ఏ స్థాయికి ఎదిగారు? ఎలాగయ్యారు? అనే ఫార్ములాలో ఆలోచించా. ఆ దృష్టితో మా అబ్బాయిని నీ ఇష్టం వచ్చిన వేషం వెయ్యి. కామెడీ వస్తే, కామెడీ చెయ్యి అన్నా. ఇప్పుడు అతను కొన్ని క్యారెక్టర్స్ చేస్తున్నాడు. అది అతని నైపుణ్యం మీద ఆధారపడి ఉంటుంది. కాబట్టి ఆ ప్రాబ్లమ్ అలా సాల్వ్ అయింది. మా అబ్బాయి ఏం చేయాలో అనే ఒక ప్రాబ్లమ్‌ని ఇప్పటికైతే వాడికే వదిలేశా. ఇన్నాళ్ళూ ఆ సమస్యను నా చేతిలో ఉంచుకొని తప్పు చేశాను. వాడి





చేతికి అలాగే వదిలేశాననుకో. నాకు సినీ ఫీల్డ్‌లో ఎవరూ సపోర్టు లేకుండా ఫాదర్స్, మదర్స్ లేకుండా నేను ఎలా వచ్చానో అలాగే వాణ్ణికూడా ఎందుకు ఎదగనివ్వరు? అనే ఆలోచన వచ్చి, దాంట్లో ఇప్పుడు వాణ్ణి ప్రవేశపెట్టాను. అతను ఇప్పుడు క్యారెక్టర్స్ చేస్తున్నాడు. కచ్చితంగా సక్సెస్ అవుతాడని అనుకుంటున్నాను.

### క్రమశిక్షణ

సినిమా పరిశ్రమలో జనరల్‌గా చాలామంది టాలెంట్ ఓరియెంటెడ్ వాళ్ళే రాణిస్తారు. కాని టాలెంట్ ఓరియెంటెడ్ వాళ్ళు కూడా వెనకబడుతుంటారు. ఎందుకంటే టాలెంట్ చచ్చిపోయి కాదు. టాలెంట్ ఆగిపోయి కాదు. క్రమశిక్షణ లేకపోవడంవల్ల. మనం క్రమశిక్షణకు పెద్ద ప్రాధాన్యం ఇవ్వంకాని అవతలివాళ్ళు చాలా ఇస్తారు. చెప్పిన సమయానికి నువ్వు షూటింగ్‌కి వెళ్ళకపోతే, నా ఒక్కడిది ఏముందిలే అనుకోడానికి లేని వ్యవస్థ ఇది. అక్కడ వందమంది నీ కోసం చూస్తుంటారు. వంద మంది ఒక గంట చూడ్డం వల్ల పెద్ద ప్రమాదమేమి లేదు. కానీ అక్కడ వాతావరణంలో ప్రమాదం ఎక్కువగా కనపడుతుంది. ఇంత యూనిట్, ఇంత వర్క్ లేకుండా కూర్చున్నారేంటి? అనేది ఒక పావుగంటకు కూడా ఎక్కువ ప్రాధాన్యం వచ్చేస్తుంది. బ్రెయిన్‌లో. ఆ పావుగంట సాయంత్రం చెయ్యొచ్చు. అంతమంది అలా నిశ్శబ్దంగా కూర్చోవడం చూస్తే మనకు బాధవేస్తుంది. ఈ విషయం మానసికంగా మనం బాగా జీర్ణించుకుని ప్రవర్తించాలన్నమాట. ఒకవేళ నేను రేపు లేటుగా

> **ఎమ్మెస్ తన లక్ష్యాన్ని ఎప్పుడూ విస్మరించలేదు. ఒకసారి నటుడుగా క్లిక్ అయిన తర్వాత ఆయన ఋజు మార్గంలో ప్రయాణించారు. తన లక్ష్య సాధనలో ఏకాగ్రతతో కృషి చేశారు. ఆయనకు విజయాలతోబాటు కొన్ని మొట్టికాయలు కూడా పడ్డాయి. అయినా ఆయన తన సహనం కోల్పోలేదు. ఎమ్మెస్ తనకు ఎదురైన ఆటంకాల్ని ఎలా అధిగమించారు? కొడుకు భవిష్యత్తుపై ఆయన ఎలాంటి నిర్ణయం తీసుకున్నారు?**

వెళ్ళాలనుకుంటే కో-డైరెక్టర్‌గారి దగ్గరికెళ్ళి నాకు ఇలా ఉందండి. ఏదైనా ఒక షాట్ ముందుగా పెట్టుకోండి. డైరెక్టరు గారిని ఇబ్బంది పెట్టొద్దు. లేకపోతే ఇది వీలుకాదు ఎమ్మెస్‌గారు అంటే, రైట్ సార్ అని, నేనే ముందుగా నా పని చేసుకొని ఆ టైమ్‌కి వెళతా. వర్క్‌ను బట్టి నేను ఏ టైమ్ అంటే ఆ టైమ్‌కు లేవగలను. ఏ టైమ్‌కి నేను నిద్రలేవాలో దానికి అనుగుణంగా నేను పడుకునేటప్పుడే నా బాడీని ట్యూన్ చేసుకుంటాను.

### వాళ్ళ ఈర్ష్య వేరు, మన ప్రాక్టికాలిటీ వేరు

విజయవాడలో 'చెన్నకేశవులు' షూటింగ్ చేస్తున్నప్పుడు ఒక అభిమాని నా దగ్గరకు వచ్చాడు. ఎమ్మెస్‌గారు మీరు యాక్ట్ చేసేటప్పుడు తాగుతారు కదా అన్నాడు. సరస్వతి తోడుగా తాగనయ్యా యాక్ట్ చేసేటప్పుడు. ఎందుకంటే వృత్తి అది. అప్పుడు అతను ఏమన్నాడంటే, 'ఏమోనండి' మీరు తాగుతున్నారో ఏమోగాని మీ సీనులు చూసేసి నేను తాగేస్తున్నాను' అన్నాడు.

వీడు తాగుబోతు నాకొడుకంటగదా, వీడేంటి ఇలా పైకి వస్తున్నాడూ. రాకూడదుకదా అనేదే ఎక్కువ మంది మనసులో ఉంటుందితప్ప, వాళ్ళనుకున్నట్టుగా ఏం లేదండి. ఇప్పుడు తాగుడికి అలవాటుపడి చివరికి పోయినోళ్ళని మనం చూశాం. అలా తాగుడికి బానిసగా మారిపోవడం వేరు, జస్ట్ అలవాటు వేరు. హెల్త్‌పరంగా కొంచెం తీసుకుంటే ఎలా ఉంటుంది? ఇలాంటి విషయాలన్నీ తెలియనివాళ్ళం కాదు కదా మనం. ఇప్పుడు ఉదాహరణకి బాగా తెల్లారిపోయిన తర్వాత కూడా షూటింగ్‌కి తాగేసి వచ్చాడనుకోండి. అలాంటివాళ్ళు మెల్లిగా నాశనమైపోతారు. అలాంటి వాళ్ళని మనం లిస్టవుట్ చేసుకోనక్కర్లేదు. గొప్పవాళ్ళ పేర్లే మనం చెప్పుకోవాలి. అలాంటివాళ్ళను మనం చూశాం కదా. మరి ఎమ్మెస్ ఎందుకు అలా అవ్వలేదు. కాబట్టి అవతలి వాళ్ళలో ఉండే ఈర్ష్య వేరు. మన ప్రాక్టికాలిటీ వేరు.

### నాలుగు పేజీల నాన్‌స్టాప్ డైలాగ్

'ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు' సినిమాలో నాలుగు పేజీల డైలాగ్‌ని శంకరమంచి పార్థసారథి గారు రచించారు. ఆ డైలాగ్ నాకిచ్చి, ఇది బైహార్ట్ చెయ్యండి, ఇంకా గంట టైముంది, అన్నారు. వద్దు సార్ అని, చెట్టు చాటుకు వెళ్ళి, మా అమ్మను తలచుకొని, మా అమ్మకు, సరస్వతీదేవికి దండం పెట్టుకొని ఆ నాలుగు పేజీల డైలాగ్ రెండు సార్లు చదువుకున్నా. చదివి టేక్ అన్నా. దాంట్లో పరిగెట్టుకుంటూ టెలిఫోన్ పీకాలి, చెట్టు ఎక్కాలి, ఏదో లాగాలి. ప్రొపెల్లర్ పెట్టారు. ఆకులు, దుమ్ము బాగా పైకి లేస్తుంది. అవన్నీ నోట్లోకి వెళ్తుంటాయి. అయినా ఆ డైలాగ్ నాన్‌స్టాప్‌గా చెప్పాలి. నేను చెప్పాను. ఇప్పుడు కూడా ఆ డైలాగ్ చెప్తాను.

షూటింగ్‌లో ఆ డైలాగ్ చెప్పి ఎనిమిదేళ్ళైపోయింది. ఆ డైలాగ్ ఏంటంటే, 'బందరులో ఉన్న నా బెస్ట్ ఫ్రెండ్ బందా కనకలింగేశ్వరరావు సెకండ్ సెటప్ కోసం గుమ్మడి వడియాలు పోస్టులో పంపిస్తే టేస్టుగా ఉన్నాయికదా అని లాస్ట్‌పేజ్‌గా ఫాస్టుగా లాగించి ఈస్ట్‌మారేడ్‌పల్లిలో ఉన్న నా బెస్ట్ ఫ్రెండ్‌కి బెస్ట్ విషెస్ చెబుదామని ఎండలో రోస్టయి వెళుతుంటే హానెస్ట్‌గా చెబుతున్నానండి, స్టమక్‌లో ఉన్న వడియాలు టెర్రరిస్టులాగా ఎదురు తిరిగితే లెట్రిన్‌కు వెళ్ళటం మస్ట్ అని వెనక్కి తిరిగి వెళుతుంటే మోస్ట్ అన్‌వాంటెడ్ పర్సన్ పొయెట్ పాపారావు ఎదురై ఘోస్ట్‌రైటర్‌గా మోస్ట్ బ్రిలియంట్ స్టోరీని రచించాను, వినమని చెపుతుంటే, లైఫ్‌లో ఇదే లాస్ట్ పాయింటా, నాకు సీనుందా? అని ఆలోచించుకుంటూ తిరుపతి ఘాట్ మీద మిషన్‌లో జాగింగ్ చేస్తుంటే డస్టు ముక్కులో వెళుతున్నప్పుడు రిస్టువాచీ జారిపడిపోతే నా గొంతు ఎండిపోయి నేను చేసిన ఆర్తనాదం ఎలాఉందో తెలవాలంటే ఇక్కడి నుంచే మీరు నన్ను బాగా ఫాలో చెయ్యాలి" అనేది ఒక డైలాగ్.



### ఋజుమార్గంలో వెళ్ళాలి

ప్రాసలు, అనుప్రాసలు, యతులు, కష్టతరమైనటువంటి, నాలుక తిరగనటువంటి డైలాగ్. ఎనిమిదేళ్ళ తర్వాత కూడా నేను మర్చిపోకుండా మీకు చెప్పాను. నటుడికి అదే ఏకాగ్రత ఉండాలి. నటుడవ్వాలని ప్రయత్నం చేసేవాళ్ళకి, అన్నింటికంటే ముందుగా కావాల్సింది ఏకాగ్రత. తను ఏం చేయాలనుకుంటున్నాడో దానిపైన నటుడికి ఏకాగ్రత ఉండాలి. ఆ ఋజుమార్గంలో ప్రయాణించాలి. కళ్ళముందు కనిపించే నీ దారిలోనే వెళ్ళాలి. అడ్డాలు వస్తాయి. వాటిని దాటి వెళ్ళాలి. చెట్లు వస్తాయి. తప్పించుకోవాలి. నదులు వస్తాయి, దాటాలి. ఈ అవరోధాలు అధిగమించలేనివాడు ఎప్పటికీ పైకి రాలేడు.

*(ఇంకావుంది)*

*-కూనపరాజు కుమార్*

*సెల్: 99899 99599*

**కళ్ళద్దాలు తీసి, స్టూలు మీద పెట్టి, నిగమ రెండు అరచేతులతో కళ్ళను రుద్దుకుంది. ఉన్నట్టుండి కణతలు నొప్పెట్టడం ప్రారంభించాయి. రామానుజం చెప్పింది నిజమే. అయితే సంకేత్‌కి గవర్నమెంటు ఉద్యోగం ఋజుమార్గంలో రాలేదు! అందులో రాజ వర్మ హస్తం ఉంది. దానికి ప్రేరేపణగా ఏకాంత్ హస్తం ఉంది. దానికి ప్రేరేపణగా సంకేత్ హస్తం ఉంది. సంకేత్ అప్లై చేశాడు. అన్నకు చెప్పాడు. అన్న తన మామగార్ని హెచ్చరించాడు. అల్లుడికోసం, ఐఏఎస్ అల్లుడికోసం రాజవర్మ స్వయంగా కల్పించు కున్నాడు. ఆర్డర్ కాగితాన్ని స్వయంగా తనచేత్తో పట్టుకొచ్చాడు.**

"ఇంటర్వ్యూ చాలా టఫ్‌గా ఉంది. అయినా కష్టపడి సక్సెస్ సాధించాను" ఫోన్లో సంకేత్ అన్న మాటలు నిగమ చెవుల్లో మారుమోగాయి.

ఎవరికో దక్కాల్సిన ఉద్యోగం తన కొడుక్కి దక్కింది. తన కొడుక్కి 'ఉద్యోగప్రాణం' పోయ డానికి ఎవరో బలహీనుడి 'అవకాశ కంఠం' కోయబడింది. స్వశక్తితో తన చిన్నకొడుకు సంకేత్ ఉద్యోగం సంపాదించుకున్నాడన్న ఆనం దాన్ని, కించిత్తుగర్వంగా - ఒక్కరోజు కూడా అనుభవించే అవకాశం లేకుండాపోయింది తనకు! ఎందుకు? రామానుజం ఇవాళే రావాలా? తన ఆనందకాసారంలో రాళ్ళు విసరాలా? ఆనందం అంది వచ్చిన మరుక్షణమే ఆవేదన తన మీద ఎందుకు దాడి చేస్తోంది. నవ్విన నోటితో వెంటనే ఎందుకు ఏడవాల్సి వస్తోంది?

మొదట ఏకాంత్. తరువాత సాకేత్. ఇప్పుడు సంకేత్. రాజవర్మ చేసిన పైరవీ తనకు ఆగ్రహం తెప్పిస్తోంది. ఏకాంత్ చేసిన



# మదరిండియా

10

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287



పైరవీ అసహ్యం కలిగిస్తోంది. సంకేత్ చేసిన పని, ఆడిన అబద్ధం తనకు ఆగ్రహాన్నీ, అసహ్యాన్నీ, ఆవేదననూ కలిగిస్తోంది.

'అమ్మా ఉద్యోగానికి అప్లై చేశాను. అన్నయ్య సహాయం అడిగాను. తన మామయ్య ద్వారా అన్నయ్య సహాయం చేశాడు!' అని సంకేత్ తనతో నిజం చెప్పివుంటే తన మనసు ఇంత గాయపడేది కాదు! ఏ చెట్టుకి ఆ కాయలే కాస్తాయి. అది సహజం. ఎలాంటి తండ్రికి అలాంటి బిడ్డలే జన్మించరా?

నిగమ బరువుగా నిట్టూర్చింది. తను తన సంతానం నుండీ చాలా ఎక్కువ ఆశించింది. నిజానికి అవి రెండే రెండు సూచనలు: రెండే రెండు ప్రబోధాలు. అవి అసాధ్యాలు కావు. ఈ రోజుల్లో సుసాధ్యాలూ కావు. కానీ కష్టసాధ్యాలు! అంతే. 'సత్యం వద',- 'సత్యం వచించు', 'ధర్మంచర' - 'ధర్మంగా చరించు'- అనే రెండు మంచి మాటలే తన బోధనలోని సారాంశం అంతా!

కొడుకులు ప్రయోజకులై పదిమంది మెప్పు పొందితే మనిషి 'తన రక్తం' అనుకుంటూ గర్విస్తాడు. అప్రయోజకులైతే, ఆ కొడుకుల్ని 'తన రక్తం' అంటూ చెప్పుకోడు. మౌనంగా ఉండిపోతాడు.

కానీ తను అట్లా ఉండదు. ఉండకూడదు. ఉండలేదు. కొడుకులు ఉన్నతులయితే 'తన రక్తం' అనుకుని గర్విస్తుంది. కొడుకులు అధములు అయితే తన రక్తమే అనుకుని గర్హించాలి... గర్హించగలదా?

•••

లాయర్ రామానుజం ద్వారా తెలిసిన విషయం నిగమ హృదయాన్ని తొలిచేస్తోంది. కన్నీళ్ళుగా మారని దుఃఖం ఆమెను దహించివేస్తోంది. దుఃఖం ఉపశమించాలన్నా, ఆనందం అధికం కావాలన్నా ఎవరికైనా చెప్పుకోవాలి. ఎవరికి చెప్పుకోవాలి తను? ఎవరున్నారు తనకు అందుబాటులో!

తను చెప్పుకోదగ్గ వ్యక్తి ఒక్కరే. తనను నిజాయితీగా, చిత్తశుద్ధితో అర్థం చేసుకున్న తన కూతురు! నిశిత భర్తతో కొత్త కాపురంలో ఆనందంగా ఉంది. తన విచారాన్ని పంచుకొమ్మని నిశితను అడగలేదు తను. దాని సంతోషానికి విఘాతం కలిగించే సమయం కాదిది...

కేవలం లాయరు ద్వారా తెలిసిన విషయాలను తను చాలా తేలికగా నమ్మేసిందా? రాజవర్మ రామానుజం గారికి నిజమే చెప్పాడా? మూడో వ్యక్తి ద్వారా తెలిసిన విషయాన్ని తాను రుజువు చేసుకోవద్దా? వినదగునెవ్వరు చెప్పిన-వినినంతనె వేగపడక వివరింపదగున్ అన్నారు విజ్ఞులు. అది నిజమే కావచ్చు. కానీ తను సంతృప్తికరంగా రుజువు చేసుకోవాలి.

కొత్త ఆలోచన నిగమకు కొంత మనశ్శాంతిని అందించింది. కొన్నాళ్ళు ఓపిక పడుతుంది తను. అవసరమైతే, నిజానిజాలు తెలుసుకోడానికి ప్రయత్నిస్తుంది. నిజం కోసం కొన్నాళ్ళపాటు వేచి చూస్తుంది.

అయితే అట్టే రోజులు వేచి చూడాల్సిన అవసరం కలగలేదు నిగమకు. ఉన్నట్టుండి సంకేత్ భార్యతో కలిసి ఊడిపడ్డాడు. గవర్నమెంటు ఉద్యోగంలో జాయినయ్యాక పెద్దల ఆశీస్సులు తీసుకోవాలందిట కవిత! అందుకే 'సర్‌ప్రైజ్ విజిట్' అన్నాడు సంకేత్. కవిత ఇంట్లో ఒకరోజు గడిపి వస్తామని అమ్మకు చెప్పి, కవితను తీసుకొని వెళ్ళాడు. రెండు రోజుల తర్వాత వచ్చాడు.

సంకేత్ పెళ్ళికి పూర్వం ఎలా ఉన్నాడో ఇప్పుడూ అలాగే ఉన్నాడు తనతో. రామానుజం చెప్పిన విషయాలు మనసులో దాచుకుని, సంకేత్ వ్యక్తిత్వాన్ని సందేహిస్తూ తనను తాను మానసికంగా హింసించుకుంటూ ఉండడం నిగమకు నచ్చలేదు.

రాత్రి భోజనాలయ్యాక సంకేత్‌ని పిలిచింది నిగమ. కవిత ఎవరితోనో ఫోన్లో మాట్లాడుతూ గదిలో ఉంది. సంకేత్ అమ్మ ముందుకు వచ్చి నిలుచున్నాడు.

"ఏమిటమ్మా?"

"సంకేత్, ఒక విషయంలో నీ వివరణ కావాలి..."

"ఏ విషయం?"

"గవర్నమెంటు పోస్టుకి నువ్వు అప్లై చేశావు. ఆ విషయం ఏకాంత్‌కి చెప్పావా?"

సంకేత్ క్షణం సేపు తటపటాయించాడు. "చెప్పాననుకుంటాను.. ఏం?"

"ఆ ఉద్యోగం నీకు వచ్చేలా చూడమన్నావా?" నిగమ సంకేత్ ముఖంలోకి చూస్తూ అడిగింది.

"అలా అని అన్నయ్య చెప్పాడా?" సంకేత్ ఎదురు ప్రశ్నించాడు.

"నా ప్రశ్నకు సమాధానం చెప్పు, సంకేత్"

సంకేత్ చిన్నగా నిట్టూర్చాడు. "ఇది లాబీయింగ్ యుగం అమ్మా... కేవలం ఒక్క మెరిట్ మీదే ఉద్యోగాలూ..."

"ఉద్యోగం నీకు వచ్చేలా లాబీయింగ్ చేయమని ఏకాంత్‌ని అడిగావా?" నిగమ తీక్షణంగా చూస్తూ అడిగింది. "నాకు నిజం కావాలి. నిన్ను తిట్టను. కొట్టను!"

"ఎవరయినా సహాయం చేయగలిగితే బాగుంటుంది అన్నాను."

### జరిగిన కథ

తన బిడ్డలు నీతినిజాయితీగా బతకాలని ఆశించి వారిని కష్టపడి పెంచి పెద్ద చేస్తుంది నిగమ. కానీ ఆ కొడుకులు అందుకు భిన్నంగా తయారవుతారు. కన్న కొడుకుల దుర్మార్గాలకు వ్యతిరేకంగా న్యాయస్థానాన్ని ఆశ్రయిస్తుందా కన్నతల్లి. ఫ్లాష్‌బ్యాక్‌లోకెళితే, తన తండ్రిని చంపిన వ్యక్తి కూతుర్ని ప్రేమించి పెళ్ళాడి ఇల్లరికం వెళ్ళడంతోపాటు, ఓ డబ్బున్న మారాజుకు దత్తపుత్రుడైపోతాడు నిగమ పెద్దకొడుకు. అతని తమ్ముడు కూడా తల్లిని మభ్యపెట్టి ఒక బహుళజాతి కంపెనీ యజమాని కూతుర్ని పెళ్ళి చేసుకుంటాడు. కన్నకొడుకు మోసం తెలిసి దిగ్భ్రాంతికి గురవుతుందా తల్లి. మూడో కొడుకు కూడా అడ్డదారిలో ప్రభుత్వ డాక్టరు ఉద్యోగం సంపాదించాడని తెలుసుకుని డీలాపడుతుంది.

ఆ తర్వాత......



"నీకు ఉద్యోగం ఎవరి వల్ల వచ్చిందో తెలుసా?"

సంకేత్ గుటకలు మింగుతూ చూశాడు. "అమ్మా... ఇప్పుడవన్నీ ఎందుకు? నన్ను కష్టపడి చదివించావు. నాకు గవర్నమెంటు డాక్టరుగా ఉద్యోగం వచ్చింది. అది చాలుగా అమ్మా!"

"ఎవ్వరూ కల్పించుకోకుండా ఉంటే నీకు ఆ ఉద్యోగం వచ్చేదా?" నిగమ సంకేత్ కళ్ళల్లోకి తీక్ష ణంగా చూసింది.

సంకేత్ మళ్ళీ గుటకలు మింగాడు.



**సగటు అమెరికన్ సంవత్సరానికి 600 సోడాలు తాగుతాడు.**

"చెప్పు, సంకేత్! వచ్చేదా?"

"ఎందుకు రాదూ?" సంకేత్ చూపులు తప్పించు కుంటూ మొండిగా అన్నాడు.

"అంత నమ్మకం ఉంటే ఏకాంత్ సహాయం ఎందుకు అడిగావ్?"

సంకేత్ మౌనంగా ఉండిపోయాడు.

"రాజవర్మ పలుకుబడి అనే లంచం నీకు ఉద్యోగం ఇప్పించింది. అవునా?"

"రాజవర్మగారు హెల్ప్ చేశారనుకుంటాను.."

"ఆయన నీకు సహాయం - అదే నీ కోసం లాబీ యింగ్ చేయడం వల్ల మరొక అభ్యర్థికి నష్టం కలిగి ఉంటుంది. ఎవరో తెలీని, లాబీయింగ్ శక్తి లేని, అర్హుడైన అభ్యర్థి నష్టం నీకు లాభంగా మారింది! ఒప్పుకుంటావా?"

"అమ్మా... అది... అది... నీకు ఎలా చెప్పాలో..."

"ఆ అభ్యర్థి స్థానంలో నిన్ను ఊహించుకో. బాధ కలుగుతుందా లేదా?" నిగమ కంఠం ఖంగుమంది.

సంకేత్ ఇబ్బందిగా, విసుగ్గా చూస్తూ పెదవి కదపకుండా ఉండిపోయాడు.

"ఇంటర్వ్యూ టఫ్‌గా ఉందనీ, కష్టపడి సక్సెస్ సాధించాననీ నాతో ఎందుకు అబద్ధమాడావ్?" నిగమ ప్రశ్న చెంపపెట్టులా తాకింది సంకేత్‌ను.

"ఏకాంత్ సహాయంతో లాబీయింగ్ చేయిం చింది అన్యాయం అనే అనుమానం, అపరాధ భావం నీలో లేకపోతే అలా అబద్ధం ఆడేవాడివి కావు!! అవునా?"

సంకేత్ మౌనంగా ఉండిపోయాడు; తల వాల్చుకుని.

"ఓకే సంకేత్! నీ మౌనాన్ని నీ అపరాధానికి అర్థాంగీకారంగా కాకుండా పూర్తి అంగీకారంగా భావిస్తున్నాను."

సంకేత్ తల కొద్దిగా పైకెత్తి చూశాడు.

"ఏమిటి, ఆయన్ని కోర్ట్‌మార్షల్ చేసేస్తున్నారు?" గదిలోంచీ విసురుగా వస్తూ నిగమను గద్దిం చింది కవిత.

"కవితా..."

"సహాయం చేయమని తన అన్నయ్యను అడిగాడు... తప్పా? ఆయన తన మామగారిని అడిగాడు.. తప్పా? మీ వియ్యంకుడు మీ కొడుక్కి సహాయం చేశాడు... అది తప్పా?"

"తప్పా అని నన్ను అడగొద్దు కవితా? నీ అంతరాత్మను అడుగు"

"అడగాల్సిన అవసరం లేదు. ఉద్యోగాలన్నీ, అన్ని శాఖల్లోనూ, పలుకుబడి ఉన్న కొన్ని సామాజిక వర్గాలే ఎగరేసుకుపోతున్నాయి. అంతరాత్మను నమ్ముకుంటే ఉద్యోగం రాదు; నేనే మీ అబ్బాయికి సలహా ఇచ్చాను. బావగారు ఐఏఎస్ ఆఫీసరు. ఆయన సహాయం అడగమన్నాను. మీరు తిట్ట దలచుకుంటే ఆయన్ని కాదు; నన్ను తిట్టండి!" కవిత కంఠం కోపంతో పదునెక్కింది.

"కవితా!" సంకేత్ మందలింపుగా అరిచాడు.

"కవిత మనసులో మాట చెప్పింది. నీలాగా దాచుకోలేదు..." అంటూ నిగమ కవితవైపు చూసింది. "కవితా అవినీతి, ఆశ్రితపక్షపాతం, లంచగొండితనం-ఈ రుగ్మతలు పోవాలంటే, అందుకు అవసరమైన ప్రయత్నం ఇంటిలో ప్రారంభం కావాలి. సంతా నానికి తల్లి ఉద్బోధించాలి. భర్తకి భార్య ప్రబోధిం చాలి. నువ్వు ధర్మపత్నిగా నీ ధర్మాన్ని విస్మరించావు."

కవిత చిన్నగా నవ్వింది. ఆమె నవ్వులో ఎగ తాళి ధ్వనించింది. "మీ సంతానానికి మీరు బోధిం చారు కదా అత్తయ్యా? అవి నిజంగా ఒంటబట్టి ఉంటే, నేను ఒక్కసారి చెప్పగానే సంకేత్ మీరం టున్న అక్రమమార్గంలోకి ఎందుకు వెళ్ళాడు? ఏకాంత్ బావగారు ఎందుకు అధర్మంగా ప్రవర్తించారు?"

నిగమ నిదానించి కవిత ముఖంలోకి చూసింది. నిజమే! తన ప్రబోధం తన కొడుకుల మీద పని చేయలేదు!

**అడ్డదారిలో ఉద్యోగం సంపాదించిన కొడుకుని నిలదీసిన ఆ తల్లి, కోడలు చేతిలో అవమానం పాలైంది. తప్పు తన పెంపకంలోనే ఉందని రాజీపడి మిన్నకుండి పోయిందా తల్లి. ఆదర్శంగా బతుకుతా రనుకున్న కొడుకులు దారితప్పడంతో ఆమె ఆశలు అడియాసలయ్యాయి. ఇక మిగిలింది కన్నకూతురు, అల్లుడు. కనీసం కన్నకూతురైనా ఆ తల్లి ఆశయాలను కాపాడగలదా? అసలు ఆమె అల్లుడు ఏ మార్గంలో ప్రయాణిస్తున్నాడు?**

"కవితా! అమ్మతో మాట్లాడే పద్ధతి అది కాదు! నన్ను అనే హక్కూ, దండించే అధికారం అమ్మకు ఉన్నాయి!" సంకేత్ భార్య వైపు తిరిగి అన్నాడు.

"మీ అమ్మగారికి నీ మీదున్న అధికారాలను నేను కాదనను సంకేత్! అలాగే, అదే సమయంలో భార్యగా, అర్థాంగిగా, ధర్మపత్నిగా నీ మీద నాకున్న అధికారాన్ని కాదనుకోను!" కవిత మొండిగా అంది.

నిగమ తదేకంగా కవిత వైపు చూసింది. "మంచిమాట అన్నావ్ కవితా! నీ భర్త మీద నీకు తప్పకుండా అధికారం ఉంది. దాంతోబాటు భర్తను ధర్మ మార్గంలో నడిపించే బాధ్యత కూడా ఉంది."

"అత్తయ్యగారూ, భర్తను ఎలా నడిపించు కోవాలో, భర్తతో ఎలా నడుచుకోవాలో ఆడపిల్లకు నేర్పించాల్సింది అత్తగారు కాదు, అమ్మ. నాకు మా అమ్మ నేర్పింది. అవసరమైన పాఠాలను మీరు మీ అమ్మాయికి నేర్పడం మంచిది!"

"కవితా!" సంకేత్ బిగ్గరగా అరిచాడు.

"సారీ.. సంకేత్... మీ అమ్మగారు నీకెంత తెలుసో, మీ కుటుంబంతో చిన్నప్పటి నుండీ ఉన్న స్నేహం కారణంగా, అత్తయ్యగారు నాకూ అంతే బాగా తెలుసు. మిమ్మల్ని అత్తగారు పెంచిన పద్ధతి, ఆమె తత్వాన్ని నాకు చెప్పకనే చెప్పింది. అత్తగారు కలలు కనేది ఆదర్శరాజ్యం! భార్యగా, అర్థాంగిగా, ధర్మపత్నిగా మీ అమ్మగారు మీ నాన్నగారికి ప్రబోధం చేసి ఉంటారు. దాని ఫలితం ఏమిటో అందరికీ తెలుసు.."

"కవితా! దిస్ ఈజ్ టూమచ్!" సంకేత్ అరిచాడు.

"సంకేత్... నేను మా ఇంటికి వెళ్తున్నాను. అత్తగారి మనసు నొప్పిస్తూ ఇక్కడ ఉండలేను. నువ్వు రావాలనుకుంటే రా! లేదంటే ఇక్కడే పడుకో!" కవిత గిరుక్కున తిరిగి, గుమ్మం వైపు చరచరా నడిచి పోసాగింది.

సంకేత్ దిక్కుతోచని వాడిలా చూశాడు. కవిత గుమ్మం దాటింది. తలుపు మూసుకున్న చప్పుడు ఆమె ఆగ్రహాన్ని చాటింపు వేసింది.

"అమ్మా... అయాం సారీ... అమ్మా... కవిత తొందరపడింది..."

నిగమ చిన్నగా నవ్వింది. "తొందరపడింది, కవిత కాదు; సంకేత్. నిగమ!"

●●●

నిశిత, రాజాల కొత్త దాంపత్యం సరదాగా సాగుతోంది. జాయినైన వెంటనే డిపార్ట్‌మెంటు క్వార్టర్సులో సంసారం ప్రారంభించారు. రెండు నెలలు తిరిగేసరికి క్వార్టర్స్ బాగా లేవంటూ చిన్న ఇండిపెండెంట్ ఇల్లు అద్దెకు తీసుకున్నాడు రాజా. ఇల్లు నిశితకు బాగా నచ్చింది. ఇంటి చుట్టూ కాంపౌండు, ప్రహరీకీ, ఇంటికీ మధ్య పూల మొక్కలు.

వారంలో ఒకరోజు ఏదో ఒక సమయంలో బైక్ మీద నిశితను తిరుమలకు తీసుకెళ్తున్నాడు రాజా. వృత్తిరీత్యా తిరుమల పోలీసులు బాగా పరిచయమయ్యారు. దాంతో దర్శనం సులభంగా జరిగిపోతోంది. రాజా అమ్మగారు వేంకటేశ్వరస్వామి భక్తురాలు. కొడుక్కి తన ఆరాధ్య దైవం సన్ని ధిలో ఉద్యోగం రావడానికి కారణం తన భక్తీ, ఆ ఏడుకొండల వాడి దయా! అంటుందామె.

నిశితకు ఆనందం కలిగించే విషయం ఏమి టంటే, ప్రతీ నెలా రెండో శనివారం అత్తగారు తిరుపతి వచ్చేస్తుంది. శనివారం తిరుమలేశుని దర్శనం చేసుకుని, ఆదివారం కొడుకూ కోడలితో గడిపి, సోమవారం సాయంత్రం ట్రైనుకు హైదరా బాదు వెళ్ళిపోతుంది. అత్తయ్యలాగా అమ్మ కూడా వస్తే బాగుణ్ణనిపిస్తుంది నిశితకు. రమ్మంటే అమ్మ వస్తుంది కానీ, పలుకుబడి దర్శనం మాత్రం చేసు కోదు! ఒకటి రెండు సార్లు రమ్మని పిలిచింది తను.

"మీరు కొత్తదంపతులు. సరదాగా గడపాలి. పెద్దల నస ఉండకూడదు!" అంది అమ్మ. అమ్మ చెప్పేది నిజమే! అత్తయ్య విడిది చేసే రెండు రోజులూ తనకు ఎందుకో కాళ్ళూ చేతులూ కట్టి పడేసినట్టుంటుంది!

అమ్మ వద్ద తను వంట నేర్చుకుంది. ఇల్లు సర్దడం నేర్చుకుంది. ఉన్న రెండు రోజులూ 'ఇది ఇలా కాదు; అది అలా కాదు!" అంటూ అత్తయ్య తన వంట పనిలో కల్పించుకుంటుంది. ప్రతీ నెలా రెండో శనివారం, రెండో ఆదివారం వంట నాసి రకం! "నిశితా! ఏమనుకోనంటే ఒక సంగతి అడుగుతా.. ప్రతి నెలా అమ్మ ఉన్న రెండు రోజులూ వంట సరిగ్గా చేయడం లేదు నువ్వు! ఆమె లేనప్పుడు వండినట్టు చక్కగా వండొచ్చుగా!" అని రాజా అడిగేశాడు కూడా!

ఇంటికి తిరుమల ఇన్‌స్పెక్టర్ కృపానందం తరచుగా వస్తుంటాడు. వచ్చినప్పుడు భోజనం ఇక్కడే. సిస్టర్ వంట అమృతం అంటూ లొట్టలు వేసుకుంటూ తింటాడు! అప్పుడప్పుడూ తిరుపతి లడ్డూలూ, వడా పట్టుకొస్తూ ఉంటాడు కూడా! కృపానందంతో బాటు అప్పుడప్పుడూ, నెలకు ఒక సారైనా ఒక వ్యక్తి వస్తూంటాడు. ముగ్గురూ గదిలో కూచుని చాలాసేపు మాట్లాడుకుంటూ ఉంటారు. ఆ వ్యక్తి బొగ్గులాగా నల్లగా ఉంటాడు. బస్తాలాగా లావుగా ఉంటాడు. భర్త ముందు 'బొగ్గుల బస్తా' అంటూ నవ్వుతూ ఉంటుంది నిశిత. అతని పేరు వడివేలు. అరవతనట. అతను మాట్లాడే తెలుగు తమిళయాసలో కఠోరంగా, నవ్వు తెప్పించేలా ఉంటుంది. 'నేను ఇవాళ చెన్నై వెళ్తాను' అని చెప్పాల్సి వస్తే, 'నేను నేడు చెన్నై పూడుస్తును' అంటాడు! వడివేలు కృపానందం స్నేహితుడే కాదు, దూరపు బంధువట!

ఇన్‌స్పెక్టర్ కృపానందం తరచూ తమ ఇంటికి ఎందుకొస్తాడో తనకి తెలుసు. భోజనానికి అతని కుటుంబం ఇక్కడ లేదు. తమిళనాడు బోర్డరులో ఎక్కడో ఉంది. భార్య అక్కడ గవర్నమెంటు టీచరు!

తన భర్త కొద్దిరోజుల్లోనే టౌన్‌లో బాగా పాపులరయ్యాడు. ఊళ్ళో జరిగే కార్యక్రమాలకి ప్రత్యేక అతిథిగా కూడా వెళ్తుంటాడు. క్రమంగా తమ ఇంటికి వివిధ వ్యక్తుల రాకపోకలూ ఎక్కువయ్యాయి. రాజాకు స్నేహితులు బాగా పెరిగారు. తనకు కాలేజీ రోజుల్నించీ తెలుసు. స్నేహితుల్ని చుట్టూ తిప్పుకోవడంలో రాజా ఎక్స్‌పర్ట్!

తిరుపతి వాతావరణంలో రాజా వేషభాషల్లో కూడా కొద్దిగా మార్పు వచ్చింది. వేషంలో మార్పుని తాను గమనించిన రోజు బాగా గుర్తు. తను అద్దం ముందు కూచుని తల దువ్వుకుంటోంది. ఉన్నట్టుండి తన ప్రతిబింబం వెనక ఒక వ్యక్తి ప్రతిబింబం ప్రత్యక్షమైంది. గుర్తుపట్టడానికి తనకు కాస్త టైమ్ పట్టింది. ప్రతిబింబం రాజాది. రాజాకు కొత్తగా మీసాలున్నాయి. హెయిర్‌కటింగ్ చేసుకొస్తానని వెళ్ళిన రాజా మీసాలు ఉంచుకుని వచ్చాడు.

అద్దం ముందు నుంచీ వెనక్కి తిరిగి చూసింది నిశిత. రాజా చిరునవ్వుతో చూస్తున్నాడు.

"ఎలా ఉంది మీసం?" నవ్వుతూ అడిగాడు.

నిశిత నిదానించి చూసింది. రాజా ముఖం కొత్తగా ఉంది. మీసాలు లేనప్పటి సౌమ్యత లోపించింది. ముఖంలో కరకుతనం ప్రత్యక్షమవుతోంది.

"రఫ్‌గా ఉన్నావు. మునుపటి సాఫ్ట్‌నెస్ లేదు.. రిజల్ట్...బాగా లేదు?" నిశిత నవ్వుతూ అంది.

"థాంక్స్!" రాజా చిరునవ్వుతో అన్నాడు. "పర్పస్ నెరవేరింది. పై ఆఫీసర్లందరిదీ ఒకటేమాట... మీసాల్లేకుండా సాఫ్ట్‌గా ఉన్నావ్! ఈ ప్రొఫెషన్‌కి లాఠీ ఎంత అవసరమో మీసమూ అంతే!" అన్నారు. చివరకి పిక్‌పాకెట్ కుర్రాళ్ళు కూడా భయపడడం లేదు!"

"ఏమో... నాకు నచ్చలేదు. మీసాలు నిన్ను నా దృష్టిలో విలన్‌గా మార్చేశాయి!" నిశిత నవ్వింది.

"అది ఈ మీసాల సృష్టి దోషం కాదు, డియర్; నీ దృష్టి దోషం! మార్చుకో! ఎందుకంటే, ఈ మీసాలు పెరిగి, మెలితిరుగుతాయి నీ మొగుడి షేపుల్ని మార్చేస్తూ!" రాజా నవ్వుతూ అన్నాడు.

"నాకో డౌటుంది. క్లియర్ చేస్తావా?" నిశిత అడిగింది.

రాజా అడగమన్నట్టు చూశాడు.

"అసలు మీ పోలీసుల్ని చూసి జనం ఎందుకు భయపడాలి?"

"జనం అంటే మామూలు జనం కాదు; దొంగలూ, ఖూనీకోర్లూ, వగైరా! వాళ్ళచేత నిజాలు కక్కించాలంటే మాకు మీసాల సాయం అవసరం!"

"ఏమిటో... మీరూ... మీ మీసాలూ, లాఠీలూ, మీ థర్డ్ డిగ్రీలూ!" నిశిత నిట్టూరుస్తూ అంది. "ఆ మధ్య ఎక్కడో చదివాను. పోలీస్‌స్టేషన్లు నాజీ కాన్‌సన్‌ట్రేషన్ క్యాంపుల్లా ఉన్నాయంది హ్యూమన్ రైట్స్ సంస్థ!" నిశిత అంది.

రాజా చిన్నగా నవ్వాడు. నిశితను అద్దం ముందు నుంచీ లేవదీసి, మంచం మీద కూర్చోబెట్టి, ఆమె దగ్గరగా కూచున్నాడు. "చదువుకునే రోజుల్లో ఐపీయస్ పాసైన కొత్తల్లో నేనూ నీలాగే అనుకునే వాణ్ణి. నేరం చేసిన వ్యక్తిని చిత్రవధ పాలు చేయడం అమానుషమనీ, అలా చేయకూడదనీ! ఆ యూనిఫామ్ వేసుకుని, రంగప్రవేశం చేశాక అర్థమైంది? నా అభిప్రాయం తప్పు అని. నేను నీతి, నిజాయితీ అంటూ అరగంట లెక్చరిచ్చి ఎంతో బుజ్జగించాను. కేడీగాడు నోరు మెదపలేదు. కాని స్టేబుల్ లాఠీ తిరగేసేసరికి చేసిన నేరం ఒప్పేసుకున్నాడు!"

## నవ్యవీక్లి-నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కవిత

కవిత

### ప్రకృతి ప్రసాదించిన వరాలు

ఆ ఇంటి వాకిలి హరితపత్రాలపై
జీర్ణ యజ్ఞోపవీతాలు మడికడతాయి
ఆ ఇంటాయన సనాతన బ్రహ్మ కాబోలు

ఆ ఇంటి వాకిట గుమ్మటంలా ఎదిగిన మొక్కల భుజాలని
వాడిన పూలదండలు సత్కరిస్తుంటాయి
అవి ఏభక్తి ప్రసాదాలో మరి

ఆ ముంగిట్లోనే మొక్కల మొదళ్ళలో మసిబారిన
సిగరెట్ పీకలు దర్శనమిస్తూ
ఆ ఇంటాయన అలవాట్లను చెప్పకనే చెబుతాయి

ఆ ఇంటి వాకిలి మొక్కల పలవలలో
కసవుతో కలిసిన మందు బిళ్ళల స్ట్రిప్‌లు తళతళలాడతాయి
ఏ భవరోగి బహుకరించిన ఆనవాళ్లో అవి

ఋతువు మారగానే కొత్త వలువల అందాలతో
కళకళలాడే ఆ ఆకుపచ్చని పచ్చికపై
మూర్ఛ రోగుల్లా పడి దొర్లే క్వార్టరు బాటిల్సు
వారి నిర్లజ్జను చాటుతుంటాయి

ఏపుగా ఎదిగిన కొమ్మల గుబుర్లు
పై అంతస్తు మీంచి విసిరిన కాగితపు పుటల్ని భరిస్తూ
యింకా తయారవని రచయితని చూస్తుంటాయి
గాలి ఆడక ఉక్కపోతగా కాలం పెళపెళలాడుతుండే వేళలో
ఆ మొక్కలు మాత్రం లయాత్మకంగా తలలూపుతుంటాయి
ఆ ఇంటిలోంచి ప్రసరిస్తున్న రాగసారానికి
ప్రాణం లేచొచ్చినట్టు ఆనందిస్తుంటాయి
మన నైసర్గికాలను తెలిపే ఆ వాకిట్లోని మొక్కలన్నీ యిన్నీకావు
ఎన్నో ఆనవాళ్ళ అపవాదులు తన ఎదుగుదల ఎదలో చవిచూసినా
ఇన్ని అపచారాలు తమ ఒళ్ళంతా పులుముకున్నా
అన్నీ మరచి ఆక్సిజన్ అందించడమే
తమ కర్తవ్యమన్నట్లుంటాయి
ఈ మురిపాల మొక్కలు ప్రకృతి ప్రసాదించిన వరాలు

*-దూసి శ్రీరామమూర్తి, సెల్: 88863 08886*

YAKBAR

"ఊ... తరతరాలుగా మీ పోలీసువాళ్ళ వాద నేగా ఇది!" నిశిత నిట్టూరుస్తూ అంది.

"కేవలం మీసాలు చూసే ఇంతలా రియాక్ట్ అయిపోతున్నావ్! మీ లేడీ పోలీసులు లాఠీలతో చేసే హస్తలాఘవం చూస్తే ఏమంటావో!"

"అమ్మ ఎప్పుడూ ఒక సినిమా పాటలోని రెండు పంక్తుల్ని గుర్తు చేస్తూ ఉండేది. మనసు కవి ఆత్రేయ రాసిన పాట అది. "కాకిని కోకిల చేస్తావో! లోకంలో ఒకడైపోతావో!" పెళ్ళికాక ముందు నీ లెక్చర్లు విని, పోలీసుతత్వాన్నే మార్చేస్తావను కున్నా! కానీ నువ్వూ కలిసిపోయావ్!" నిశిత అంది చిన్నగా నవ్వుతూ.

రాజా ముఖం కొద్దిగా జేవురించింది. ప్రయ త్నించి తనను నియంత్రించుకున్నాడు. "ఓకే...నువ్వు జనంలో మెంబరువి. నీది జనం దృష్టి. నేను పోలీస్ ఫోర్స్‌లో మెంబర్ని. నాది పోలీసు దృష్టి! ఒక్కటి మాత్రం గట్టిగా చెప్పగలను. చేసేపనిని బట్టి మనిషి దృష్టి మారుతుంది. తత్వం మారు తుంది! మారకపోతే ప్రమాదం!"

మంచంమీంచీ లేచి, చెప్పకుండా పోతున్న రాజాను చూస్తూ అలాగే కూచుండి పోయింది నిశిత. 'చేసే పనిని బట్టీ మనిషి దృష్టి మారు తుంది!" రాజా మాట నిశిత చెవుల్లో గింగురు మంది. రాజా పరోక్షంగా తనలో మార్పు వచ్చిందని ఒప్పుకున్నాడా? ఇంటరాగేషన్ కోసం మీసాలలో మార్పయితే ఫరవాలేదు. ఆ మార్పు తన భర్తలో వేళ్ళాని వెర్రితలలు వేయకూడదు!

•••

రాజా మాట తీరూ, మాటల భావాలూ నిశి తకి కొత్తగా అనిపిస్తూ కొన్ని నెలల కిందట జరి గిన సంఘటనల్ని గుర్తుకు తెస్తున్నాయి. అప్పట్లో ఆ సంఘటనలకి తాను అంత ప్రాధాన్యం ఇవ్వ లేదు. అసలు పట్టించుకోలేదు కూడా...

ఒకరోజు రాజా డ్యూటీ నుండీ కొంచెం ఆల స్యంగా వచ్చాడు. జీపు శబ్దం విని తను తలుపు తీసింది. రాజా లోపలికి వచ్చాడు. నవ్వుతూ చూశాడు. అతని చేతిలో ఎర్రటి బాక్సుంది. నిశిత భుజం చుట్టూ చేతినివేసి, ఆమెను బెడ్‌రూంలో అద్దం ముందుకు తీసుకెళ్ళాడు. బాక్సులోంచి తీసిన నెక్లెస్‌ను నిశిత మెడలో వేశాడు. కట్ డైమండ్స్!

నిశిత ఆశ్చర్యంగా అతని వైపు తిరిగింది. "ఎందుక్కొన్నావిప్పుడు?"

"నా పెళ్ళాం వేసుకుంటే చూసి పొంగిపోవ డానికి! నా పెళ్ళాం అందాన్ని పెంచడానికి!"

"ఎంత?"

"ఎంతో కాదులే...లక్ష అరవై వేలు..." రాజా తేలిగ్గా అన్నాడు.

"లక్షా అరవై వేలే! అంత డబ్బెక్కడిది? ఉన్న దంతా పెళ్ళప్పుడే ఖర్చయి పోయిందన్నావే!"

"అంతడబ్బు ఒక్కసారి పెట్టి కొనలేనని నాకు తెలీదూ? హైర్ పర్చేజ్. నెలనెలా కొంత కట్టే పద్ధతి మీద తీసుకున్నా! చూడగానే, నీ మెడలో దీన్ని చూడాలనిపించింది. నిశితా! బాగుందిగా!"

"బాగుంది...ఇబ్బందికాదుగా? నెల నెలా కట్ట గలమా?"

## అనుష్క మౌనం వెనుక..?



*'బాహుబలి 2' గురించి యూనిట్‌లో ఎవరో ఒకరు అప్పుడప్పుడూ మాట్లాడుతూనే ఉన్నా అనుష్క మాత్రం ఈ సినిమా గురించి ఒక్క మాటంటే ఒక్క మాట కూడా ఇప్పటి వరకూ మాట్లాడలేదు. దానికి కారణం ఉందంటున్నారు అనుష్క సన్నిహితులు. ఈ సినిమా షూటింగ్ సమయంలో దర్శకుడు అందరి ముందూ అనుష్క మీద మండిపడడంతో అనుష్క చాలా బాధపడిందట! అప్పటి నుంచి తన పనేదో తను అన్నట్టుగా ఉంటోందట! షూటింగ్ వివరాలు కానీ, అప్‌డేట్స్ కానీ ఎవరితో పంచు కోకపోవడానికి కారణం దర్శకుడి మండిపాటే అంటున్నారు సన్నిహితులు.*

"కట్టి చూపిస్తాను. నాన్నను అడగకుండా నా భార్యకు నేనే నగ కొన్నానన్న తృప్తి కావాలి నాకు!" రాజా గర్వంగా అన్నాడు.

•••

"నిశితా, ఇదిగో... ఈ డబ్బుని జాగ్రత్తగా దాచు!" ఒకనాడు వెయ్యి రూపాయల కట్ట ఇస్తూ అన్నాడు రాజా.

"ఎంత?"

"లక్ష..."

"లక్ష..ఎక్కడిది..?" నిశిత రాజా కళ్ళల్లో చూస్తూ అంది.

రాజా క్షణకాలం ఆమె ముఖంలోకి చూశాడు. "ఇది... మనది కాదులే... ఇన్‌స్పెక్టర్ కృపానందంది. డిపార్టుమెంటు లోన్ తీసుకున్నాళ్ళే. ఊరెళ్ళేటప్పుడు తీసుకుంటానన్నాడు. జాగ్రత్తగా ఉంచు"

•••

ఆరోజు రాత్రి మంచం మీద పడుకుని, తన వైపు తిరిగిన రాజాను తదేకంగా చూసింది నిశిత. అనుమానం తనని పీక్కుతింటోంది. అది తీరే దాకా మానసికంగా నరకయాతనే!

"రాజా..."

"ఊ..."

"ఒకటడుగుతాను. ఏమీ అనుకోవుగా?"

"ఏమిటి?"

"డైమండ్ నెక్లెస్ తెచ్చావు. నెలసరి వాయిదా లన్నావు. నగల దుకాణం వాడిచ్చిన బిల్లు లేదు... ఎప్పుడైనా ఎక్స్‌ఛేంజ్ చేసుకోవాలంటే బిల్లు ఉండాలి. మొన్న లక్ష తెచ్చావు... కృపానందంది అన్నావు.. నెల దాటింది. అతనింకా తీసుకెళ్ళలేదు.."

"సెలవు దొరకలేదు. అతను ఊరెళ్ళలేదు. ఎందుకివన్నీ అడుగుతున్నావ్?"

"ఆ నెక్లెసూ, ఆ లక్షా... నువ్వు... నువ్వు... సంపాదించినవి కావుగా!"

రాజా తటాలున లేచి కూచున్నాడు. "ఏమిటి నీ ఉద్దేశం?"

"ఏం లేదు... అందరిలాగా నువ్వు అక్రమంగా ఆర్జించడం నాకు ఇష్టం లేదు. సందేహాన్ని నివృత్తి చేసుకోవడానికి అడిగాను. నెక్లెస్ నిజంగా కొన్న దేగా? లక్షా మనది కాదుగా!"

రాజా తీక్షణంగా చూశాడు.. "నన్ను నువ్వు నమ్మడం లేదని అర్థమవుతోంది. అయాం సారీ... నిశితా.. నెక్లెస్ నీ కోసం ప్రేమతో, వాయిదాల పద్ధతి మీద కొన్నాను. లక్ష రూపాయలు నేను తీసుకున్న లంచం కాదు అని చెప్తే నమ్ముతావా?"

"నమ్ముతాను"

"నువ్వు నమ్మవు. నాకు తెలుసు! నువ్వు ఆద ర్శాలు వల్లించే కుటుంబంలో పుట్టావు".

భర్త జేబులో రూపాయి ఎక్కువగా ఉందని నీకనిపిస్తే అది అక్రమార్జన అనుకుంటావు. నీ మొగుడు నీకోసం అప్పుచేసి చీరలు కొన్నా, నగలు కొన్నా దానిని నువ్వు అప్పు అనుకోవు. అక్రమార్జన అనుకుంటావు!"

"రాజా..."

"నెక్లెస్ నీ మెడలో వేసిన క్షణంలోనే నీ అను మానాన్ని వ్యక్తం చేసి ఉండాలి! అప్పుడు నమ్మి నట్టు నటించావు..."

"నా అనుమానానికి కారణం ఉంది...."

"ఏమిటో అది! సెలవిస్తారా?" రాజా వెట కారంగా అన్నాడు.

"ఇవాళ కూల్‌హోమ్ షోరూమ్ వాళ్ళు డబుల్ డోర్ ఫ్రిడ్జి డెలివరీ ఇచ్చారు.

"ఇచ్చారు. తెలుసు. ఇంటికిరాగానే చూశాను. నేను సెలెక్ట్ చేసిన మోడలా, కాదా అని చెక్ చేశాను!" రాజా అడ్డొస్తూ అన్నాడు.

"షాపతను డెలివరీ ఇచ్చినప్పుడు మనం ఆర్డర్ ఇవ్వలేదనీ, మనింట్లో ఉందనీ అన్నాను. ప్రొప్ర యిటరు గారు పంపించారన్నాడతను అదోలా చూస్తూ. ధర ఎంత అని అడిగాను. 'దీనికి రేటు లేదు మేడమ్." అంటూ నవ్వుతూ వెళ్ళిపోయాడు.

ప్రొప్రయిటర్‌కి ఫోన్‌చేశాను. రేటు అడిగాను. ఏదో మా సంతోషం అమ్మగారూ. ఇన్‌స్పెక్టర్ గారికి ప్రెజెంటేషన్ కింద ఇచ్చానులెండి" అన్నాడు.

"అయితే ఏంటట?" రాజా ఎగతాళిగా అన్నాడు. "ఎవ్వరూ, ఎవ్వరికీ బహుమతిగా ఏమీ ఇవ్వ కూడదు అనే సిద్ధాంతమా నీది?"

"నాకు ఎవరైనా ఖరీదైన వస్తువులు బహు మతిగా ఇస్తే ఎందుకని ప్రశ్నిస్తాను. నిలదీస్తాను. తీసుకోను!" నిశిత సీరియస్‌గా అంది.

*(ఇంకావుంది)*

# వశీకరణం

## -సోమవర్ఖుల నాగేంద్రప్రసాద్



**'బావా, ఉదయం తొందరగా లేవాలి. గుర్తుందా!' మంచం మీద అతని పక్కనే పడుకుంటూ అంది లావణ్య.**

**'అబ్బా, ఇప్పటికిది పదోసారి చెప్పావు లావణ్యా! నీకు చిన్న వయసులోనే ఇంత చాదస్తం అయితే రేప్పొద్దున అమ్మవి అమ్మమ్మవి అయితే ఇంకెంత చాదస్తం వస్తుందో" భార్యను ఆటపట్టిస్తూ అన్నాడు కారుణ్య.**

'అంటే ఏంటంటావు. ఒకటికి రెండుసార్లు చెబితే అది చాదస్తం అవుతుందా?' తలలోని మల్లె పూలు తీసి పక్కన టేబుల్ మీద పెడుతూ అంది లావణ్య.

'మరి దాన్ని ఇంకేమంటారు? అవునూ! పూలెందుకు తీసేశావు' అడిగాడు కారుణ్య.

'ఎందుకేమిటి, ఇప్పుడు తలలో ఉంటే నలిగిపోతాయి. అందుకే తీసేశాను. మరలా రేపు ఉదయం పెట్టుకుంటాను' చెప్పింది లావణ్య.

'బావుంది లావణ్యా, మనకు కొత్తగా పెళ్ళైంది. తల్లో పూలు ఉంచుకుంటే బాగుంటుంది కదా! కావలిస్తే నేను నీకు ఇంకా తెస్తాను. అప్పుడు రాత్రికి కొన్ని, మర్నాటికి కొన్ని ఉంచుకో!" నవ్వుతూ అన్నాడు కారుణ్య.

'అంటే ఏంటి? జడలో నీకు పూలు ఉంటేనే కాని మూడ్ రాదా?" కొంటెగా అంది లావణ్య.

"అలా అని కాదు. కానీ ఆలుమగల దాంపత్యంలో మల్లెపూలు చాలా ముఖ్యమని నా చిన్నప్పటి నుండి వింటున్నాను" ఆమె ప్రశ్నకు సమాధానం చెబుతూ కారుణ్య ఆమెకు కాస్త దగ్గరగా జరిగాడు.

"ఓహో....! నన్ను, నా అందాన్ని చూస్తే నీకు మూడ్ రాదన్నమాట" బుంగమూతి పెడుతూ అంది లావణ్య.

"అయ్యో! నా ఉద్దేశం అది కాదు. అచ్చు దివి నుండి భువికి దిగిన దేవకన్యలా ఉన్న నువ్వు అందానికి మారుపేరంటే నమ్ము" ఆమెను బుజ్జగిస్తూ అన్నాడు కారుణ్య.

'అదీ అలా రా దారికి. మరి నేను అందగత్తెను అయినప్పుడు, పూలు పెట్టుకుంటే ఏంటి? లేకపోతే ఏంటి? అయినా భార్యాభర్తలు ఒకరినొకరు రెచ్చగొట్టుకున్నప్పుడు ఆటోమేటిక్‌గా అదే వస్తుంది మూ...డ్" నవ్వుతూ అంది లావణ్య.

'రెచ్చగొట్టుకోవడమంటే! మాటలతోనా లేక చేతలతోనా' కొంటెగా ఆమె ఎదకేసి చూస్తూ అన్నాడు కారుణ్య.

'మాటలతో రెచ్చగొడితే నేను ఊరుకుంటానా? మాటకు మాటా సమాధానం చెప్పనూ' ఉడుక్కుంటూ అంది లావణ్య.

'పోనీ చేతలతో రెచ్చగొడితే రెచ్చిపోతావా' ఆశగా అన్నాడు కారుణ్య.

'బాబూ, ఇప్పుడు నన్ను ఏ విధంగానూ రెచ్చగొట్టొద్దు. నువ్వు రెచ్చిపోతే ఇంక నిన్ను ఆపడం ఎవరితరమూ కాదు. అందుచేత బుద్ధిగా పడుకో' మెల్లగా దిండుమీద వాలుతూ అంది లావణ్య.

'ఇది చాలా అన్యాయం లావణ్యా! పక్కన పాలకోవాలాంటి నిన్ను ఉంచుకుని కోరిక తీరని నేను ఎలా పడుకోగలనో నువ్వేచెప్పు? అయినా ఉదయాన్నే లేవాల్సింది నేను కాని నువ్వు కాదు కదా! ఆ సంగతి నేను చూసుకుంటాను. ప్లీజ్... ఒక్కసారి' ఆమె సన్నటి నడుంమీద చేయి వేస్తూ అన్నాడు కారుణ్య.

'అబ్బా బావా..! చెప్పింది విను ప్లీజ్..! కావలిస్తే రేపు రాత్రి నీ ఇష్టం. నువ్వు ఏం చేసినా కాదనను. నేను చాలా అలసి పోయాను. నేను కూడా రేప్పొద్దున నీతోబాటే పెందరాళే లేచి మామ్మా వాళ్ళకు ఇడ్లీపిండి రెడీ చెయ్యాలి. అందుచేత ఈసారికి నా మాట విను. నా బుజ్జివి కదూ, ప్లీజ్...!' మెల్లిగా నడుం మీంచి అతని చేతిని తీస్తూ అంది లావణ్య.

'ఏంటో లావణ్యా! మనకు పెళ్ళై ఇంకా ఏడాది కూడా కాలేదు. నువ్విలా నన్ను మాటి మాటికి ఆపడం ఏం బాగాలేదు. నేను ఉప్పూ కారం తింటున్న మగాణ్ణి. దయచేసి అర్థం చేసుకో" ఆమెను మరోసారి తనవైపు తిప్పుకునే ప్రయత్నం చేస్తూ అన్నాడు కారుణ్య.

'అయితే రేపటినుండి కాస్త ఉప్పు, కారం తగ్గిస్తాను. సరేనా..!' నవ్వుతూ అంది లావణ్య.

నాలో కోరికలు కలగకుండా ఉండడం కోసం ఉప్పూ కారం తగ్గిస్తావే గానీ, కాస్త నా కోరిక తీర్చాలని ఉండదా? బాధగా అన్నాడు కారుణ్య.

'సారీ బావా! ఎందుకో నాకు దానిపట్ల ఆసక్తి ఉండదు' అతని కళ్ళల్లోకి సూటిగా చూడకుండా అంది లావణ్య.

"ప్లీజ్ లావణ్యా! నన్ను ఏ విషయంలోనైనా బాధపెట్టు! ఫర్వాలేదు. దయచేసి ఈ విషయంలో మాత్రం బాధపెట్టకు. తట్టుకోలేను. అలాగే మామ్మా వాళ్ళు ఉన్నంత కాలం కాస్త క్లోజ్‌గా ఉండు. ఆ తరం వాళ్ళు కదా! లేకపోతే మన గురించి ఏదేదో అనుకుంటారు" అంటూ ఆమె నుదుటి మీద ముద్దుపెట్టి పడుకున్న కారుణ్య మనసులో ఒకటే బాధ. అందమైన తన భార్య లావణ్య "ఫ్రిజిడిటి"తో బాధ పడుతోంది. 'ఫ్రిజిడిటి' అన్నది ఓ మానసిక సమస్య. అది ఉన్నవాళ్ళు 'సెక్స్' పట్ల అంత సుముఖత చూపరు. లావణ్య కూడా అంతే! అన్ని విషయాల్లోను చాలా సరదాగా, చలాకీగా ఉంటుంది. తీరా అక్కడికి వచ్చేసరికి అదోలా అయిపోతుంది. మరి ఆమెలోని ఆ 'ఫ్రిజిడిటి' ఎప్పటికి పోతుందో, తన సంసార జీవితం ఎప్పటికి బాగుపడేనో కదా! అక్కడికీ తను సిగ్గువిడిచి పురుషోత్తం తాతయ్యకు చెబితే, నవ్వి ఊరుకున్నాడే కాని, ఏం మాట్లాడలేదు' అని అనుకున్న కారుణ్య కళ్ళు మూసుకుని మెల్లగా నిద్రలోకి జారుకున్నాడు. అయితే పురుషోత్తం తాతయ్యవల్లే తన సంసారంలో 'సరిగమలు' పలుకుతాయని పాపం కారుణ్య దంపతులకు తెలియదు.

●●●

"ఏమే లావణ్యా, నువ్వెందుకు స్టేషనుకు రాలేదు?" ఇంట్లో అడుగుపెట్టిన మామ్మ రాజ్యం నవ్వుతూ మనుమరాలు లావణ్యను అడిగింది.

"ఊరికే మామ్మా, అయినా నువ్వు వచ్చేసరికి అన్నీ సిద్ధం చెయ్యాలి కదా' మామ్మ చేతికి కాఫీ ఇస్తూ అంది లావణ్య.

'ఇప్పుడేమంత టైమైపోయిందని. ఇంతకీ ఏం స్పెషల్స్ చేశావు? వంటింట్లోకి చొరవగా వస్తూ అంది మామ్మ.

'అబ్బే, పెద్దగా ఏం చెయ్యలేదు' నవ్వుతూ చెప్పిన లావణ్య 'బావా, నువ్వు త్వరగా స్నానం చేసిరా. టిఫిన్ రెడీ' అనడంతో కారుణ్య బాత్రూంలో

దూరాడు. వెంటనే కారుణ్య 'లావణ్యా, గీజర్ వేసి ఎంతసేపయింది? నీళ్ళు సలసలా మరిగి పోతున్నాయి' అన్నాడు.

'ఏమో బావా, గుర్తులేదు. పని హడా విడిలో పడి కట్టడం మర్చిపోయాను. అంతగా వేడిగా ఉంటే కాస్త చన్నీళ్ళు కలుపుకో. ఈ మాత్రం దానికి అంతలా అరవాలా?' చిన్నగా కసురు కుంటూ అంది లావణ్య.

'అదేంటే లావణ్యా! నా మనవణ్ణి అంతలా తీసి పారేస్తున్నావు. అయినా అబ్బాయి స్నానా నికి వెళ్ళేముందే కాస్త వాడికి వేన్నీళ్ళు తీసి పెడితే నీ సొమ్మేం పోయింది" అని అంది మామ్మ.

'నువ్వు ఊరుకో మామ్మా. ఇప్పుడు ఇటు వంటివన్నీ అలవాటు చేస్తే రేప్పొద్దున అటు నా పని, ఇటు భర్త పని చెయ్యలేక చాలా ఇబ్బందులు పడాలి' మామ్మకి టిఫిన్ పెడుతూ నవ్వుతూ అంది లావణ్య.

'సరే తల్లీ, నీ గురించి తెలియక ఏదో అన్నాను. చూడు అబ్బాయి స్నానం అయినట్లుంది. వేడి వేడిగా టిఫిన్ ఇవ్వు" అంది మామ్మ.

'అబ్బా మామ్మా, అక్కడ హాట్‌కేస్‌లో పెట్టాను. అలాగే పక్కన చెట్నీ కూడా ఉంది. బావకి అల వాటే! వడ్డించుకుంటాడు' నవ్వుతూ చెప్పింది లావణ్య.

'ఏం, మొగుడికి ఆ మాత్రం టిఫిన్ వడ్డిస్తే అరిగిపోతావా, కరిగిపోతావా' అడిగింది మామ్మ.

'ఏం అరిగిపోను. కరిగిపోను. మొగుడికి ఇటు వంటి కొత్త అలవాట్లు చెయ్యకూడదు మామ్మా! ఒకసారి అలవాటు చేశామా, పీకకి చుట్టు కుంటుంది' మెల్లగా అంది లావణ్య.

'ఇది మరీ బావుందే తల్లీ! ఏదో చాదస్తం కొద్దీ చెప్పాను. ఎంతైనా సత్తెకాలపు దాన్నికదా, నాకిన్ని తెలివితేటలు ఎక్కడివి? అవి ఉండి ఉంటే నేనూ మీ తాతని ఓ ఆట పట్టించే దాన్ని. ఏ మాట కామాటే చెప్పాలి, మీ తాతగారు ఏనాడూ ఆయన చేత్తో వడ్డించు కున్న పాపాన పోలేదు. అన్నీ ఎదురు గుండా ఉన్నా, నేను వడ్డిస్తేనే గాని తినేవారు కాదు' భర్తవంక ముసి ముసిగా చూస్తూ అంది మామ్మ.

'ఇంకా నయం, తాతగారు నిన్ను ముద్దలు కలిపి ఇమ్మన లేదు' అంది లావణ్య.

'ఆ ముచ్చటా అయ్యింది తల్లీ. ఒక్కొక్క సారి గోరుముద్దలు పెట్టమంటే అవి కూడా తినిపించేదాన్ని. అప్పుడు మీ తాతగారు ఏం చేసేవారో తెలుసా... నా వేలుని కొరికే వారు' సిగ్గుగా అంది మామ్మ.

'అమ్మో! తాతయ్యేం తక్కువవారు కాదన్న మాట' అంటూ లావణ్య అక్కడే ఉన్న తాతయ్య పురుషోత్తం కేసి చూడ్డంతో ఆయన మనసు లోనే గర్వపడుతూ 'ఏమిటే రాజ్యం చిన్నపిల్లతో నీ వేళాకోళాలు. వెళ్ళి నా స్నానానికి నీళ్ళు సిద్ధం చెయ్యి' అని అనడంతో 'చూశావామ్మా, ఇదీ భాగోతం' అన్నట్లుగా లావణ్యకేసి చూసిన మామ్మ ఆయనకి నీళ్ళ ఏర్పాట్ల కోసం బాత్రూంలోకి వెళ్ళింది.

●●●

'లావణ్యా, నేను ఆఫీసుకు బయలుదేరు తున్నాను' అని కారుణ్య అనడంతో 'ఓకే బావా' అని సింపుల్‌గా చెప్పిన లావణ్యను చూసి 'అదేమిటే పిల్లా! భర్త ఆఫీసుకు వెళుతుంటే భార్య ఎదురు రావాలి. అలాగే గేటుదాకా వెళ్ళి సాగనంపాలి. అప్పుడు ఆ మగనికి అంతా శుభమే జరుగుతుంది. అవునా' అని లావణ్యను అడిగింది.

'చూడు మామ్మా, నువ్వింకా సత్తెకాలంలోనే ఉన్నావు. ఇప్పుడెవరికంత తీరికుందని, ఒకరి కొకరు టాటాలు చెప్పుకోవడానికి. ఆ రోజులు ఏనాడో పోయాయి. భర్త దారి భర్తదే. భార్య దారి భార్యదే" అంది లావణ్య.

"చూడమ్మాయ్! నువ్వలా అంటే నేను ఒప్పుకోను. మీ తాతగారు స్కూల్లో పనిజేసి నంత కాలం నేను ఎదురు రాకుండా ఎప్పుడూ ఆయన ఉద్యోగానికి వెళ్ళలేదు. అలాగే వీధి గేటు వరకు ఆయన్ను సాగనంపందే నా మనసు ఒప్పుకునేది కాదు. ఈనాటి కుర్ర కారుకు ఇవేమి తెలియవు. సెంటిమెంట్లు అసలే లేవు. చెబితే అర్థం చేసుకోరు సరికదా 'బోడి చాదస్తం' అని కొట్టిపారే స్తారు. అవునా!' అని లావణ్యతో అంది.



‘సరే మామ్మా, ఇప్పుడు చెప్పావుగా! ఇంక పాటిస్తాను గాని ముందు నువ్వెళ్ళి స్నానం చెయ్యి. తర్వాత మనిద్దరం కూర్చుని తీరుబడిగా కబుర్లు చెప్పుకోవచ్చు” అని లావణ్య అనడంతో ‘సరే’ అన్న మామ్మ స్నానం, పూజ కానిచ్చి హాల్లో ఉన్న సోఫాలో కూర్చుని ఇల్లంతా పరికించి చూసింది.

ఇంటిని చూసి ఇల్లాలిని చూడమన్నారు పెద్దలు. ఇంటిని సర్దే విధానాన్నిబట్టి ఆ ఇంటి ఇల్లాలి ఇష్టాలు, అభిరుచులు, మనస్తత్వం ఇట్టే చెప్పొచ్చును. లావణ్య ఇంటిని చూసిన మామ్మకు ‘ఏమిటో, లావణ్యకు ఏ విషయంలోనూ శ్రద్ధ లేదులా ఉంది’ అనుకుంటూ బెడ్రూములో ఉన్న లావణ్య దగ్గరకు వెళ్ళిన మామ్మ బెడ్రూముని చూసి మరింత ఆశ్చర్యపోతూ ‘ఏమిటే మనవరాలా, కొత్తగా పెళ్ళైనవాళ్ళు ఉండే బెడ్రూమేనా ఇది. చూడు దుప్పటి ఎంతలా మాసిపోయిందో. ఇటువంటి రూముని చూస్తే ఏ మగాడికైనా అసలు మూడ్ వస్తుందా చెప్పు’ ఆమె పక్కనే కూర్చుంటూ అంది మామ్మ.

‘ఏంచెయ్యను మామ్మా! నాకు ఇల్లు సర్దడమంటే పరమ చిరాకు. అయినా బావ కూడా ఏమీ అనడు’ చెప్పింది లావణ్య.

‘మగాడు! పాపం వాడేమంటాడు? అసలు బెడ్రూమంటే ఎలాఉండాలి? చూడ్డానికి ఎంతో నీట్‌గా, లైట్‌కలర్ దుప్పట్లతో మంచం, ఇంకా అందమైన చిన్నచిన్న వాల్ పెయింటింగ్‌లు ఇవన్నీఉంటే ఎటువంటి మగవాడికైనా బెడ్రూము వదిలి రావాలని ఉండదు. మరినువ్వో! ఎప్పుడు బెడ్రూములోంచి పారిపోదామా అనిపించేలా ఉంచావు’ అని అన్న మామ్మ వెంటనే బెడ్రూమంతా ఎంతో నీట్‌గా సర్ది పరుపుమీద అందమైన లేత గులాబీ రంగు దుప్పటి పరిచి ‘ఇప్పుడెలా ఉంది బెడ్రూము’ అన్నట్లుగా లావణ్య వంక చూసింది.

‘థాంక్స్ మామ్మా, చాలా చక్కగా సర్దావు. ఇప్పుడు కారుణ్య ఈ రూము చూస్తే ఇంక సర్వం మరిచిపోతాడు’ అంటూ మామ్మ బుగ్గ మీద చిన్నగా ముద్దుపెట్టిన లావణ్యతో ‘అవునే లావణ్య, నిన్నో విషయం అడుగుతాను. సిగ్గు పడకుండా నిజం చెప్పాలి. సరేనా’ అని అంది మామ్మ.

‘ఏ విషయం మామ్మా’ నవ్వుతూ ఆశ్చర్యంగా అంది లావణ్య.

‘అదే మన కారుణ్య బెడ్రూములో ఎలా ఉంటాడు?’ సడన్‌గా అడిగింది మామ్మ.

‘పో మామ్మా! నువ్వు మరీనూ! అటువంటి విషయాలు ఎవరైనా చెబుతారా ఏంటి?’ సిగ్గుగా అంది లావణ్య.

‘ఎవరి విషయాలో నాకెందుకు. నీ సంగతి చెప్పు’ అంది మామ్మ.

‘బాగానే ఉంటాడు’ చెప్పింది లావణ్య,

‘బాగానే అంటే’ తిరిగి రెట్టించి అడిగింది మామ్మ.

‘బాగానే అంటే బా....గా...నే’ అన్న లావణ్యతో, ‘ఓసి వెర్రిదానా! వాడు నీతో ఎలా ఉంటాడో నువ్వు చెప్పకపోయినా నేను ఊహించగలను’ అంది మామ్మ.

‘ఎలా’ భయంగా అంది లావణ్య.

‘ఏంలేదు, నా లెక్కప్రకారం ప్రతిరోజూ వాడు నిన్ను బతిమాలుతూ ఉంటాడు, అవునా?’ అంది మామ్మ.

‘అలా అని ఏంలేదు. కానీ నిజం మామ్మా! బావ




ఒకటికి రెండుసార్లు అడిగితేనేగాని నేను ఒప్పుకోను’ సిగ్గుగా చెప్పింది లావణ్య.

‘ఏం ఎందుకు? బావంటే నీకు ఇష్టం లేదా?’ సూటిగా అడిగింది మామ్మ.

‘అమ్మో! బావంటే నాకు పంచప్రాణాలు. అందుకే కదా, ఏరి కోరి పెళ్ళి చేసుకున్నాను’ అంది లావణ్య.

‘మరి అటువంటి భర్తను పస్తులు ఎందుకు పెట్టడం, తప్పు కదా?’ నవ్వుతూ అంది మామ్మ.

‘ఏమో మామ్మా, నేను ఎందుకలా ఉంటానో నాకే తెలియడం లేదు. పాపం బావ చాలా మంచివాడు. అందుకే నన్ను ఎప్పుడూ బలవంత పెట్టడు’ చెప్పింది లావణ్య.

‘ఊరుకో, ఇప్పటికైనా మించిపోయింది లేదు. నేను చెప్పినట్లు విను. అప్పుడు చూడు... మీ దాంపత్య జీవితం మూడు పువ్వులు ఆరు కాయలుగా, ఎప్పటికీ ఓ అందమైన అనుభూతిలా మిగిలిపోతుంది’ అని చెప్పడంతో ‘మామ్మా.. ప్లీజ్ త్వరగా గురోపదేశం చేసి పుణ్యం కట్టుకో. మాకు పుట్టబోయే బిడ్డకు నీ పేరే పెట్టుకుంటాం’ నాటక ఫక్కీలో అంది లావణ్య.

‘ఇందులో ప్రత్యేకంగా నేర్పాల్సిందేమీ లేదు. ఒక్కొక్కరిది ఒక్కో పంథా! నా మటుక్కి నేను మీ తాతయ్యను నా చెప్పుచేతల్లో ఉంచడానికి ఓ పద్ధతి పాటించాను’ అంది మామ్మ.

‘ఏంటది మామ్మా’ ఎంతో ఉత్సాహంగా

అడిగింది లావణ్య.

"ఏంలేదు లావణ్యా! నీకు తెలుసుకదా, మీ తాతయ్య కూడా వరసకు నాకు బావే అవుతాడు. అలా అని నేనెప్పుడూ ఆయన్ని చులకనగా చూడలేదు. భర్తగా ఎప్పుడూ గౌరవించేదాన్ని. ఎందుకంటే మగాడికి 'నేను మగాణ్ణి. పైగా మొగుణ్ణి' అన్న 'ఇగో' ఉంటుంది. దాన్ని మనం శాటిస్‌ఫై చేస్తే చాలు. వాళ్ళు మనం చెప్పినట్లు వింటారు. భార్య భర్తను గౌరవించాలి. భర్త భార్యను ప్రేమించాలి. అప్పుడే వారి సంసారంలో 'సరిగమలు' పలుకుతాయి. భార్య భర్తమీద అనురాగం కురిపిస్తే ఇంక ఆ భర్త ఆమే సర్వస్వం అని భావిస్తాడు, వేరే ఆడదాని వంక పొరపాటున కూడా కన్నెత్తి చూడడు' చెప్పింది మామ్మ.

'మరి బావ నన్ను చిన్నచిన్న విషయానికి కూడా ఆట పట్టిస్తాడు' ఉడుకుమోత్తనంగా అంది లావణ్య.

'ఇప్పుడంటే తాళి కట్టి భర్తయ్యాడు కాని, ముందుగా నీకు బావే కదా! ఏం, బావ ఆ మాత్రం చనువుగా నిన్ను ఆట పట్టించకూడదా? పోని నువ్వు కూడా బావను తిరిగి ఆట పట్టించు. లేకపోతే కాస్త ఓర్చుకుని వాడి పని రాత్రి బెడ్రూములో పట్టించు. అంతేకాని అది మనసులో పెట్టుకుని వాణ్ణి పస్తులు ఉంచకు. సంసారమన్నది ఆడా మగా ఇద్దరు కలిసి చెయ్యాలి. అవునా? నిజానికి ఆయన కూడా నన్ను బాగా ఏడిపించేవారు. అయితే అప్పుడు నేనేమి మాట్లాడకుండా రాత్రి ఆయన సంగతి చూసేదాన్ని.

'అదేంటి? రాత్రి చూడ్డమేంటి?' అమాయకంగా అడిగింది లావణ్య.

'చూడబోతే నువ్వో వెర్రిమాలోకంలా ఉన్నావు. అప్పుడే కదా మగాడు మన చేతికి చిక్కుతాడు. ఆ సమయంలో 'ఆ' అవసరం కోసం మనం ఎలా చెబితే అలా వింటాడు' చెప్పింది మామ్మ.

'అయితే నేనిప్పుడు ఏంచెయ్యాలి?' ఎంతో ఉత్సాహంగా అంది లావణ్య.

'చెప్పాను కదే, ఒక్కొక్కరిది ఒక్కోదారని! ఇది ఒకరు నేర్పితే వచ్చేది కాదు. ఎవరికి వారే నేర్చుకోవాలి. కాబట్టి నీ బావకి నచ్చేటట్లు ఎలా ఉండాలో నువ్వే ఆలోచించు. ఆడది తల్చుకుంటే సాధించలేనిది లేదు' ఆమెను రెచ్చగొడుతూ అంది మామ్మ.

"......... ............."

'ఆ... చూడు లావణ్యా! పెద్దదానిగా నీకో మాట చెబుతాను, ఏమనుకోకు. ఉదయం బావకు నువ్వు దగ్గరుండి టిఫిన్ పెట్టి, కొసరి కొసరి ప్రేమగా తినిపిస్తే నీ సొమ్మేం పోయింది? అలాగే వాడు ఆఫీసుకు వెళ్తున్నప్పుడు వాడికో 'స్వీట్ కిస్' ఇచ్చి పంపు. పొద్దున బాత్రూములో వాడు నీళ్ళు వేడిగా ఉన్నాయి అని అన్నప్పుడు 'ఏంటండీ నీళ్ళు వేడిగా ఉన్నాయా...! ఉండండి కాస్త చన్నీళ్ళు కలుపుతాను' అని బాత్రూములోకి నువ్వు వెళ్ళంటే, ఏమో, వాడేమైనా చిలిపి పనులు చేసేవాడేమో! పిచ్చిపిల్లా, ఇటువంటి చిన్నచిన్న అనుభవాలే మనం పెద్దవాళ్ళమైన తర్వాత 'తీపి గురుతులుగా' మిగులుతాయి. అటువంటి మధురానుభూతులను తల్చుకుంటూ జీవితాన్ని హాయిగా గడిపేయొచ్చు. అవునా' కాస్త కొంటెగా అంది మామ్మ.




'ఏంటి మామ్మా, బాత్రూములో ఏం చిలిపి పనులు చేస్తారు?' అయోమయంగా అంది లావణ్య.

'నువ్వు చాలా అమాయకురాలివి. ఇంకా చాలా ఎదగాలి. ఈ విషయంలో నేను చాలా అదృష్టవంతురాలిని. మీ తాతగారు చాలాచాలా చిలిపి పనులు చేసేవారు. నీకు తెలుసుకదా గ్రామాల్లో పండక్కి కొత్తల్లుళ్ళు వస్తారు. అలా వచ్చిన అల్లుళ్ళకు శుభ్రంగా ఒళ్ళంతా నలుగు పట్టించి ఉడుకు నీళ్ళతో స్నానం చేయించి కొత్తబట్టలు ఇస్తారు. ఓసారి మీ తాతయ్య పండక్కి వచ్చినప్పుడు ఏం జరిగిందో తెలుసా! మా పక్కింటి జానకి పిన్నికి సడన్‌గా పురిటి నొప్పులు రావడంతో మా అమ్మ అక్కడికి వెళుతూ 'అమ్మాయ్ నేను పిన్ని ఇంటికి వెళ్తున్నాను. కాస్త అల్లుడికి తలంటు పోసి కొత్త బట్టలు ఇయ్యి' అని చెప్పడంతో నేను ఆయనకు తలంటుపోయడానికని వెళితే ఇంట్లో అమ్మ లేదని తెలిసిన ఆయన బాత్రూంలో ఏం చేశారో తెలుసా! ఒంటికి నూనె పట్టిస్తున్న నా బొడ్డుదగ్గర ముద్దు పెడుతూ నన్ను అమాంతం తన ఒళ్ళో కూర్చోబెట్టుకుని గట్టిగా వాటేసుకుని ఎన్నెన్ని ముద్దులు పెట్టారో. అలాగే ఆయన తల తుడుస్తుంటే చీర కొంగులోకి చెయ్యి పోనిచ్చి, ఎన్నెన్ని చిలిపి పనులు చేసేవారో, అబ్బా! తల్చుకుంటే నాకు చాలా సిగ్గేస్తోంది బాబూ! ఏ మాటకామాటే చెప్పుకోవాలి. ఆయన అలా అల్లరిపనులు చేస్తుంటే ఎంత ఆనందమేసేదో కదా' అంటూ ముసిముసిగా నవ్వుతూ చెప్పిన ఆమె 'లావణ్యా, ఆరోజుల్లో పందిరి మంచాలు, వాటి చుట్టూ అద్దాలు ఉండేవి. అలా అద్దంలో ఇద్దరం ఒకరినొకరు నగ్నంగా చూసుకుంటూ, అబ్బా తల్చుకుంటుంటే ఎంతో ఆనందంగా ఉంటుంది. గొప్పకాదు కాని ఆయన ఈనాటికీ అలాగే ఉన్నారు. సాయంత్రమయ్యే సరికల్లా నేను చక్కగా ముస్తాబై తలనిండా పూలు పెట్టుకుంటేనే కాని ఒప్పుకోరు. చూడు లావణ్యా, మగాడు ఎప్పుడూ ఆడదాన్ని సుఖపెట్టాలనే అనుకుంటాడు. అయితే మగనికి అటువంటి వాతావరణాన్ని భార్యే సృష్టించాలి. అందుకు అనువైన ప్రదేశం బెడ్రూము కన్నా ఇంకేముంటుంది. ఎక్కడా లొంగని మగవాడు ఆడదానికి ఆ బెడ్రూములో చచ్చినట్లు లొంగుతాడు. మరి అటువంటి బెడ్రూముని మనం ఎంత అందంగా అమర్చుకుంటే ఆలుమగలు అంత ఎక్కువగా ఎంజాయ్ చేస్తారు. మీ తాతగారు రోజంతా గాంభీర్యంగా ఉన్నా బెడ్రూములోకి వచ్చేసరికి మాత్రం రసికరాజులా, కోడి కూసి జాము పొద్దెక్కినా ఇంకా కోరికలు తీర్చమనేవారు. నీకు ఇంకో విషయం చెప్పనా! పొరపాటున ఎప్పుడైనా నా పైట జారితే, ఇంక ఆయన్ని కంట్రోల్ చెయ్యడం నా వల్ల అయ్యేది కాదు. పైట జారిన ప్రతీసారి ఆయన కోరిక తీర్చమనేవారు. అయితే నేను కూడా ఒకొక్కసారి కావాలనే 'పైట' జార్చేదాన్ని! సిగ్గుగా చెప్పిన మామ్మ 'ఏవండీ! మీకింత శక్తి ఎలా వస్తుంది?' అని ఓరోజు అడిగితే, ఆయన ఏమన్నారో తెలుసా, 'ఆడది సహకరిస్తే, పిల్లిలాంటి మగవాడు కూడా పులైపోతాడు' మగని కోరికలు తీరిస్తే ఆడదాని శరీరం ఏం కరిగిపోదు. అరిగిపోదు సరికదా ఒళ్లంతా నిగారింపుతో మనం కూడా ఎంతో ఉత్సాహంగా ఉంటాం. కాబట్టి లావణ్యా, నేను చెప్పినట్లు నడుచుకుని చూడు. అప్పుడు మీ దాంపత్య జీవితంలోని స్పష్టమైన మార్పు నీకే తెలుస్తుంది.

"......... ..."

'ఏంటి? మామ్మేంటి, సిగ్గులేకుండా అన్నీ నాకెందుకు చెబుతోంది? అనుకుంటున్నావు కదూ! ఓసి పిచ్చిదానా! ఆడదాని మనసు గురించి ఆడదానికే తెలుస్తుంది. నువ్వు తెలివితక్కువ తనం

తోను, లేనిపోని భయాలతోను జీవితంలోని ఆనం దాన్ని పూర్తిగా అనుభవించలేక పోతున్నావు' అని మామ్మ నవ్వుతూ అనడంతో 'మామ్మా, నువ్వన్నట్లు నేను తెలివి తక్కువదాన్నే. ఇప్పుడు నువ్వు చెబుతుంటే అర్థమవుతోంది, నేను బావని ఎంత బాధ పెడుతున్నానో! ఇంక చూడు... బావతో ఎలా ఉంటానో' అంటూ ముసిముసిగా నవ్వుకుంటూ వాళ్ళకు భోజనాలు సిద్ధం చేయ డానికని లావణ్య కిచెన్‌లోకి వెళ్ళింది. మనసు లోనే నవ్వుకుంటూ, లావణ్య వెనకే హాల్లోకి వచ్చిన మామ్మతో 'ఏంటి రాజ్యం, అమ్మాయితో మాట్లాడావా? ఏమంది?' అని భార్యను ఎంతో ఆత్రుతగా అడిగాడు పురుషోత్తం.

మీరన్నారే 'ఫ్రిజిడిటి' అని, అదే అమ్మాయి కున్న సమస్య. దానివల్లే అలా ఉంటోంది. దానికి అన్నీ విడమర్చి చెప్పాను. 'మామ్మా, ఒక్కొక్కసారి నేను ఎందుకిలా ఉంటానో నాకే అర్థం కావడం లేదు. పాపం బావ కూడా నా వల్ల చాలా ఇబ్బందులు పడుతున్నాడు' అని ఎంతో బాధపడింది. ఏవండీ! అది తప్పకుండా మారుతుంది. నాకా నమ్మకముంది. అప్పుడు మన మనవడి సంసార జీవితానికేం ఢోకా ఉండదు' అని నవ్వుతూ డైనింగ్ టేబుల్ దగ్గరకు వెళుతున్న మామ్మ వెనకే ఆనందంగా నడి చాడు పురుషోత్తం.

•••

'ఏంటి లావణ్యా! ఏంటి సంగతి. ఇవాళ ఏం జరిగింది?' మంచం మీద తన పక్కనే కూర్చున్న లావణ్యను నవ్వుతూ అడిగాడు.

'ఏం ఎందుకో మీకు తెలియదా?' కొంటెగా అంది లావణ్య.

'ఏమో నాకేం తెలుసు. ఇవాళ మామ్మ వచ్చిన తర్వాత ఇంట్లో ఏమైనా అద్భుతం జరిగిందా! ఎప్పుడూ లేంది ఇవాళ నీ అంతట నువ్వుగా నా దగ్గరకు వచ్చావు. పైగా నన్ను 'మీరు' అంటున్నావు. ఎందుకో నిన్ను చూస్తుంటే నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. నిజం చెప్పు... ఏం జరి గింది?' ఆమె సన్నటి నడుంపై చెయ్యివేస్తూ అన్నాడు కారుణ్య.

'ఏం లేదు బావా, నాకు ఇవాళే జ్ఞానోదయమైంది. అలాగే ఎన్నెన్నో కొత్తవిష యాలు కూడా తెలుసుకున్నాను' అతనికి దగ్గరగా జరుగుతూ అంది లావణ్య.

'ఏంటో ఆ కొత్త విషయాలు' ఆమె మెడ వంపుమీద ముద్దు పెడుతూ అన్నాడు కారుణ్య.

'కొత్త విషయం అంటే... అ...దీ' అమాంతం అతని పెదవులను తన పెదవులతో మూస్తూ 'అదొక దేవ రహస్యం'. ఇవాళే మామ్మ నాకు 'వశీకరణ మంత్రం' ఉపదేశించింది. దాని ప్రభావమే ఇదంతా' అతని పెదవులను తన మునిపంటితో మెల్లగా కొరుకుతూ అంది లావణ్య. అలా అన్నప్పుడు ఆమె నున్నటి బుగ్గలు సింధూర మొగ్గలై లేత తమలపాకుల్లాంటి ఆమె అధరాలు కెంపు వర్ణమై మెల్లగా కంపించాయి. అలాగే ఆమె ఎదపైకి కిందకు లేస్తూ, ఆమె బరువుగా శ్వాస విడుస్తూ, ఆడత్రాచులా మెలికలు తిరుగుతూ తన అందమైన శరీరాన్ని విల్లులా వంచి ఒళ్ళు విరుచుకోవడంతో కారుణ్య ఆమె అందమైన పిరుదుల మీద మెల్లగా రాస్తూ, ఆమె తెల్లటి దేహాన్ని తన పెదవులతో స్పృశించాడు. ఆమెలోని అణువణువును తీపిముద్దులతో కొలుస్తూ జున్నులోని తియ్యదనాన్ని ఆమె అధరాల నుండి ఆస్వాదిస్తూ, ఆమె ఒంటిమీది ఎత్తు పల్లాలను తన చేతులతో కొలుస్తూ, ఆమెలోని లోతుని తెలుసుకోవడానికి ఆత్రంగా ముందుకు దూసుకెళ్ళడంతో తట్టుకోలేని లావణ్య పున్నమినాటి సముద్రపు అలలా అమాంతం అతన్ని చుట్టేసి ముద్దులలో ముంచెత్తింది. ఆమె చూపిన చొరవకు రెచ్చిపోయిన అతను గండు తుమ్మెదలా ఆమెలోని మకరందాన్ని గ్రోలడాని కని ఇంకా గట్టిగా ఆమెను పెనవేసుకుంటూ ఉప్పొంగిన కెరటంలా ఎగసిఎగసి పడుతున్న ఆమె పరువాలతో తనివితీరా సయ్యాటలాడి, ఆపై శాంతించి మెల్లగా నిద్రలోకి జారుకోవ డంతో స్వర్గసుఖాలు అనుభవించిన లావణ్య తృప్తిగా కారుణ్య వంక చూస్తూ అతని ముఖంపై పట్టిన చెమటను తన చీరకొంగుతో తుడిచి ప్రేమగా అతని నుదుటి మీద గాఢంగా చుంబిస్తూ 'థాంక్స్ మామ్మా...! ఇంత కాలం ఏదో తెలియని భయంతో భర్త పొందులోని సుఖాన్ని అనుభవించలేక పోయాను.

ఇప్పుడు నువ్వు నేర్పిన 'వశీకరణ' మంత్రం మా పాలిట వరమైంది. ఇంక చూడు, బావకు 'ప్రతిరేయి' ఓ 'తొలి రేయి'గా జీవితాంతం గుర్తుండేలా చేస్తాను' అని 'ఫ్రిజిడిటి' బారి నుండి క్రమేపి బయట పడుతున్న లావణ్య విశాలమైన తన బావ గుండెలపై వాలి హాయిగా, నిశ్చింతగా మెల్లగా నిద్రలోకి జారుకుంది.

సెల్: 094153 68475

## రొమాన్స్ అంత ఈజీ కాదట!

జూనియర్ కత్రినా కైఫ్ అన్న బిరుదును సొంతం చేసుకున్న జరీన్‌ఖాన్ గుర్తుంది కదా! సల్మాన్ పుణ్యాన సినిమాల్లోకి అడుగుపెట్టినా కత్రినాలా సక్సెస్‌ను మాత్రం సొంతం చేసుకోలేక పోయింది. బాలీవుడ్‌లో అడపాతడపా సినిమాలు చేస్తున్న ఈ చిన్నది తాజాగా ఓ వీడియో ఆల్బమ్‌లో నటిస్తోంది. ఈ సందర్భంగా పై విధంగా వ్యాఖ్యానించింది. తెర మీద రొమాంటిక్ సన్నివేశాలు చూసిన వారందరూ చాలా బాగా వచ్చాయనో, నటీనటులు లేకపోతే బాగా ఎంజాయ్ చేశారనో అంటూంటారు. కానీ వారు అనుకున్నంత ఈజీగా రొమాంటిక్ సన్ని వేశాలు చేయలేము అంటోంది. చాలా మంది మధ్య చేయవలసి వస్తుంది. అంతే కాదు వీడియో రిహార్సల్స్ కూడా ఉంటూంటాయి. వీటన్నింటి మధ్యా రొమాంటిక్ సన్నివేశాలను చేయడమూ, ప్రేక్షకులను మెప్పించడమూ కష్టమే అంటోంది. అయితే పది మంది మధ్య నటించాల్సి వస్తుందన్న విషయం సినిమాల్లోకి వచ్చే ముందు జరీన్‌కు తెలియదా? అంటూ బాలీవుడ్ జనాలు సెటైర్లు వేస్తున్నారు.






- రాజశుక

# ఎంత చెప్పినా ఫలితం శూన్యమే

**ఉగ్రవాదం పాకిస్థాన్ ప్రభుత్వ విధానం. అది ఆ దేశ మనుగడ. ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఎన్నిసార్లు చర్చలు జరిపినా పాక్ ధోరణికి విరుగుడు ఉండదు.**

పాకిస్థాన్‌కు భారత్ ఇటీవల ఓ గట్టి హెచ్చరికనే జారీ చేసింది. ఉగ్రవాద వర్గాలను ప్రోత్సహించడాన్ని, వారిని కీర్తించడాన్ని ఇక మానుకోవాలని భారత్ స్పష్టం చేసింది. ఉగ్రవాద వర్గాలకు మద్దతు ఇచ్చే దేశాల మీద గట్టి చర్యలు తీసుకోవాలని, వాటిని దాదాపు వెలి వేయాలని సూచించింది. భారత, పాకిస్థాన్ దేశాల మధ్య సంబంధాలు గడ్డు పరిస్థితిలో ఉన్న విషయం తెలిసీ భారత్ ఈ హెచ్చరికలు జారీ చేయడం గమనార్హం. ఉగ్రవాదాన్ని, ఉగ్రవాదుల కార్యకలాపాలను ఖండించినంత మాత్రాన సరిపోదని, మంచి ఉగ్రవాదులు, చెడ్డ ఉగ్రవాదులు వేరు వేరుగా ఉండరని హోం మంత్రి రాజ్‌నాథ్ సింగ్ పాకిస్థాన్‌లో సార్క్ దేశాల హోం మంత్రుల సమావేశంలో నొక్కి చెప్పారు. ఎన్ని దేశాలు ఎన్నిసార్లు చెప్పినా ఉగ్రవాదం మాత్రం అడ్డూ ఆపూ లేకుండా కొనసాగుతూనే ఉందని, వివిధ దేశాలకు అది ఇంకా ఓ తీవ్రస్థాయి సవాలుగానే ఉంటోందని కూడా ఆయన స్పష్టం చేశారు.

ఈ సమావేశంలో పాకిస్థాన్ హోం మంత్రి చౌధరి నిసార్ అలీ ఖాన్ తనకెదురుపడినా రాజ్‌నాథ్ సింగ్ చిరునవ్వుతో పలకరించకపోవడం, కరచాలనం చేయకపోవడాన్ని బట్టి ఈ రెండు దేశాల మధ్య సంబంధాలు ఏ స్థాయిలో ఉన్నదీ అర్థం చేసుకోవచ్చు. మరో విషయమేమిటంటే, రాజ్‌నాథ్ సింగ్ ఆ సమావేశంలో చేసిన ప్రసంగాన్ని పాకిస్థాన్‌లోని మీడియా ప్రసారం గానీ, ప్రచురణ గానీ చేయకపోవడాన్ని బట్టి కూడా ఈ రెండు దేశాల మధ్య సంబంధాల స్థాయిని ఊహించవచ్చు. అంతేకాదు, పాకిస్థాన్ హోం మంత్రి సార్క్ దేశాల హోం మంత్రులకు ఇచ్చిన విందుకు కూడా రాజ్‌నాథ్ సింగ్ హాజరు కాలేదు. ఉగ్ర వాదులు, వారి సంస్థల మీదే కాక, ఉగ్రవాదాన్ని ప్రోత్సహించే, ఉగ్రవాదానికి మద్దతునిచ్చే వ్యక్తులు, సంస్థలు, దేశాల మీద కూడా చర్యలు తీసుకోవాలని రాజ్‌నాథ్ సింగ్ పాక్ ప్రధానమంత్రి నవాజ్ షరీఫ్‌ను దృష్టిలో పెట్టుకుని సమావేశంలో కోరారు. ఉగ్రవాదాన్ని కీర్తించడం తగదని ఆయన చెప్పింది కూడా నవాజ్ షరీఫ్‌ను దృష్టిలో పెట్టుకునే.

గత జూలై 8న జమ్మూ కశ్మీర్‌లో ఓ ఎన్‌కౌంటర్‌లో పోలీసులు హతమార్చిన బుర్హాన్ వనీ అనే ఉగ్రవాదిని నవాజ్ షరీఫ్ ప్రశంసించడమే కాక, అతనో అమరజీవి అని కూడా వ్యాఖ్యానించడం గుర్తుండే ఉంటుంది. ఓ దేశంలోని ఉగ్రవాది మరో దేశానికి అమరజీవి కాలేడని, ఉగ్రవాదులను అమరజీవులుగా కొనియాడడం తగదని రాజ్‌నాథ్ సింగ్ ఈ సందర్భంగా వ్యాఖ్యానించారు. తన మాటలు కేవలం సార్క్ దేశాలకు మాత్రమే కాక, యావత్ మానవాళికీ వర్తిస్తాయని కూడా రాజ్‌నాథ్ సింగ్ స్పష్టం చేశారు. ఒక్క బుర్హాన్‌వనీనే కాక, పలు ఉగ్రవాద సంస్థలను కీర్తిస్తున్నదీ, ప్రోత్సహిస్తున్నదీ పాకిస్థానేనని ఆ సమావేశానికి హాజరైన ప్రతి దేశానికీ తెలుసు. పాకిస్థాన్ పాలకుల తీరుతెన్నుల వల్ల ఆ దేశానికి ఏమైనా ప్రయోజనం ఒనగూరుతోందా అన్నది సందేహమే. భారత్‌పైకి ఉగ్రవాదాన్ని ఉసికొల్పడంలో ముందుండే పాకిస్థాన్ నాయకత్వం అడపాదడపా భారత్‌పైనే రకరకాల విమర్శలతో విరుచుకుపడుతుంటుంది. పాకిస్థాన్ మారడానికి సిద్ధంగా లేదని రాజ్‌నాథ్ సింగ్ అనడంలో పొరపాటేమీ లేదు.

## ప్రజల్లో తీవ్ర వ్యతిరేకత

ప్రతిదానికీ భారతదేశాన్ని నిందించడం పాకిస్థాన్ పాలకులకు, నాయకులకు కొద్దిపాటి సంతృప్తిని ఇస్తే ఇస్తుండొచ్చు కానీ, ఆ దేశ ప్రజలకు మాత్రం ఈ వైఖరి ఏవగింపు కలిగిస్తోంది. భారత్ వ్యతిరేకత ఇప్పుడు అక్కడ పాతబడిపోయింది. ఎక్కడా చెల్లుబాటు కావడం లేదు. నిజానికి పాకిస్థాన్‌కు భారత్ వ్యతిరేకతను మించి అనేక సమస్యలు, సవాళ్లు కట్టెదుట నిలిచి ఉన్నాయి. అనేక సంవత్సరాలుగా దేశంలో కొనసాగుతున్న అసమర్థపాలన పట్ల పాకిస్థాన్ ప్రజలు విసుగెత్తిపోయారు. పాలకుల్లో అవినీతి పెట్రేగిపోతుండడాన్ని కూడా వారు అసహ్యించుకుంటున్నారు. ఇక దాదాపు ప్రతి ప్రభుత్వమూ ఎన్నికల సందర్భంగా వాగ్దానాలు చేయడమే కానీ, వాటిని నిలబెట్టుకునేందుకు, నెరవేర్చేందుకు ఏమాత్రం ప్రయత్నించడం లేదని వారికి అర్థమైపోయింది. అయినప్పటికీ, రాజకీయ నాయకులు, పాలకులు మాజీ సైనికాధికారులు మాత్రం భారత్ పైకి

ఉగ్రవాదాన్ని ఉసిగొల్పడంతో పాటు, కొద్దిపాటి రాజకీయ ప్రయోజనాల కోసం భారత్‌కు వ్యతిరేకంగా ప్రజల్లో సెంటిమెంట్లు రెచ్చగొట్టడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు.

ప్రస్తుతం వాళ్ల దృష్టంతా తమ పాలకులు, తాము ఎన్నుకున్న ప్రజా ప్రతినిధులు తమకు ఉద్యోగాలు కల్పించడానికి, తమ పేదరికాన్ని పోగొట్టడానికి ఏం చేస్తున్నారనే దాని మీద కేంద్రీకృతమై ఉంది. ఇటీవల అక్కడ ఓ విజ్ఞాన, సమాచార సంస్థ దేశవ్యాప్త సర్వే నిర్వహించినప్పుడు ఎక్కువ మంది భారత్‌ను విమర్శించడాన్ని సమర్థించలేదు. తాము ఎంతగా విమర్శించినా, తమ సైనికులు వాస్తవాధీన రేఖ దగ్గర ఎంతగా సమస్యలు సృష్టిస్తున్నా భారత్ అతివేగంగా అభివృద్ధి చెందుతుండడం, తమ దేశ పరిస్థితి నానాటికీ తీసికట్టు అన్నట్టుగా తయారవుతుండడం తమను కలచి వేస్తోందని అత్యధిక సంఖ్యాకులు ఆవేదన వ్యక్తం చేశారు.

ఒకప్పుడు బేనజీర్ భుట్టో భారత్ వ్యతిరేకతే ప్రాణంగా పార్టీని ముందుకు తీసుకు వెళ్లిన మాట నిజమే కానీ, ఇప్పుడు పాకిస్థాన్ ప్రజలు పాశ్చాత్య దేశాల వ్యతిరేకతను ప్రదర్శిస్తున్నంతగా భారత్ వ్యతిరేకతను ప్రదర్శించడం లేదు. షరీఫ్ ఇంకా ఇటువంటి తప్పటడుగులు వేస్తూనే ఉన్నారు. ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీకి వెళ్లి భారత్ వ్యతిరేక వ్యాఖ్యలు చేసి, వాటికి మద్దతు లభించకపోవడంతో భంగపడ్డారు. నవాజ్ ప్రభుత్వానికి అక్కడి సైనిక వ్యవస్థతో కూడా సమస్యలున్నాయి. దేశంలో మరోసారి సైనిక పాలన వచ్చే సూచనలేవీ లేవు. కానీ, అమెరికా, భారత్, ఆఫ్ఘనిస్తాన్ తదితర విషయాల్లో తాము ఎంత చెబితే అంత అని పాక్ సైనికాధికారులు భావిస్తుంటారు. అందువల్ల ఈ దేశాల మీద విమర్శలు గుప్పించడాన్ని నాయకులు తమ బాధ్యతగా చేసుకున్నారు. నాయకులంతా భారత్‌ను విమర్శించడమే పనిగా పెట్టుకున్నారు. దీనితో తమకు సైనికాధికారుల మద్దతే కాక, ప్రజల అభిమానం కూడా దక్కుతుందని వారు అభిప్రాయపడుతున్నారు.

### రగులుతున్న అసంతృప్తి

అయితే, సగానికి సగం మంది ప్రజలకు భారత్ వ్యతిరేకత అంతగా పట్టడం లేదని వివిధ వార్తాపత్రికల్లో నవాజ్ షరీఫ్ పాలనకు వ్యతిరేకంగా వస్తున్న వార్తలు, వ్యాసాలు చెప్పకనే చెబుతున్నాయి. దేశంలో ఉపాధికల్పన పూర్తిగా అధ్వానస్థితిలో ఉందని, దేశంలోకి కొత్తగా పెట్టుబడులేవీ రావడం లేదని, యువతకు నేరాలకు పాల్పడడం తప్ప ఉపాధికి మరో మార్గం లేకుండా పోతోందని అక్కడి పౌర సమాజాలు గగ్గోలు పెడుతున్నాయి. విద్య, వైద్య, ఉపాధి, వ్యాపార రంగాలు క్రమంగా వెనుకపట్టుపడుతున్నాయని అవి ప్రకటనలు చేస్తున్నాయి. "భారత్‌ను విమర్శించినప్పుడల్లా మా రక్తం వేడెక్కేది. ఇప్పుడు మా పాలకులను చూసినప్పుడల్లా రక్తం వేడెక్కుతోంది. అయిదు శాతం ఉపాధి కూడా లభించడం లేదు. ద్రవ్యోల్బణం పెరిగిపోతోంది. దేశం ఇప్పట్లో బాగుపడే సూచనలు కనిపించడం లేదు" అని పౌర హక్కుల సంఘాలు విమర్శిస్తున్నాయి. పాక్ ప్రజలు బహిరంగంగా ఈ పరిస్థితిని అడ్డుకుంటే తప్ప, అంటే పాకిస్థాన్ ప్రజల ధోరణిలో విప్లవాత్మక మార్పులు చోటు చేసుకుంటే తప్ప పాక్ పాలకుల వైఖరిలో మార్పు వచ్చే అవకాశం లేదు.

పాకిస్థాన్‌తో సమస్యలు ఉన్నప్పటికీ భారత్ ఆ దేశంతో తన చర్చలను కొనసాగించడమే మంచిదని రాజకీయ నిపుణులు అభిప్రాయ పడుతున్నారు. ఈ చర్చలవల్ల ఫలితం ఉన్నా ఉండకపోయినా వీటిని కొనసాగించడమే భారత్ లక్ష్యం కావాలి. ఈ చర్చల్లో ఒక్క అడుగు కూడా ముందుకు పడదనే సంగతి ఇరు పక్షాలకీ తెలుసు. కానీ, భారత్ చిత్తశుద్ధితో ఈ చర్చలు కొనసాగిస్తోందనే సంగతి అమెరికాతో సహా ప్రపంచ దేశాలన్నీ గ్రహించాలి కదా! భారత్‌తో సరిహద్దు చర్చల్లో చైనా ఇలాగే వ్యవహరిస్తుంది. చర్చలు కొనసాగిస్తుంటుంది కానీ పరిష్కారం దిశగా చైనా ఒక్క అడుగు కూడా పడనివ్వదు. ఒక్కోసారి పాక్‌తో చర్చలు కొద్దిపాటి సత్ఫలితాలను ఇచ్చే అవకాశం కూడా లేకపోలేదు. తేలికగా వీసాలు, వాణిజ్య అభివృద్ధి వంటివి సాధ్యమవుతాయి. చర్చలు జరపడమంటే పాకిస్థాన్ ఏది కోరితే అది ఒప్పుకోవడం కాదు. పాకిస్థాన్ దేన్నీ భారత్‌కు వదులుకోదు. అలాగే భారత్ కూడా దేన్నీ పాకిస్థాన్‌కు వదులుకోవాల్సిన అవసరం లేదు. భారత్‌కు వ్యతిరేకంగా ఉగ్రవాదులను పెంచిపోషించడం, వారిని భారత్ పైకి ఉసిగొల్పడం ఆగే వరకూ చర్చలు సత్ఫలితాలను ఇవ్వవు. పాకిస్థాన్ ఉగ్రవాదులను భారత్ పైకి ఉసిగొల్పడం సమీప భవిష్యత్తులో ఆగే వ్యవహారం కాదు.

అంటే పాకిస్థాన్‌తో ఏదో విధంగా చర్చలు కొనసాగించడమే సమంజసంగా కనిపిస్తోంది. ఉగ్రవాదాన్ని ఒక పక్క ఉసిగొల్పుతూనే మరో పక్క అది ఏమీ ఎరగనట్టు తమ మధ్య కాశ్మీర్ సమస్య మాత్రమే అవరోధంగా ఉంటోందని ప్రపంచ దేశాలకు చెప్పుకుంటోంది. సిమ్లా, లాహోర్, ఆగ్రా అంటూ అనేక ఒప్పందాలను కుదుర్చుకుంది కానీ, చివరికి అన్నీ బుట్టదాఖలయ్యాయి. ఇరకాటంలో లేదా ఒత్తిడిలో పడినప్పుడల్లా పాకిస్థాన్ ఇటువంటి చర్చలకు, ఒప్పందాలకు ముందుకు వస్తుంటుంది. ఒకసారి ఒత్తిడి నుంచి బయట పడితే, తన జిహాదీ మార్గానికి మళ్లీ మళ్లీపోతుంటుంది. ఒక్క భారత్‌నే కాదు, అమెరికాను కూడా పాకిస్థాన్ చాలా కాలంగా ఇలా మభ్యపెడుతూనే ఉంది. పాకిస్థాన్ చేష్టల వల్ల అమెరికా నష్టపోయేదేమీ ఉండదు. కానీ, భారత్ మాత్రం ప్రతిసారీ భారీ మూల్యం చెల్లించాల్సి వస్తోంది. ఒకవేళ కాశ్మీర్ మీద ఉభయ దేశాల మధ్యా ఒప్పందం కుదిరినా భారత్ పట్ల పాకిస్థాన్ తన శత్రుత్వాన్ని విడిచిపెట్టే అవకాశం లేదు. ఉగ్రవాదం అనేది పాకిస్థాన్ ప్రభుత్వ విధానం.



పాకిస్థాన్‌తో చర్చలు జరపడమనేది చర్విత చర్వణంగా ఉంది. చేసిన పనే మళ్లీ మళ్లీ చేస్తుండడం నిజంగా విసుగెత్తించే పనే. కానీ అంతర్జాతీయ సంబంధాల్లో ఇది గత్యంతరం లేని అంశం. గత పది పదిహేనేళ్లుగా భారతదేశం తన పొరుగుదేశం పాకిస్థాన్‌తో ఎన్నిసార్లు చర్చలు జరిపిందో, ఎన్నిసార్లు చర్చలు విరమించుకుందో లెక్కలేదు. అయినా పట్టువదలని విక్రమార్కుడిలా భారతదేశం తన ప్రయత్నాలను కొనసాగిస్తూనే ఉంది. పాకిస్థాన్‌తో స్నేహ సంబంధాల కోసం తన వంతు ప్రయత్నం సాగిస్తూనే ఉంది. ఇలా ఎంత కాలం సాగుతుందో తెలియదు. పాకిస్థాన్ ఎప్పటికైనా ఇరుగు పొరుగు దేశాలతో కలసి మెలిసి ఉండాల్సిన అవసరాన్ని గుర్తిస్తుందో లేదో తెలియదు.

పండ్లు తినడమంటే కొందరికి అయిష్టం. మరికొందరికేమో మహాఇష్టం. ఇంకొందరికేమో కొన్ని రకాల పండ్లు నచ్చవు. ఎప్పుడూ ఒకరకమేనా! సరికొత్త రుచుల్లో విభిన్నంగా ఉండే పండ్లు ఉంటే బాగుణ్ణు అనిపిస్తుంటుంది మరికొందరికి. ఈ టేస్టులకు అనుగుణంగానే ఈ మధ్య కొత్తరకం మిక్సెడ్ ఫ్రూట్స్ పుట్టుకొస్తున్నాయి. కొత్తకొత్త విధానాలు, సరికొత్త వంగడాలతో ఈ రకం పండ్లకు ప్రతిసృష్టి చేస్తున్నారు. ఈ పండ్లు రూపంలో ఒక రకంగా ఉంటే రుచిలో మరోరకంగా ఉంటాయి. వింతగా ఉంది కదూ! పండ్ల మార్కెట్‌లో ఇదో సరికొత్త కల్చర్ మరి!

# రూపు ఓ రకం.... రుచి ఇంకో రకం!

ఆ పండ్లను చూస్తే ఆపిల్స్‌లా ఉంటాయి. కానీ తిని చూద్దురు కదా పియర్స్ తిన్నట్టుంటుంది. పోనీ ద్రాక్షపండును చూసి నోట్లో వేసుకున్నారనుకోండి, మామిడిపండు రుచితో అద్భుతమైన తీయదనాన్నిస్తుంది. ఇక మరో పండు తెల్లని స్ట్రాబెర్రీలా ఉంటుంది, తీరా తిని చూస్తే మాత్రం అచ్చం పైనాపిల్ రుచితో ఉంటుంది. ఇలా రూపు ఒక రకం, రుచి మరోరకంతో సీడ్‌లెస్ పండ్లను కూడా సృష్టిస్తున్నారు నిపుణులు.

### నాలుక మోసపోయే రోజులొచ్చాయ్!

ఏదైనా పండును చూస్తే నాలుకకు ఆ రుచి గుర్తుకు వచ్చి నోరూరి తినాలనిపిస్తుంది. ఇక అలాంటి ఛాన్స్ ఉండకపోవచ్చు. పండు రూపాన్ని చూసి నాలుక మోసపోయే రోజులొచ్చాయి. అందుకే ఒక రకం పండును చూసి మరో రకం రుచిని ఆస్వాదించేందుకు రాబోయే కాలంలో మన నాలుకలు సిద్ధంగా ఉండాలి మరి! అనాస అరటిపండు, కమలా పియర్స్, ద్రాక్ష స్ట్రాబెర్రీ ఇలా రకరకాల పండ్లను కలబోసి కొత్త రుచులు కనిపెడుతున్నారు. అందువల్ల ద్రాక్ష పండంటే పుల్లగా ఉండాలనే రూల్ లేదు. ఏ రుచిలోనైనా ఉండొచ్చు. పైగా ప్రముఖ కంపెనీల సహాయంతో బ్రాండెడ్ ఫ్రూట్స్ మార్కెట్లోకి తెస్తున్నారు. అందువల్ల కంపెనీ బ్రాండ్‌ను బట్టి కూడా పండు రుచిని నాలుక ఊహించే రోజులొస్తాయన్నమాట! జనాలు కూడా ఈ పండ్లు తినడానికి ఇష్టపడుతున్నారట. వేరేదేశాల మార్కెట్లలో ఈ పండ్లు ప్రవేశించాయి. మనదేశంలోకి రావడానికి ఒకటీరెండేళ్ళు పడతాయంటున్నారు ఉద్యాన నిపుణులు. అలాంటి సరికొత్త మిక్సింగ్ పండ్ల గురించి తెలుసుకుందాం.

### పాపల్

ఏంటీ కొత్త పేరు అనుకుంటున్నారా? ఆపిల్ పండు, పియర్స్ పండు కలిపి సృష్టించిందే పాపల్ అని రూపం చూసి మనం ఊహించవచ్చు. అలా ఊహిస్తే పొరబడినట్టే. పైరస్ కమ్యూనిస్, పైరస్ పైరిఫోలియా అనే రెండు పియర్స్ రకాల ద్వారా ఈ పండు సృష్టించారు న్యూజిలాండ్ ఉద్యాననిపుణులు. ఆపిల్ పియర్స్‌గా చెప్పే ఈ పండుకు నిజానికి టి-109 అన్న పేరు కూడా పెట్టారు. కానీ



చూడ్డానికి అచ్చం ఆపిల్‌లానే ఉండడంతో దీనికి పాపల్ పేరు స్థిరపడిపోయింది. మార్క్స్ అండ్ స్పెన్సర్ కంపెనీ వీటిని బ్రిటన్ మార్కెట్లో ప్రవేశపెట్టింది. ఇప్పుడిప్పుడే అక్కడివారు విపరీతంగా ఇష్టపడు తున్నారట.

## గ్రాంజో

పండ్లలో రారాజు మామిడి పండు. మరి అలాంటి మామిడి పండుని ఏడాది అంతా తినాలని అనిపిస్తుంది ఎవరికైనా. అందుకే  అన్ సీజన్‌లో కూడా అందరికీ మామిడి పండ్ల రుచి చూపించేందుకు గ్రాంజో ద్రాక్షను సృష్టించారు. కొంత ఎరుపూ మరికొంత ఆకుపచ్చ రంగుల్లో ఉండే ఆ ద్రాక్షపండ్లు తీపి పులుపు కలగలిసిన మామిడి పండు రుచితో ఉంటాయట. స్పెయిన్‌కు చెందిన వ్యవసాయ నిపుణుడు ఎన్‌రిక్ మోయా తన తోటలో ఈ గ్రాంజో పండ్లను అభివృద్ధి చేశాడు. ఈ కొత్తరకం ద్రాక్షను కూడా మార్క్స్ అండ్ స్పెన్సర్ కంపెనీనే మొదట బ్రిటన్ మార్కెట్లోకి తెచ్చి టూటీఫ్రూటీ సీడ్‌లెస్ గ్రేప్స్ పేరిట  విక్రయిస్తోంది.

## పైన్‌బెర్రీ

స్ట్రాబెర్రీ తెలుసు, బ్లాక్‌బెర్రీ తెలుసు. వైట్‌బెర్రీ తెలుసు కానీ పైన్‌బెర్రీ గురించి తెలుసా? చూడ్డానికి తెల్లని స్ట్రాబెర్రీల్లా కనిపించే ఈపండ్లు పైనాపిల్ రుచిని కలిగి ఉంటాయి. నిజానికి ఈ పండ్లను రెండు స్ట్రాబెర్రీ రకాల నుంచి అభివృద్ధి చేశారు. ఫ్రాగారియా వర్జీనియానా,  ఫ్రాగారియా చిలోన్సిస్ అనే స్ట్రాబెర్రీ రకాలను సంకరం చేసి ఈ పైన్‌బెర్రీ వంగడాన్ని సృష్టించారు. దక్షిణ అమెరికాలో మొదట వీటిపి అభివృద్ధి చేశారు. ఈ పండ్లు స్ట్రాబెర్రీలకన్నా కాస్త చిన్నగా ఉంటాయి. అయితే ఈ మొక్కలు అనేక వ్యాధుల్ని తట్టుకుంటాయట. కానీ స్ట్రాబెర్రీ పండ్లలాగా ఎక్కువ దిగుబడి ఉండదు. దాంతో అమెరికాలాంటి దేశాల్లో వీటిని పండించే ప్రయత్నాలు చేయలేదు. కానీ నెదర్లాండ్స్ బెల్జియం రైతులు మాత్రం వాణిజ్య పంటగా పండిస్తూ మార్కెట్లోకి తెస్తున్నారు.

## గ్రేపల్స్

ద్రాక్ష, ఆపిల్ కలిపి సృష్టించినదే గ్రేపల్స్ కాబోలు అనుకునేరు. నిజం చెప్పాలంటే ఇవి యాపిల్ పండ్లే. ఈ పండ్లను మిథైల్ ఆంత్రానిలేట్ నీళ్ళు కలిపిన ద్రావణంలో నానబెడతారు. దాంతో ఆ పండ్లు అచ్చంగా ద్రాక్ష రుచితో ఉంటాయి. అంతమాత్రాన వీటిల్లో చక్కెర పదార్థాలో లేదా అదనపు క్యాలరీలో  చేరతాయని భయపడాల్సిన పనిలేదంటున్నారు ఉత్పత్తి దారులు. వాషింగ్టన్ వ్యవసాయ శాఖ అనుమతితో వీటిని తయారు చేస్తూ గ్రేపల్ పేరుతో మార్కెట్లో విక్రయిస్తున్నారు.

## ప్లమ్‌కాట్లు

ప్లమ్‌లూ, ఆప్రికాట్లూ రెండింటినీ కలిపి రూపొందించినవే ప్లమ్‌కాట్‌లు. చూడ్డానికి ప్లమ్స్‌లా కనిపించినా రెండూ కలగలిసిన రుచితో ఉంటాయట. నెబ్రాస్కాకు చెందిన ఫ్లాయిడ్ జైగర్ అనే జీవశాస్త్రవేత్త ఈ హైబ్రిడ్ రకంలోనూ బోలెడు వెరైటీలను సృష్టించారు. దాంతో ఇవి గత కొన్నేళ్లుగా పండ్ల ప్రియుల్ని చవులూరిస్తున్నాయట. అయితే ఈయనకన్నా చాలా ముందే లూథర్ బర్‌బ్యాంక్ అనే వ్యక్తి ప్లమ్స్‌ని, ఆఫ్రికాట్లనీ కలిపి ప్లమ్‌కాట్ పేరుతో సృష్టించాడు. అయితే నిల్వ చేసే పద్ధతి ఆయనకు తెలియకపోవడంతో ఈ పండ్లు ఎక్కువమందికి చేరడం లేదు.

## ఆరెంజ్‌లా

ఆరెంజ్ పండ్లు తినీ తినీ బోర్ కొట్టిందా? అయితే ఈ కొత్తరకం పండు తినడానికి ట్రై చేయండి. కమలాపండు, ద్రాక్ష పండు కలిపి రూపొందించినదే ఆరెంజ్‌లా. వీటిని ప్యూర్టోరికో నిపుణులు రూపొందించారు. ఇది చూడడానికి అచ్చం ఆరెంజ్ పండు మాదిరిగానే ఉంటుంది గానీ ద్రాక్షపండు కంటే చాలా తియ్యగానూ,  మంచి రంగుతోనూ మెరిసిపోతుంది. ఈ ఆరెంజ్ తొక్క ఒలవడం కూడా సులభమేనట.

## టాంజెలో

టాంజెలో పండు కూడా చూడ్డానికి కమలాపండులానే అనిపిస్తుంది కానీ ఇది టాంజరిన్, ద్రాక్షపండ్ల మిశ్రమం. చాలా తియ్యని రుచితో కమ్మగా ఉంటాయి ఈ పండ్లు. అందుకే వీటిని హనీబాల్స్ అనికూడా ముద్దుగా పిలుచుకుంటారు. పైగా వీటిలో  విత్తనాలుండవు. తొక్క తీయడం కూడా సులభమట. ఈ హైబ్రిడ్‌లోనూ బోలెడు రకాలున్నాయి. అయితే మినియోలా టాంజెలో తర్వాతే మిగిలినవేవైనా అంటారు వాటని రుచి చూసినవారు.

## జోస్టాబెర్రీ

ఐరోపా గూస్‌బెర్రీ, బ్లాక్ కరెంట్ పండ్లతో రూపొందించినవే జోస్టాబెర్రీ. ఇవి చాలా తీయగా ఉంటాయట. ఇవే కాదండోయ్ రాస్‌బెర్రీ, స్ట్రాబెర్రీ రుచుల కలబోతతో పండిస్తోన్న స్ట్రాస్‌బెర్రీ, నిమ్మ,  కుమ్‌క్వాట్లతో తయారు చేసిన లైమ్‌క్వాట్లు , మాంటరిన్ ఆరెంజ్ రుచులు కలగలిసిన టాంజర్లు  ఇలా ఎన్నో రకాల హైబ్రీడ్ పండ్లను సృష్టిస్తూ సరికొత్తరుచుల్ని పండిస్తున్నారు నేటి ఉద్యాన నిపుణులు. ఇవన్నీ త్వరగా మన భారత మార్కెట్లోకి కూడా రావాలని కోరుకుందామా!

- రాణాప్రతాప్















**"వ్వాట్" అరిచాడు మెల్కోటే.**

**"అవును సర్...మీరు విల్లింగ్ ఇస్తే యు ఎస్‌కి వెళదామనుకుంటున్నాను.." అభ్యర్థించాడు కర్కరే.**

**"నీ రిక్విజేషన్ మెయిల్ చూశాను. వీలు కాదు కాబట్టే కదా, విల్లింగ్ ఇవ్వలేదు.." మళ్ళీ అరిచాడు మెల్కోటే.**

**"సార్...సార్.." అభ్యర్థించాడు కర్కరే.**

"మిష్టర్ కర్కరే...నీ అవసరం కంపెనీకి ఇండియాలో చాలా ఉంది. యుఎస్‌లో కాదు" తెగేసి చెప్పాడు.

"అది కాదు సర్...నా ఫియాన్సీ సమంత యుఎస్ ప్రాజెక్టుకు సెలక్టయింది. నేనిక్కడా.. ఆమె అక్కడా.." నీళ్ళు నమిలాడు.

"మరి ఆ మాట చెప్పలేదే...వెరీ సింపుల్. ఆమెని కూడా క్యాన్సిల్ చెయ్యి. ఆమె ప్లేసులో ఎవరన్నా బ్యాచిలర్ ఉంటే పంపు" చెప్పాడు మెల్కోటే.

కర్కరే గొంతులో పచ్చి వెలగ పడ్డట్టు అయింది. అతడి ముఖం చూసి...

"సరే...ఆ అమ్మాయిని పంపు. మాట్లాడాలి" అన్నాడు.

## జరిగిన కథ

పెళ్ళి, తాళి వ్యవస్థపై సమంతకు నమ్మకం ఉండదు. శ్రీకర్ ఆమెను పెళ్ళిచేసుకోవాలనుకుంటాడు. ఆమె తిరస్కరిస్తుంది. కానీ ఇటు తల్లి ఆరోగ్యాన్నీ, అటు శ్రీకర్ ప్రేమనీ కాపాడుకునేందుకు పెళ్ళికి బదులు సహజీవనానికి అంగీకరిస్తుంది సమంత. కొంతకాలం తర్వాత ఒక బిడ్డను కని తన తండ్రి కోర్కె తీర్చమంటాడు శ్రీకర్. అందుకు తిరస్కరిస్తుంది. మరో వివాహం చేసుకుని శ్రీకర్ వంశాభివృద్ధి చేసుకోవాలనే కాంక్షతో అమెరికా వెళ్ళిపోవాలనుకుంటుంది సమంత. ఆమెను ఇష్టపడుతున్న కంపెనీ బాస్‌తో సహజీవనం చేయాలనే నిర్ణయానికి కూడా వస్తుంది. బంగారంలాంటి కుర్రాణ్ణి వదులుకోవద్దని సమంత తల్లి, బంధువులు చెప్పినా ఆమె వినిపించుకోదు. శ్రీకర్‌కు మేలు చేసేందుకే తాను అతనికి దూరంగా వెళ్ళిపోతున్నానని చెబుతుంది.

ఆ తర్వాత....

మెల్కోటే పిలుపు కోసమే ఎదురు చూస్తున్న సమంత క్షణం కూడా ఆలస్యం చేయకుండా అతడి చాంబర్‌లోకి వెళ్ళింది.

సమంతను ఒక నిమిషం తేరిపార చూసి...' బ్యూటిఫుల్‌' అనుకున్నాడు మనసులో. సమంతను, కర్కరేను మార్చి మార్చి చూసి, "మిస్‌ మ్యాచ్‌" అనుకుంటూ కర్కరేని బయటకు పంపాడు. తర్వాత "చెప్పమ్మా" అన్నాడు.

"సర్‌..కర్కరే సర్‌ని కూడా యుఎస్‌ పంపితే మాకు కంఫర్ట్‌గా ఉంటుంది సర్‌" అంది.

"నిజమేనమ్మా..కర్కరే నీడ్‌ మన కంపెనీకి యుఎస్‌లో లేదు. నువ్వంటే ఎగ్జిక్యూటివ్‌ కాబట్టి నీలాంటి వారి అవసరం కంపెనీకి అక్కడ ఉంది. మేనేజ్‌మెంట్‌ స్కిల్స్‌ ఉన్న కర్కరేని పంపడం ఎలా సాధ్యం?" అన్నాడు మెల్కోటే. సమంత ముఖంలో రంగులు మారాయి.

"కాకుంటే ఒక సాయం చేయగలను. నీ ప్లేసులో మరొకర్ని సెలక్ట్‌ చేసి పంపమని కర్కరేకి చెబుతా. ఇద్దరూ ఇక్కడే హ్యాపీగా ఉండిపోవచ్చు గదా! అవునూ, మ్యారేజ్‌ ఎప్పుడు?" అడిగాడు.

"మ్యారేజ్‌ కాదు సర్‌... కంబైన్డ్‌ లివింగ్‌" అంది.

"ఓ సహజీవనమా? అయినా వయసు దాటిన కర్కరే కంటే మంచి కుర్రాడు ఎవరూ దొరక లేదా?" అడిగాడు. ఇబ్బందిగా ముఖం పెట్టింది.

"ఓహ్‌.. ప్రేమా? నిజమే ప్రేమ గుడ్డిదే" అంటూ "వెళ్ళమ్మా.. మీరు వెళ్ళండి. మళ్ళీ మీతో మాట్లాడతాను" అన్నాడు మెల్కోటే.



"యుఎస్‌లో ప్రాజెక్ట్‌ చేయాలన్నది నా ఛైల్డ్‌ డ్రీమ్‌ సర్‌! మరొకర్ని సెలక్ట్‌ చేయకండి సర్‌, ప్లీజ్‌" అంది.

మెల్కోటే ఒక నిమిషం ఆలోచనలో పడి.... "ఓకే చూద్దాం..." అన్నాడు.

మాట్లాడేది ఏమీ లేక సమంత బయటకు వచ్చింది.

మెల్కోటే ఏం మాట్లాడి ఉంటాడో అన్న టెన్షన్‌ కర్కరేలో పెరిగింది. "ఏం చెప్పాడు?" అడిగాడు బయటకి రాగానే.

"చూద్దామన్నారు సర్‌... పాజిటివ్‌గా లేరు. మీరే ఎలాగోలా కన్విన్స్‌ చేయాలి" చెప్పింది.

అంతలోనే అన్వర్‌ వచ్చి "మెల్కోటే సర్‌ పిలుస్తున్నాడు సర్‌.." చెప్పాడు.

"ఓకే అన్వర్‌...వస్తున్నాను" చెప్పాడు.

కర్కరే అడుగుపెట్టగానే "కంగ్రాట్స్‌ కర్కరే! మంచి పిల్లని పట్టావు. షీ లుక్స్‌ వెరీ ప్రెట్టీ" అన్నాడు.

కర్కరే ఒక్కసారిగా పొంగిపోయాడు. తన అదృష్టానికి గాల్లో తేలిపోయాడు.

"అయినా అంత మంచి పిల్లను నువ్వేం చేసుకుంటావు" అన్నాడు మెల్కోటే.

దబ్బున కింద పడ్డాడు కర్కరే. "అది కాదు సర్‌.." ఏదో చెప్పబోయాడు.

"నీకూ, ఆ పిల్లకూ పదేళ్ళకు పైగా తేడా ఉన్నట్టు కన్పిస్తోందయ్యా. ఆ పిల్లను ఏం సుఖపెడతావ్‌ నువ్వు. తక్కువ కాలంలోనే ఆ పిల్ల డిప్రెషన్‌కి గురయి, ఎవడో ఒక అమెరికా వాడిని తగులుకొని నీకు జెల్ల కొడుతుంది. నా మాట విని మీరిద్దరూ ఇక్కడే ఉండిపోండి. మన సంస్కృతి కోసమైనా అదుపులో ఉంటుంది. యుఎస్‌ ప్రాజెక్టుకు ఇంకొకర్ని పంపు" చెప్పాడు మెల్కోటే.

"అది కాదు సర్‌... యుఎస్‌కి తీసుకెళితేనే తను నాకు దక్కుతుంది. తనకి వేరే పర్సనల్‌ ప్రాబ్లమ్స్‌ ఉన్నాయి సర్‌..." చెప్పాడు కర్కరే నసుగుతూ.

మెల్కోటే నొసలు ముడిపడ్డాయి. ఇందులో ఏదో పితలాటకం ఉందనిపించింది. అయినా బయటపడకుండా "ఓకే, నీ సబ్జెక్ట్‌ మళ్ళీ మాట్లాడదాం. ఇతర ఇన్‌స్పెక్షన్‌ ఫైల్సు తీసుకు రండి" చెప్పాడు.

•••

"శ్రీ... జోనల్‌ ఇన్‌చార్జ్‌ మెల్కోటే వచ్చారట. మనం వెళ్ళి సమంత విషయం చెబుదాం" చెప్పాడు రమణ.

"రమణా, నేను మెల్కోటేని కలిసిన విషయం తెలిస్తే తను ఫీల్‌ అవుతుందేమో" అన్నాడు శ్రీకర్‌.

"నువ్వింత ఇన్నోసెంట్‌గా ఉంటే ఎలారా?" అన్నాడు రమణ నొచ్చుకుంటూ.

"ఇన్నోసెన్స్‌ కాదు. తన ఫీలింగ్స్‌ నీకు తెలుసు. మన వల్ల యుఎస్‌ వెళ్ళడం ఆగిపోతే తన జీవిత కాలంలో నన్ను క్షమించదు. అంతేకాదు కోపం వచ్చి అగ్రిమెంట్‌ క్యాన్సిల్‌ చేసుకొని వెళ్ళిపోవచ్చు" అన్నాడు శ్రీకర్‌ కాస్త భయంగా.

"సర్లే...నేనూ, సమీరా వెళ్ళి మెల్కోటే సర్‌కి బ్రీఫ్ చేస్తాం...ఆ తర్వాత దైవాధీనం" చెప్పాడు రమణ.

•••

గెస్ట్‌హౌస్‌లో మెల్కోటే మంచి చెడులు చూసుకునే బాధ్యతను అన్వర్‌పై పెట్టాడు కర్కరే. గెస్ట్ హౌస్ దాకా వచ్చిన కర్కరేకి "రేపటి ఇన్‌స్పెక్షన్‌కి నువ్వెళ్ళి ప్రిపేర్ కా..." చెప్పాడు మెల్కోటే.

"ఎస్ సర్.." అని మెల్కోటే లోపలికి వెళ్ళగానే అన్వర్ చేతులు పట్టుకొని..."అరే అన్వర్ భాయ్...ఎలాగైనా సమంత విషయం ఒప్పించు" బ్రతిమిలాడాడు.

అన్వర్ బెట్టు చేశాడు. 'మీరంటే చనువు ఉంది కాబట్టి మాట్లాడగలిగాను సర్... ఆయన పెద్ద సార్ కదా... ఏదైనా తేడా వస్తే ఉద్యోగం వదులుకోవడమే కదా" అన్నాడు భయం నటిస్తూ.

"ఎలాగోలా చేయరా బాబూ. నీ హౌసింగ్ ఫైలు క్లియర్ చేయిస్తాను కదా" ఆశ చూపాడు.

"అది సరే సర్.." అన్వర్ అరచేయి గీరుకోవడం చూసి వెయ్యిరూపాయల నోట్లు ఐదు అతడి చేతిలో పెట్టాడు. "ఒకే ప్రయత్నిస్తాను సర్" భరోసా ఇచ్చాడు అన్వర్.

"థాంక్స్‌రా...అన్వర్" అంటూ బయటకి నడిచాడు కర్కరే.

సాయంత్రం ఏడున్నర దాటుతుండగా సిట్టింగ్ వేశాడు మెల్కోటే.

అప్పటికే అతడి పిఏ రాబర్ట్‌ని అపాయింట్‌మెంట్ అడిగాడు రమణ. "సెవెన్ తర్వాత సార్ ఎవరినీ కలవరు. మార్నింగ్ ఎర్లీ అవర్స్‌లో రండి" చెప్పాడు రాబర్ట్.

టీవీలో ట్వంటీ ట్వంటీ మ్యాచ్ వస్తోంది. మ్యాచ్‌ని ఎంజాయ్ చేస్తూ..."వరల్డ్ కప్ గెలిచిన తర్వాత మన వాళ్ళకు కాన్ఫిడెన్స్ లెవెల్ పెరిగినట్టుందోయ్" అన్నాడు మెల్కోటే అన్వర్‌ని చూస్తూ.

అన్వర్ అతడి గ్లాసులో షాంపైన్ వంచుతూ "అవును సర్" చెప్పాడు.

"చెప్పవోయ్, ఆఫీసు విశేషాలేంటి?" అడిగాడు మెల్కోటే. క్రికెట్ మధ్యలో యాడ్స్ రావడంతో సౌండ్ తగ్గించి.

మెల్కోటే అడిగిన ప్రశ్నకు సమాధానం ఏం చెప్పాలో వెంటనే తోచలేదు. ఏం చెబితే ఏమవుతుందో అర్థం కాక కాసేపు బుర్ర గోక్కున్నాడు. పైగా అతడి హోమ్‌లోన్ అప్లికేషన్ కర్కరే చేతిలో ఉంది. కర్కరే సంతకం పెడితేనే హెడ్ ఆఫీసుకు వెళుతుంది. ఇల్లు తన చిరకాల కోరిక. కొత్త ఇల్లు కట్టుకొని తన అమ్మా నాన్నలను ఇంటికి తెచ్చి చూపాలనుకున్నాడు. అందుకే పెదవి కదపలేదు. అన్వర్ నోరు విప్పకపోవడంతో...

"ఏంటోయ్ నోరు పెగలడం లేదు" అడిగాడు.

"నా దగ్గరేముంటాయ్ సార్ విశేషాలు.." అన్నాడు నసుగుతూ.

"మీ ఇంట్లో విషయాలు కాదోయ్...ఆఫీసులో ఏం జరుగుతోంది" ఆరా తీశాడు.

ఎన్నో చెప్పాలని నాలుక చివరకు వచ్చినా బలవంతంగా ఆపుకున్నాడు.

మెల్కోటే గద్దిస్తూ, "ఏంటోయ్...మన ఆఫీసు లవర్స్ పార్కులా మారిపోయిందా?" అడిగాడు.

తత్తర పడ్డాడు అన్వర్. "అదీ... అదీ.. గోణిగాడు."

"నీ హౌస్ లోన్ శాంక్షన్ చేస్తాలేవోయ్ చెప్పు" అన్నాడు మెల్కోటే.

షాకయ్యాడు అన్వర్. ఇక అతడికి ధైర్యం వచ్చింది.

"మన ఆఫీసులో లవ్ బర్డ్స్ ఎవరూ లేరు సర్" అన్నాడు చొరవగా.

"మరి మన కర్కరే సంగతేమిటి?" అడిగాడు మెల్కోటే.

"అతడిది వన్ సైడ్ లవ్ సర్."

"మరి ఆ పిల్ల సమంత వచ్చి యుఎస్‌కి అతడితో వెళ్ళడానికి రిక్వెస్ట్ చేస్తోంది గదా" అడిగాడు ఆశ్చర్యపోతూ.

"సమంతమ్మ మంచిది సర్... వాళ్ళ ఫ్యామిలీలో ఏదో సమస్య. దాన్ని మన కర్కరే సర్ అడ్వాంటేజ్‌గా మార్చుకుంటున్నారు" చెప్పాడు అన్వర్.

"అతడికి అంత టాలెంట్ ఎక్కడిదోయ్. నాకు తెలుసుగా! ఏజ్ బార్ అయినా యంగ్‌స్టర్ అనుకుంటూ ఉంటాడు. అతడి దగ్గర విషయం ఏముంది? ఆ పిల్ల మనవాడికి ఎలా చిక్కిందో?" ఆరా తీశాడు.

"సర్... మీతో ఆమె తాలూకు విశేషాలు చెప్పడానికి ఒక వ్యక్తి వస్తున్నాడు సర్. మన రాబర్ట్ సర్ రేపు ఎనిమిదింటికి ఆయనకు అపాయింట్‌మెంట్ ఇచ్చారు సర్" చెప్పాడు అన్వర్.

"భలేవాడివోయ్! సస్పెన్స్ బాగా మెయిన్‌టైన్ చేస్తున్నావు. సినిమాలు బాగా చూస్తుంటావా?" అడిగాడు మెల్కోటే.

"అవును సర్... అయినా మీకెలా తెలుసు సర్" అడిగాడు ఆశ్చర్యంగా.

"ఇంత నాన్చేది తెలుగు సినిమాల్లోనే కదయ్యా" అన్నాడు మెల్కోటే.

"సర్...మీరు తెలుగువాళ్ళా సర్?" అడిగాడు ఆశ్చర్యంగా అన్వర్.

"నా పిల్లి గడ్డం చూసి ఫ్రెంచ్ వాడినో, ఇటలీ వాడినో అనుకున్నావా?" అడిగాడు నవ్వుతూ.

"అవును సర్... ఎవరూ ఊహించరు సర్ మీరు తెలుగు వాళ్ళని. కాకుంటే మా అందరి భరతం పట్టడానికే తెలుగు నేర్చుకున్నారనుకున్నా సార్" అన్నాడు అన్వర్.

"అందరూ అలాగే అనుకుంటారోయ్. నేను వచ్చీరాని తెలుగు మాట్లాడుతుంటాను కదా" అన్నాడు నవ్వుతూ.

"మీరు తెలుగు వాళ్ళంటే చాలా సంతోషంగానూ, థ్రిల్‌గానూ ఉంది సర్" అన్నాడు అన్వర్.

"పెద్దగా అనకోయ్. ఈ సీక్రెట్ చాలామందికి తెలీదు" అన్నాడు మెల్కోటే టీవీలో సౌండ్ పెంచుతూ. సరిగ్గా అప్పుడే సచిన్ సిక్సర్ కొట్టాడు. "ఎక్స్‌లెంట్" అని చిన్నపిల్లవాడిలాగా చప్పట్లు కొట్టాడు మెల్కోటే.

"సార్...మీది ఏ జిల్లా సర్.." అడిగాడు ఆసక్తిగా అన్వర్.

"అన్వర్...ఇప్పుడు హైద్రాబాదులో ఎవరూ తమ జిల్లాల పేర్లు చెప్పడం లేదు కదయ్యా. అయినా నేను చెబుతా. అనకాపల్లి పక్కన చిన్న కుగ్రామం మాది. మా నాన్న సుందర్రావుని మెల్కోటే అనే బ్రిటీష్ దొర చదివించాడు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఆయన లండన్‌లో సెటిల్ అయ్యి... మా నాన్నకు వంద డాలర్లు ఇచ్చాడు. ఆ డాలర్లతోనే ఆయన బిజినెస్ ప్రారంభించాడు. ఆయన బిజినెస్‌లో సక్సెస్ కాలేదు. కానీ నన్ను ఐఐటి చదివించి ప్రయోజకుణ్ణి చేశాడు. ఆయన గుర్తుగానే నా పేరులో మెల్కోటే అని తగిలించాడు. నా పూర్తి పేరు కిషోర్ మెల్కోటే. ఆ కిషోర్‌ని చాలామంది మర్చిపోయారు. ఇప్పుడు నువ్వు గుర్తు చేశావు ఇలా.." చెప్పాడు మెల్కోటే నాలుగో రౌండ్ బిగిస్తూ.

"అయినా మీరు చాలా గ్రేట్ సర్..." మెచ్చుకున్నాడు అన్వర్.

"అంత సీన్ లేదోయ్... నేను మామూలు మనిషినే... దక్షిణాది రాష్ట్రాలలో నా స్వంత రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ కాబట్టి ఇక్కడి కంపెనీకి లాస్ రాకూడదన్నదే నా ఉద్దేశం. ఏ మాటకామాట చెప్పుకోవాలి. ఇక్కడ బ్రాంచి అభివృద్ధి చెంద



డానికి కర్కరే ప్రధాన కారకుడు. వాస్తవానికి అతడడిగితే ఏదీ కాదనకూడదు. కానీ అతడిని పంపితే కంపెనీ కుంటు పడుతుందని ఆలోచిస్తున్నా..." మద్యం మత్తులో మనసులో ఉన్నవన్నీ కక్కేశాడు మెల్కోటే.

అన్వర్ ఇంకా విషయాన్ని రాబట్టాలనుకొని... "అంటే సమంతమ్మను...కర్కరే సర్‌ని యుఎస్‌కి పంపుతారా సర్..." అడిగాడు అన్వర్.

"అదే ఆలోచిస్తున్నానోయ్..." అన్నాడు సాలోచనగా మెల్కోటే.

"రేపు రమణగారొచ్చి మిమ్మల్ని కలిసే వరకూ ఏ నిర్ణయం తీసుకోవద్దు సర్" చెప్పాడు అన్వర్.

"సరేలేవోయ్! భోజనం వడ్డించు" చెప్పాడు మెల్కోటే.

"అలాగే సర్" అంటూ లేచాడు అన్వర్.

●●●

ఉదయం ఎనిమిదికల్లా రెడీ అయ్యాడు మెల్కోటే.

అంతకు అరగంట ముందే హాల్లో వెయిట్ చేస్తున్నారు రమణ, సమీరలు. బయలుదేరే ముందు శ్రీకర్‌ని రమ్మని మరోసారి అడిగారు.

"వద్దు రమణా! తను బాధపడుతుంది" మరోసారి రిజెక్ట్ చేశాడు శ్రీకర్.

నిజానికి శ్రీకర్‌కి వెళ్ళి మెల్కోటే కాళ్ళపై పడి సమంతను పంపించవద్దని బ్రతిమాలాలని ఉంది. కానీ అలా వెళితే సమంత చూసే చూపులని తాను తట్టుకోలేనన్న ఆలోచనలతోనే ఆగిపోయాడు.

రమణ ఫోన్ కోసం... మెల్కోటే స్పందన కోసం ఎదురు చూస్తున్నాడు. పోర్టికోలోకి వచ్చి శ్రీకర్ కాలుకాలిన పిల్లిలా తిరగడం సమంత గమనించింది.

"ఎవరికోసమైనా వెయిట్ చేస్తున్నారా?" అడిగింది.

"లేదు...లేదు..." అన్నాడు.

సమంత అనుమానంగా చూసింది. శ్రీకర్ ప్రవర్తన వింతగా అనిపించింది ఆమెకు. అతడి ముఖంలో గిల్టీ ఫీలింగ్స్ ఈ మధ్య కాలంలో ఎప్పుడూ చూడలేదు. గంట తర్వాత రమణ ఫోన్ చేసి శ్రీకర్‌ని రమ్మని చెప్పాడు.

ఆఘమేఘాల మీద బయలుదేరాడు శ్రీకర్. సమంత టిఫిన్ తినమన్నా అతడు వినిపించుకోలేదు.

రమణ, సమీరలు శ్రీకర్ కోసం ఎదురు చూస్తున్నారు. "ఏమన్నాడు" ఆత్రుతగా అడిగాడు శ్రీకర్.

"నన్ను పరిచయం చేసుకొని నీ గురించి మొదలుపెట్టిన వెంటనే 'అంతా నాకు తెలుసు... షీ ఈజ్ మేజర్. ఆమేం చేయాలో ఆమెకి తెలుసు కదా? యు నో 'లా' అని నిలదీశాడు" చెప్పాడు రమణ.

సమీర నిస్పృహగా "ఈ దారి కూడా మూసుకుపోయింది" అంది.

రమణ ముఖంలో కూడా అంతే డిజప్పాయింట్‌మెంట్ కనిపించింది. శ్రీకర్ ముఖం ఆరిపోయింది. అతడిలో ఒక్కసారిగా దుఃఖం పెల్లుబికింది. "లీవ్ మి అలోన్" అంటూ గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు. రమణ, సమీరలు ఇద్దరూ హడలిపోయారు. "శ్రీకర్... శ్రీకర్" అంటూ తలుపు తట్టారు.

శ్రీకర్ విసురుగా తలుపు తీసి... "రమణ పది నిమిషాలు నన్ను విడిచిపెట్టండి. నేను ఎలాంటి అఘాయిత్యాలు చేసుకోనులే" అన్నాడు.

రమణ, సమీరలు అస్థిమితంగా కదిలారు.

శ్రీకర్ గదిలో కాసేపు మౌనంగా కూర్చుండిపోయాడు. అతడికి ఏం మాట్లాడాలో, ఏం చేయాలో అర్థం కాలేదు. మెల్కోటే నిరాకరిస్తాడన్న ఆశ ఎక్కడో మినుకు మినుకుమంటూ ఉండేది. ఇక సమంతతో తన అనుబంధం ఒక జ్ఞాపకం.... అనుభూతి... ఒక శకలం... తనని ఆపే శక్తి భూమి మీద ఇక ఎవరికీ లేదు. తను ఎవరి మాటా వినదు. ఆమెకి తన మీద ఉన్నది ప్రేమా? జాలా? సానుభూతా? కనికరం చూపుతున్నట్టే ఉంటుంది. కఠినంగా మారిపోతుంటుంది. ఎందుకిలా? తల విదిల్చాడు.

అరగంట తర్వాత బయటకు వచ్చి "సారీ రమణా, మిమ్మల్ని ఇబ్బంది పెట్టాను..." అన్నాడు.

రమణ శ్రీకర్‌ని నేరుగా చూసేందుకు సాహసం చేయలేకపోయాడు.

"శ్రీకర్‌గారూ, ఎందుకు మీరలా బేలగా మారిపోయారు? తన కన్నా గొప్ప అందగత్తెలు మీకోసం క్యూలో ఉంటారు. అది దురదృష్టవంతురాలు..మరిచిపోండి..." అంది సమీర.

"అంత సులభంగా మర్చిపోతే అది ప్రేమ ఎలా అవుతుంది సమీరా? అంత సాధ్యమయ్యే పనే అయితే ఇన్ని ఆత్మహత్యలు ఎందుకు జరుగుతాయి..." అన్నాడు.

సమీర, రమణలు ఇద్దరూ అవాక్కయ్యారు.

●●●

ఇంటికొచ్చిన తర్వాత శ్రీకర్ బ్యాగ్ సర్దుకున్నాడు. ఒక చిన్న ఉత్తరం రాసి టీపాయ్ మీద పెట్టాడు. "సమంతా, నేను ఊరెళుతున్నాను. ఎప్పుడొచ్చేది చెప్పలేను. నీ శ్రీకర్". ఫ్లాట్ తాళం చెవులు వాచ్‌మెన్‌కి ఇచ్చి బయలుదేరాడు. మూడు గంటల జర్నీ తరువాత తన స్వగ్రామం రాజోలు చేరుకున్నాడు. హఠాత్తుగా వచ్చిన కొడుకును చూసి శ్రీకర్ తండ్రి సుధాకర్ రావు సంతోషపడ్డాడు.

"అలిశమ్మా! నీ మేనల్లుడు వచ్చాడే" అన్నాడు ఆనందంగా లోపలికి చూస్తూ.

లోపల వంటగదిలో ఉన్న అలిశమ్మ 'ఎవరూ' అంటూ బయటకు వచ్చింది.

"శ్రీకరూ... నువ్వటా.. వస్తున్నట్టు ఫోనైనా చేయలేదేంటి" అంది మంచినీళ్ళు చేతికిస్తూ.

"నాన్నను చూడాలన్పించింది... వచ్చేశాను అత్తా.." చెప్పాడు.

"కోడలు పిల్లను కూడా తీసుకురావాల్సిందిరా" అన్నాడు సుధాకర్ రావు.

"తనకి లీవ్ దొరకలేదు నాన్నా" చెప్పాడు శ్రీకర్.

మళ్ళీ అత్త వైపు తిరిగి..."అత్తా, నాన్న మందులు బాగా వేసుకుంటున్నాడా?" అడిగాడు.

"వేసుకుంటున్నాను లేరా" చెప్పాడు సుధాకర్

## అన్వేషణ



నిస్వార్థగుణాన్ని మదిలో నింపుకొని
నిజాయితీని మెదడులో పదిలపర్చుకొని
స్నేహ సుగంధాన్ని జేబులో కుక్కుకుని
సహన శీలతను చంకలో తగిలించుకుని
నేను మనుష్యుల కోసం అదేపనిగా
అన్వేషణ సాగిస్తున్నాను.
మనుష్యుల గణాంకాల్లకై
వీధి వీధీ వాడ వాడా ఊరు ఊరూ
గాలిస్తూ తిరుగుతున్నాను.
మనుష్యులు కనిపిస్తున్నారు
అంతలోనే కనుమరుగైపోతున్నారు
ఎవరిని చూసినా
ఎవరి వివరాలు సేకరించ తలపెట్టినా
వారి అంతరాంతరాల్లోంచి
జంతు లక్షణాలే గంతులేస్తున్నాయ్
నిండైన నిఖార్సైన మనిషి జాడ కానరాక
ఎండమావులే గుర్తుకొస్తున్నాయ్.
ఎదుటివాడి కష్టాన్ని దుర్మార్గంగా దోచేయటం,
వాడి కళ్ళల్లోని చిగురంత ఆశను
నిర్దయగా చిదిమేయటం,
బలవంతుడు బలహీనుణ్ణి,
బలహీనుడు ఇంకా బలహీనుణ్ణి
మభ్యపెట్టడం, మోసగించటం
మాటు వేయటం, మట్టుపెట్టటం
బతకటానికి మార్గాలుగా మారిపోయాయ్
కాదని వేరేదారికి మళ్ళేవారిని
వర్గ శత్రువుగానో
బతకటం చేతకాని చవట సన్నాసిగానో
జమకట్టే వికృత ప్రవృత్తి విస్తరిస్తోంది.
దేన్నైనా కొనగలిగే, దేన్నైనా అమ్మగలిగే
కసాయి వ్యాపార సూత్రాలు
అంతిమంగా సహజ మానవ సంబంధాల్ని
తెగనరుకుతున్నాయ్
ఈ విచిత్ర సంక్లిష్ట సంకట స్థితిలో
మనుష్యుల్ని నా చేతివేళ్ళ మీద
లెక్కించటం మొదలుపెడితే
వేళ్ళు మిగిలిపోతున్నాయ్.
ఐనా నేను వెతుకుతూనే ఉన్నాను
కనిపించి కనుమరుగౌతోన్న మనుష్యుల్ని
ఏరి పట్టుకుని
కాల గడియారంలో నిలబెట్టాలని
కొట్టుమిట్టాడుతూనే ఉన్నాను.

**-పతివాడ నాస్తిక్**
**సెల్: 94417 24167**

రావు.

"శ్రీకర్ నువ్వు స్నానం చేసిరా, భోజనం వడ్డిస్తా" అంది అలిశమ్మ.

"ఎప్పుడు తిన్నాడో ఏమో... త్వరగా పెట్టవే..." చెప్పాడు సుధాకర్ రావు.

"అత్త, ఇన్ని రోజులు ఇక్కడే ఉండిపోయావే... అక్కడ మావయ్య వాళ్ళకు ఇబ్బంది కదా?" అన్నాడు శ్రీకర్ లోనికి వెళుతూ.

అలిశమ్మ నవ్వుతూ "ఆయనకి ఇంకా ఆనంద మేరా. కల్లుకు అడ్డుపడే వాళ్ళుండరు కదా! కూతురు ఉందిలే, వండి వారుస్తుంటుంది" చెప్పింది అలిశమ్మ.

అలిశమ్మ శ్రీకర్ మేనత్త. సుధాకర్ రావుకి హార్ట్ ఎటాక్ వచ్చిన తర్వాత నాలుగు రోజులు దగ్గరుండి చూసుకుందామని వచ్చింది కానీ అలాగే ఉండిపోయింది.

భోజనాల సమయంలో కదిపింది. "ఏంట్రా అమ్మాయికి ఏదైనా విశేషమా?" అడిగింది.

శ్రీకర్ నవ్వాడు. "మాకు అప్పుడే పిల్ల లెందుకు అత్తయ్యా..." అన్నాడు.

"మా సలోమిని చేసుకుని ఉంటే... ఈ పాటికి ఎప్పుడో నెల తప్పేది. ఏడాది తిరగక ముందే మా అన్నయ్యకి మనవణ్ణి ఇచ్చేది" అంది.

సలోమి గుర్తుకు వచ్చింది శ్రీకర్‌కి. సలోమి అలిశమ్మ రెండో కూతురు. నర్సు ట్రైనింగ్ చదివి ఉద్యోగం కోసం ఎదురు చూస్తోంది. రెబెక్కా శిల్పంలా ఉంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే గొప్ప అందగత్తె.

అలిశమ్మకు తన అన్న ఇంట్లో ఒక్కరినైనా తన అల్లుణ్ణి చేసుకోవాలన్న కోరిక ఉండేది. దినకర్... శ్రీకర్, అరుణా... సమంతలను తమ జీవితాల్లోకి ఆహ్వా నించడంతో అలిశమ్మకు వెలితిగానే ఉండేది.

చాలాసార్లు అన్న సుధాకర్ రావుకి చెప్పి బాధ పడేది. "మనమేం చేస్తాంమే... చదివించడం వరకే మన బాధ్యత. పెళ్ళి జీవితం వాళ్ళదేగా" అనే వాడు సుధాకర్ రావు.

"ఇంకో గుడ్డు వేసుకోరా" కొసరింది అలి శమ్మ.

"వద్దత్తా..." చెప్పాడు శ్రీకర్.

"నే వడ్డిస్తాలే... లోపల వాడికి పక్క వేయవే... కాసేపు నడుం వాలుస్తాడు" చెప్పాడు సుధాకర్ రావు.

అలిశమ్మ లోపలికి వెళ్ళింది.

"దాని మాటలు పట్టించుకోకురా.." అన్నాడు సుధాకర్ రావు.

"అత్త ఆశ పడడంలో తప్పేం ఉందిలే నాన్నా" అన్నాడు శ్రీకర్.

"నేను చెప్పేది అమ్మాయి నెల తప్పటం గురించి లేరా" అన్నాడు.

శ్రీకర్ మరి మాట్లాడలేదు.

●●●

సమంత నుండి ఫోన్ వచ్చింది. "శ్రీ అంత సడన్‌గా వెళ్ళారు. మీ నాన్నగారికి ఒంట్లో ఏమైనా బావోలేదా?" అడిగింది.

"బావుంది. నాన్నను చూడాలనిపించి వచ్చాను" చెప్పాడు.

"నేను రానా?" అడిగింది.

"వద్దు... నీకు లీవ్ దొరకలేదని చెప్పాను" చెప్పాడు.

ఒక నిమిషం సమంత ఏమీ మాట్లాడలేదు. "శ్రీ... నా యుఎస్ జర్నీ గురించి ఏమైనా చెప్పారా" అడిగింది.




"చెప్పలేదు" చెప్పాడు.

"చెప్పకండి. అక్కడికెళ్ళిన తర్వాత మీకు వేరే మ్యారేజ్ చేయమని నేనే రిక్వెస్ట్ చేస్తాను" చెప్పింది.

శ్రీకర్ ఫోన్ కట్ చేశాడు. అతడికి కోపం వచ్చింది.

సమంత మళ్ళీ చేసింది. "ప్లీజ్ ఎమోషన్ కాకండి. ఆయన తట్టుకోలేరు. మరో విధంగా తెలిస్తే..." అంది సమంత.

"సమూ.. ఎవ్రీథింగ్ ఓకే! గో హెడ్... నీకెలా నచ్చితే అలా చెయ్. నిన్ను శాసించే హక్కు మాకెవరికీ లేదు.." ఫోన్ కట్ చేశాడు.

సమంత మళ్ళీ చేయలేదు.

●●●

రమణ విజయవాడ వచ్చాడు. అదే రోజు అరుణ కూడా వచ్చింది.

రమణ....దినకర్..అరుణ ముగ్గురూ సమావేశ మయ్యారు.

"మీరు మాట్లాడితే ఏమైనా ఫలితం ఉంటుం దేమో" అరుణ ముఖంలోకి చూస్తూ అన్నాడు రమణ.

అరుణ ఆలోచనలో పడింది.

"నిజమే అరుణా! అన్న చాలా సెన్సిటివ్. ఆమె వెళ్ళిపోతే తట్టుకోలేడు. ఒకసారి మాట్లాడు. అన్నయ్య మానసిక స్థితి గురించి చెప్పు" అన్నాడు.

"దినకర్...నాకున్న సమాచారాన్ని బట్టి మెల్కోటే గారిది పాజిటివ్ యాటిట్యూడే. ఆఖరి ప్రయత్నం చేద్దాం. రేపే హెడ్ ఆఫీస్‌కు అప్రూ వల్ పేపర్స్ వెళ్తాయి" చెప్పాడు రమణ.

మర్నాడు అరుణ, దినకర్‌లు మెల్కోటేని కలి శారు. ఈసారి రమణ వారితో లేడు.

అరుణ తనను తాను పరిచయం చేసుకొని పరిస్థితి వివరించింది.

మెల్కోటే ఈ విధంగా చెప్పాడు. "సమంత చాలా స్ట్రాంగ్ పర్సనమ్మా. నేను ఇతర సోర్సు ద్వారా సమాచారం సేకరించాను. శ్రీకర్ స్నేహి తుడు రమణ రావడానికి పదినిమిషాలకు ముందు నా పర్సనల్ ఫోన్‌కి సమంత నుండి కాల్ వచ్చింది. ఏపీలో నా నెంబర్‌కి కాల్ చేసేది కర్కరే మాత్రమే. అతడి ద్వారా నంబర్ సంపా దించి తను చేసింది. నేను 'ఎవరా?' అని ఆలో చిస్తూ లిఫ్ట్ చేశాను. ఆమె ఒకటే చెప్పింది. 'సర్.. శ్రీకర్‌కి నా వల్ల నష్టం జరగకూడదు. అతడు పిల్లాపాపలతో బావుండాలి. అతడి తండ్రి ఆకాంక్ష నెరవేరాలి. నేను ఈ వివాహ వ్యవస్థకు లొంగి పిల్లల్ని కనలేను. కర్కరే సార్‌ని యుఎస్‌కి పంపండి. శ్రీకర్‌కి బాధైనా... కొన్నాళ్ళకి అలవాటు పడతాడు. మీరు పాజిటివ్‌గా రియాక్ట్ కాకపోతే నేను ఈ జీవితాన్ని చాలించాలని అనుకుంటు న్నాను. ఎవరినీ సంతోషపెట్టలేని నేను బ్రతకడం కూడా వ్యర్థమేననుకుంటున్నాను. నేను చనిపోతే.. ఆ షాక్ శ్రీకర్ తట్టుకోలేడు. అతడు ఏమైనా చేసుకుంటాడు. లేక అలాగే ఉండిపోతాడు. నేను బ్రతకడమో.. చావడమో మీ చేతుల్లో ఉంది సార్ అని ఫోన్ పెట్టేసింది. నాకు మాట్లాడే అవ కాశం కూడా ఇవ్వలేదు. అందుకే రమణతో అలా మాట్లాడాను" చెప్పాడు మెల్కోటే.

అరుణ కూడా షాకై విన్నది. కొద్దిసేపు వారి మధ్య నిశ్శబ్దం రాజ్యమేలింది. కొద్ది నిమిషాల తర్వాత...

"సర్ చిన్న రిక్వెస్ట్ సర్...ఒక నెలరోజులు వారి యుఎస్ జర్నీ వాయిదా వేయండి.." అడి గింది.

"నెల కాకపోతే రెండు నెలలు వేస్తాను అమ్మా. ఆ అమ్మాయి మారుతుందా?" ఆశగా అడిగాడు మెల్కోటే.

"ట్రై టు మై లెవల్ బెస్ట్ సార్.." అంది అరుణ.

"ఓకేనమ్మా...ఆల్ ది బెస్ట్! మీ ప్రయత్నాలు మీరు చేయండి" చెప్పాడు మెల్కోటే.

"థాంక్స్ సర్.." అని బయటపడ్డారు.

**(ఇంకావుంది)**

# అన్‌బ్రేకబుల్ స్క్రీన్

వేలరూపాయలు ఖర్చుపెట్టి ఎంతో ఇష్టంగా స్మార్ట్‌ఫోన్ కొనుక్కుంటే గంటలు కూడా గడవకముందే అది చేతిలోంచో, జేబు లోంచో జారిపోయి లేదా పైనుంచి కిందపడి పగిలిపోతుంది. దాంతో మనసు వికలమై ఏపనీ చేయలేకపోతాం. అయ్యో! అంటూ బాధపడుతూ కూర్చుంటాం. ఇక అలాంటి బాధలు, మనోవేద నలు అవసరం లేదంటోంది గొరిల్లా గ్లాస్. ఫోన్ గ్లాస్ పగిలిపోతుందనే భయమే ఇక ఉండదట. అన్‌బ్రేకబుల్ ఫోన్‌స్క్రీన్లు మార్కెట్‌లోకి వచ్చేస్తా యట. మనలో అరవైశాతం మందికి ఫోన్



స్క్రీన్లు పగలగొట్టుకోవడం నిత్యం పరిపాటే. పిల్లలు ఉన్న ఇళ్ళల్లోనే ఇది ఎక్కువ. పెద్దల అజాగ్రత్త వల్ల కూడా ఇలా జరుగుతుంది. ఈ సమస్యలు పరిష్కరించేందుకు గొరిల్లా గ్లాస్-5 కొత్త వెర్షన్ మోడల్ స్క్రీన్‌లు వచ్చేస్తున్నాయి. ఎత్తుమీంచి కిందపడినా కూడా ఈ గొరిల్లాగ్లాస్ స్క్రీన్ చెక్కుచెదరదట. సాధారణంగా సెల్ఫీలు తీసుకునేటప్పుడు సెల్‌ఫోన్‌ని చేత్తో గాలిలోకి దూరంగా ఎత్తిపట్టుకున్న సందర్భాల్లో ఫోన్‌జారి పడిపోయినా గ్లాస్ ఇక పగలదన్నమాట. ఎంత బండరాతిపైన పడినా పగిలి ముక్కలవకుండా మన స్మార్ట్‌ఫోన్ సేఫ్‌గా ఉంటుందట! ఈ కంపెనీ పరిశోధకులు ఎన్నో ప్రయోగాలు చేసి ఈ కొత్త వెర్షన్ కనుగొన్నారు. 1.6 మీటర్ల ఎత్తునుంచి రాయిమీద పడినాగానీ ఈ స్మార్ట్‌ఫోన్ గ్లాసు లకు గ్యారంటీ ఉంటుందని చెబుతున్నారు. కోర్నింగ్ గొరిల్లా గ్లాస్ కంపెనీ వైస్ ప్రెసిడెంట్-జనరల్ మేనేజర్ John Bayne మాట్లాడుతూ, 165 సంవత్సరాల చరిత్రగల తమ కంపెనీ ఈ కవర్ గ్లాస్ టెక్నాలజీలో సరికొత్త పుంతలు తొక్కింద న్నారు. సరికొత్త ఆవిష్కరణల ద్వారా ప్రజల జీవితాల్లో తమ కంపెనీ మార్పులు తెస్తున్న దన్నారు. తమ పరిశోధకులు ఎన్నో రకాల ప్రయోగాలు చేసి ఈ కొత్త వెర్షన్ కనిపెట్టినట్టు చెప్పారు. ఈ యేడాది పూర్తయ్యేనాటికి ఈ కొత్త వెర్షన్ గొరిల్లాగ్లాస్ స్క్రీన్లు మార్కెట్లోకి ప్రవేశిస్తాయట. ఎంత అననుకూలమైన వాతా వరణంలోనైనా సెల్ఫీలు తీసుకోవడానికి ఈ స్క్రీన్లు ఎంతో అనువుగా ఉంటాయట.






**విశాఖ కథా తరంగాలు (సంచిక-2)**

**కథా సంకలనం:** అడపా రామకృష్ణ
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 200
**ప్రతులకు:** అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు

విశాఖ రచయితల సంఘాన్ని రాకెట్ ఇంధనంతో నింపి నడిపిస్తున్న కార్యదక్షులు రచయిత అడపా రామకృష్ణ, ఈ కృషిలో అంగర సూర్యారావు, కృష్ణారావుగారిలాంటి అనుభవజ్ఞులు ఆయనకు తోడుగా నిలవ డంతో ఈ ఏడాదిలోనే 'విశాఖ కథా తరం గాలు' పేరిట రెండు సంకలనాలను వెలువ రించి కళింగాంధ్ర రచయితల సత్తా నిరూపిం చారు. నిర్మాణాత్మకమైన రచనల ద్వారా ప్రస్తుత సమాజానికి అభ్యుదయ సాహిత్య విలువలను అందించడమే విశాఖ రచయితల సంఘం లక్ష్యం. అందులో భాగంగానే ఒక విలువైన చారిత్రాత్మక కథా సాహిత్యం అందించేందుకు చేసిన ప్రయత్నంలో నలభై కథలు సేకరించారు. తొలివిడత ఇరవై కథ లను మూడునెలల క్రితం మొదటి సంపు టంగా వెలువరించారు. ఇప్పుడు మరో 22 కథ లతో రెండో సంపుటం వెలువరించారు. 'రక్కసి బలుపు ఆగడం' శీర్షికన కథా సామ్రాట్టు కాళీ పట్నం రామారావుగారి కవితను ఆరంభపేజీ ల్లోనే ప్రచురించి తమ దిశాగమనాన్ని చెప్ప కనే చెప్పింది రచయితల సంఘం.

ఇందులోని రచయితలందరూ లోకాన్ని ఔపోసన పట్టినవారే. ఈ కథలన్నీ హృదయా లను కదిలించేవే.



**జయమ్**

నాయుని కృష్ణమూర్తి
**ధర:** 250 రూపాయలు
**పేజీలు:** 426
**ప్రతులకు:** సాహితీ ప్రచుర ణలు, సూర్యారావుపేట, విజయ వాడ-02, విజయ ప్రింటర్స్, చౌడేపల్లి-517257, చిత్తూరుజిల్లా.

కురువంశం అంతరించకుండా ఆ వంశాన్ని ఆదుకున్న వ్యాసుడు తన కళ్ళముందే బిడ్డల బిడ్డలు యుద్ధానికి తలపడడం చూసి సహించ లేకపోయాడు. జరిగిన చరిత్రకు కావ్యరూప మిచ్చాడు. ఆ కావ్యమే 'జయేతిహాసమ్. కాల క్రమంలో ఈ 'జయమ్'ను వైశంపాయనుడు 24 వేల శ్లోకాల భారతంగా తీర్చిదిద్దాడు. సౌతి శౌనకాది మునుల హయాంలో ఇది లక్ష శ్లోకా లకు మించిన మహాభారతంగా మారింది. మరి మూలకథ 'జయమ్'లో ఉన్న 8,800 శ్లోకాలను వెతుక్కోవాల్సిన పరిస్థితి వచ్చింది. ప్రముఖ రచయిత నాయుని కృష్ణమూర్తి ఎన్నో రిఫరెన్సులు సేకరించి, కృషిచేసి ఈ మూల కథకు సరళభాషలో నవలారూపం ఇచ్చారు. ఇది మనందరం తెలుసుకోవాల్సిన కథ.



**అవ్యయ** ఒరియా కవితలు

సౌభాగ్య కుమారమిశ్ర
అనుసృజన వేలూరి వేంకటేశ్వరరావు, వెనిగళ్ళ బాలకృష్ణరావు
**ధర:** 60 రూపాయలు
**పేజీలు:** 164
**ప్రతులకు:** విశాలాంధ్ర, నవచేతన, నవో దయ బుక్‌హౌస్‌లు

అర్ధశతాబ్దికాలం పైగా కవిత్వాన్ని పండిస్తున్న ఒరియా రచయిత సౌభాగ్య కుమారమిశ్ర. ఆయన ఇరువురు స్నేహి తులూ కలిసి మిశ్ర రాసిన అరవై కవిత లను తెలుగులోకి అనుసృజించారు. ఐతి హాసిక సూచనలు, కాల్పనిక, అజ్ఞేయ తావాదాలు, అద్వైతం ఈయన కవి తల్లో నిగూఢమై ఉంటాయి.

## స్వీకారాలు

**అగ్నిసుమం** వచన కవితా సంపుటి
కె.శరచ్చంద్రజ్యోతిశ్రీ
**ధర:** 60 రూపాయలు, **పేజీలు:** 62
**ప్రతులకు:** విశాలాంధ్ర, నవచేతన బుక్‌హౌస్ బ్రాంచీలు

**మెరుపు** సాహిత్యం
వారాల ఆనంద్
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 122
**ప్రతులకు:** వారాల ఇందిరా రాణి, కరీంనగర్. సెల్: 94405 01281, ప్రముఖ పుస్తక దుకాణాలు

**పిచ్చిపుల్లయ్య**
లియోటాల్‌స్టాయ్
**ధర:** 30 రూపాయలు
**పేజీలు:** 54
**ప్రతులకు:** మంచిపుస్తకం, వీధినెం.1, తార్నాక, సికింద్రాబాద్-17, సెల్: 94907 46614

**శ్రీగౌతమ బుద్ధుని సూక్తులు**
యస్.విజయబాబు
**ధర:** 20 రూపాయలు, **పేజీలు:** 56
**ప్రతులకు:** శ్రీబాలాజీ పబ్లికేషన్స్, విజయవాడ-2

-లలితా త్రిపుర సుందరి

# మరణం

## నోబెల్ కథలు

**-వ్లాడిస్లా రేమాంట్**



*వ్లాడిస్లా రేమాంట్ 7 మే 1867న పోలాండ్‌లో జన్మించారు. 1924లో సాహిత్యంలో నోబెల్ బహుమతి అందుకున్నారు. 58 ఏళ్ళ వయసులో 5 డిసెంబర్ 1925న మరణించారు.*

**"నాన్నా! లే.... వింటున్నావా? నిన్నే...లేస్తున్నావా? లేదా?" కూతురు బలంగా కుదపటంతో ముసలాయన చిన్నగా మూలిగాడు. నల్లగా ముడతలు పడి వడలిపోయినట్టున్న మొహం ఒకటి కప్పుకున్న ఉన్ని దుప్పటిలోంచి కనిపించింది. ఎన్నో ఏళ్ళపాటు తప్పకుండా వదిలివేసిన నేలరంగులో ఉంది ఆయన మొహం. కళ్ళు మూతలుపడి ఉన్నాయి. బరువుగా ఊపిరిపీల్చి వదులుతున్నాడు. సగం తెరిచిన నోటిలోనుంచి నాలుక బైటకు వేలాడుతోంది.**

"పిలుస్తున్నానా... లే" గట్టిగా అరిచింది కూతురు.

"తాతా, తాతా" మంచం పక్కనే ఓ చిన్నపిల్ల మునికాళ్ళపై నిలబడి ముసలాయన మొహం వంక చూస్తూ పిలిచింది. ఆమె చిన్నమొహం కన్నీటితో తడిసి మరింత చిన్నబోయింది. దిండు మీద తడుతూ "తాతా" అంటూ మరోసారి పిలిచింది.

"నోర్మూయ్" అంటూ అరిచి పిల్లను పక్కకు తోసేసింది తల్లి. "బైటకు పోతావా లేదా" అంటూ పక్కనున్న కుక్కను కూడా గట్టిగా కర్రతో కొట్టింది. చిన్నపిల్ల వెక్కివెక్కి ఏడుస్తూ తన చిన్ని చిన్ని చేతులతో కళ్ళు నులుముకుంటూ స్టవ్ పక్కన నిలబడింది.

"నాన్నా, నేను మంచిగా చెప్పినపుడే లేస్తావా లేదా?"

జబ్బుపడిన ముసలాయన కళ్ళు మూసుకుని పడుకునే ఉండిపోయాడు. ఆయన తల ఒక పక్కకు వాలిపోయి ఉంది. ఆయనకు బతకాలన్న కోరిక కూడా లేదు.

"పైకి లెమ్మన్నానా? ఏంటి నీ ఉద్దేశం? ఇక్కడే చచ్చిపోదామనుకుంటున్నావా! నేను బతికుండగా అది జరగదు. ఆ జూలియానా దగ్గరకి వెళ్ళు. ఆస్తి అంతా జూలియానాకే రాసి ఇచ్చావుగా! అదే చూస్తుంది నిన్ను. దాని దగ్గరకే వెళ్ళు. ఇంక లే. నేను లెమ్మన్నప్పుడే లేస్తావా లేదా?"

ముసలాయన ప్రభువుని తలుచుకుంటూ, మళ్ళీ మగతలోకి జారిపోయాడు. ఆయన మొహం చెమటతో తడిసిపోయింది. ముడతలు పడిన మొహంలో ఆందోళన కనిపించింది.

కూతురు ముసలాయన్ని పరుపు మీద నుంచీ బలంగా కిందకు లాగింది. దానితో ఆయన తలా, భుజాలూ తప్ప మిగిలిన శరీరమంతా నేల మీదకు వచ్చేసింది. అయినా ముసలాయన కలప దుంగలా చలన రహితంగా ఉండిపోయాడు.

"ప్రీస్టు... ప్రార్థన"... ఆయన చిన్నగా మూలిగాడు.

"ప్రీస్టుని నీకు నేనే ఇస్తా. నిన్ను పందుల దొడ్డిలో ఉంచి... పాపాత్ముడా... అక్కడే చద్దువుగాని" ముసలాయన చంకలకింద చేతులుంచి బలంగా ఆయన్ని లాగబోతున్నదల్లా కిటికీ పక్కనుంచీ నీడ కనపడటంతో ఆమె చటుక్కున ఆయన్ని అలాగే వదిలేసి ఉన్ని దుప్పటి కప్పింది. ముసలాయన కాళ్ళని మంచంమీదకు లాగడానికి కూడా ఆమెకు వ్యవధి లేకపోయింది. దానితో కోపంగా పరుపుని కాలితో ఒక తన్ను తన్నింది. పొరుగింటి రైతు భార్య డిజియాకోవా గదిలోకి వచ్చింది.

"ఎలా ఉన్నావు? ఏం చేస్తున్నావు?"

"ఏదో ఉన్నాను"

"ముసలాయన ఎలా ఉన్నాడు?"

"ఎట్లా ఉంటాడు? ఊపిరి కూడా తీసుకో లేకపోతున్నాడు".

"పెద్దాయనా! నేను మీ పొరుగింటామెని" ఆమె ముసలాయన మీదకు వంగి పలకరించింది.

"ప్రీస్టు" ఆయన మూలిగాడు.

"చూశావా, పెద్దాయన నన్ను గుర్తుపట్టలేదు. ఆయన ప్రీస్టుని చూడాలని అడుగుతున్నాడు. ఆయన చనిపోతున్నాడు. ఇప్పటికే సగం మృత్యుముఖంలో ఉన్నాడు. ప్రీస్టుకోసం కబురు చేశావా?"

"పంపడానికి ఎవరన్నా ఉంటేగా?"

"కానీ అంతిమప్రార్థన జరపకుండా, ఆత్మలను వదిలేయలేం"

"ఆయన్ని ఒంటరిగా వదిలి ఎక్కడికి వెళ్ళను? పైగా ఆయన కోలుకోవచ్చేమో అనిపిస్తోంది.

"లేదు. లేదు. ఆయన ఊపిరి చప్పుడు వింటున్నావా? లోపల అంతా పాడైపోయింది. పోయి నేడాది జబ్బు పడినప్పుడు మా వాలెక్ కూడా ఇలాగే అయ్యాడు".

"పోనీ ప్రీస్టు దగ్గరికి నువ్వు వెళ్ళగలవా?"

"సరే నేనే వెళతాలే. పాపం ముసలాయన! ఇంక ఎంతోసేపు ఉండడు. నేను త్వరగా వెళ్తాస్తా. వస్తా ఆంటకోవా".

డిజియాకోవా వెళ్ళగానే ఆంటకోవా గది అంతా సర్ది, చీపురుతో ఊడ్చి, అంట్ల గిన్నెలన్నీ తోమేసింది. మంచం వైపు ద్వేషం నిండిన కళ్ళతో ఒకసారి చూసి మెటికలు విరిచింది. ఆమె మొహం అంతా నిరాశతో నిండిపోయింది.

"పదిహేను ఎకరాల పొలం, పందులు, మూడు ఆవులు, సామాను, బట్టలు - వాటిల్లో సగం తన పేర్న పెట్టినా, చాలా డబ్బు వచ్చుండేది. అమ్మో... అనుకుంటూ ఆమె సర్దుతున్న గిన్నెల్ని కోపంగా గోడకేసి కొట్టింది.

"కోళ్ళు, బాతులు, దూడలు, వ్యవసాయ పని ముట్లు అన్నీ దానికిచ్చి... నీ దినం చెయ్య... నువ్వు పురుగులు పడి నాశనం కానూ. నువ్వు నాకు చేసిన ద్రోహానికి... నన్ను అనాథలా, దిక్కులేని దానిలా వదిలేసిన దానికి... ఆమె కోపంగా మళ్ళీ మంచం దగ్గరికి పరిగెత్తుకుని వెళ్ళి పరుపుని గట్టిగా లాగింది.

"నిన్నే...లే" అంటూ గట్టిగా అరిచింది. ముసలాయన కదలకుండా పడుకునే ఉన్నాడు.

"చావడం కోసమే ఇక్కడికి వచ్చావా? నీ కర్మకాండలన్నీ నేను చేయాలా? నేను బతికుండగా అలా జరగదు. నీ ముద్దుల కూతురు జూలియానా దగ్గరికి వెళ్ళి అక్కడే చావు. ఆస్తంతా దానికి కట్టబెట్టేసి, మంచాన పడేసరికి నేను సేవలు చెయ్యాలా? ఆమె మాట పూర్తికాక ముందే బెల్లుకొట్టిన చప్పుడు వినిపించింది. ప్రీస్టు వచ్చినట్టు ఆమెకు అర్థమయింది. ఆక్రోశంతో వచ్చిన కన్నీళ్ళు తుడుచుకుని ఆమె ప్రీస్టు కాళ్ళకు దణ్ణం పెట్టి పవిత్రజలాన్ని సిద్ధం చేసింది. ప్రీస్టుతో పాటు ఇంకొంత మంది వచ్చి చేరారు.

"ఏమయింది?" ప్రీస్టు అడిగాడు.

"ఏమీలేదు. అవసానదశలో ఇక్కడికి వచ్చాడు. మాకు చాలా అన్యాయం చేశాడు. అందుకే వెళ్ళలేక ప్రాణం కొట్టుకుంటోంది" ఆమె

ఏడవడం మొదలు పెట్టింది.

"నిజమే! అతను నశించకా తప్పదు. మీరు బతకకా తప్పదు" అక్కడికొచ్చినవాళ్ళు ఆమోద సూచకంగా తలలూపారు.

"నా సొంత తండ్రి...అతని కోసం నేనూ, నా భర్తా ఎంత కష్టపడ్డాం. ఎంత చెమట చిందించాం. ఒక్క గుడ్డుకానీ, కొంచెం వెన్నకానీ అమ్మి ఎరుగుదునా? అన్నీ ఆయన గొంతులోనే పోశాను. చిన్నపిల్ల నోటినుంచీ పాలు లాక్కుని మరీ ఆయనకిచ్చాను. ఎందుకంటే ఆయన ముసలి వాడు. నా తండ్రి. ఇప్పుడు ఆయన నా చెల్లెలి భర్త టొమెక్‌కి ఆస్తి అంతా కట్టబెట్టాడు. పదిహేను ఎకరాల భూమి, ఇల్లు, ఆవులు, పందులు, దూడలు, ఎద్దులబండి, సామాను - ఒకటేంటి అన్నీ... అన్నీ... ఈ లోకంలో ఎక్కడన్నా న్యాయం ఉందా?" ఆమె గోడకి చేరగిలబడి ఏడవసాగింది.

"ఏడవకు. ఏడవకు. దేవుడు దయామయుడు. ఏదో ఒక రోజుకి నీకు ఫలితం దక్కుతుంది" పొరుగింటామె ఓదార్చింది.

"ఇప్పుడిలా మాట్లాడుతూ కూర్చుంటే ఉపయోగం ఏముంది? జరగాల్సిన అనర్థం జరిగిపోయింది. ముసలాయన వెళ్ళిపోతాడు. దరిద్రం ఉండిపోతుంది" పొరుగింటామె భర్త ఆమెను కసిరాడు.

అక్కడ చేరిన వాళ్ళందరూ తలో మాట అనసాగారు. తర్వాత కొంతసేపు అక్కడ మౌనం రాజ్యమేలింది. చల్లటి గాలి మొదలయింది. దాంతోపాటే మంచు కూడా పడసాగింది.



తర్వాత అందరూ ఒకచోట చేరారు. మృత్యుముఖంలో ఉన్న ముసలాయన మంచంలో కదలకుండా పడుకుని ఉన్నాడు. ప్రీస్టు ఆయన మీదకు వంగి ఆయన నోట్లో పవిత్ర జలం పోశాడు. అందరూ మోకాళ్ళపై కూర్చుని, ప్రార్థన చేశారు. ఈ గందరగోళానికి కుక్క బెదిరిపోయి అదేపనిగా మొరగసాగింది. ప్రీస్టు ప్రార్థన ముగించి లేచి "మీ ఆయన ఏడి ఆంటకోవా?" అని అడిగాడు.

"ఇంకెక్కడుంటాడు? పనికి వెళ్ళాడు" చెప్పింది ఆంటకోవా.

ప్రీస్టు కాసేపు అలాగే నిలబడి ఇంకేం చెప్పాలో తెలీక అందరివైపు చూస్తూ వెళ్తున్నానన్నట్టు తలూపాడు. అందరూ ఆయన చేతిని ముద్దాడారు. ప్రీస్టు వెళ్ళగానే అందరూ ఒక్కొక్కరుగా వెళ్ళిపోయారు. డిసెంబరు నెల చివరి రోజులు... గాలి కాస్త తగ్గుముఖం పట్టినా మంచు విపరీతంగా పడడం మొదలుపెట్టింది. కొన్ని అడుగుల దూరంలో ఉన్నది కూడా కనిపించనంత దట్టమైన మంచు. ఏం చేయాలో తోచనట్టు ఆంటకోవా మంచంవైపు చూస్తూ ఒక్కనిమిషం అలాగే నిలబడిపోయింది. అయితే అదీ ఒక్క నిమిషమే! మరుక్షణం ఆమె ఏదో నిర్ణయించుకున్న దానిలా ముసలాయనపై కప్పిన ఉన్ని దుప్పటిని లాగి కింద పడేసింది. ముసలాయన్ని చంకలకింద చేతులు పెట్టి లేపి "మాగ్దా, తలుపుతెరు" అని గట్టిగా పిలిచింది. మాగ్దా ఉలిక్కిపడి లేచి తలుపు తెరిచింది.

"ఇక్కడికి వచ్చి ముసలాయన కాళ్ళు పట్టుకో" తల్లి మాటలతో మాగ్దా అక్కడికి వచ్చి తన చిట్టి చేతులతో తాత పాదాలు పట్టుకుంది.

"గట్టిగా పట్టుకో. బైటకు తీసుకు వెళ్ళడానికి సహాయం చేయి. దయ్యంలా అలా చూస్తావేం? గట్టిగా పట్టుకో. చెప్పింది చేయి" ఆంటకోవా పిల్లని కసిరింది.

ముసలాయన చాలా బరువుగా ఉన్నాడు. స్పృహలేని నిస్సహాయ స్థితిలో ఉన్నాడు. తనకు ఏం జరుగుతోందో తెలుసుకునే స్థితిలో కూడా లేడు. కూతురు ఆయన్ని గట్టిగా పట్టుకుని దాదాపు నేలపై ఈడ్చుకుంటూ వెళ్ళింది. ఇంటి ఆవరణలోకి వెళ్ళేటప్పటికి మాగ్దా మోయలేక పాదాలు వదిలేసింది. దానితో ఆ పాదాల రాపిడికి నేలపై పేరుకున్న మంచు రెండు దారులుగా విడిపోయింది.

ఒక్కసారిగా కొట్టిన చలిగాలికి ముసలాయనకి కాస్త స్పృహ వచ్చింది. చిన్నగా మూలగటం మొదలుపెట్టాడు.

"జూలీషా... జూలీ..."

"అరువు...అలాగే అరువు. ఎంత గట్టిగా అరవగలిగితే అంత గట్టిగా అరు. ఇక్కడ వినే వాళ్ళు ఎవరూ లేరు" అంటూ ఆమె అతన్ని దొడ్డిగుండా లాక్కువెళ్ళి పందుల దొడ్డి తలుపుని కాలితో నెట్టి తెరిచింది. ముసలాయన్ని లోపలికి లాగి గోడకానించి పడుకోబెట్టింది. అది చూసి పంది తన పిల్లల్ని వెంటేసుకుని వచ్చి అరవసాగింది.

"మాలూ, ఊరుకో... ఊరుకో" అంటూ ఆమె పందుల్ని అవతలికి తోలి తలుపు వేసేసింది. మళ్ళీ ఏదో తట్టినట్టు వెనక్కువచ్చి ముసలాయన చొక్కాని తడిమింది. చేతికి ఏదో సంచీ గట్టిగా తగిలింది. దాన్ని తీసుకుని, "ఇప్పుడు చావు దరిద్రుడా" అంటూ ముసలాయన కాలిపై ఒక తన్ను తన్ని బైటకు నడిచింది. పందులు లోపల కంగారుగా అటూఇటూ పరిగెత్తడం మొదలుపెట్టాయి. ఆమె పందులకోసం ఒక గిన్నె నిండా బంగాళదుంపలు పోసి పెట్టి ఇంట్లోకి నడిచింది.

ఇంట్లోకి వెళ్ళగానే ఆంటకోవా దీపం వెలిగించి, ఆ వెలుతురులో సంచీ చించి చూసింది. అందులో ఉన్న నోట్లని, రెండు వెండి రూబుళ్ళని చూడగానే ఆమె కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"ఇందుకేనా 'నా కర్మకాండలు మీరేం చెయ్య

క్కర్లా' అని ముసలాడు ఎప్పుడూ అంటుండేవాడు" అనుకుంటూ డబ్బులు తీసి బీరువాలో పెట్టింది.

"దేవుళ్ళారా! మీ అందరికీ నా ఉసురు తగిలి కళ్ళుపోవాలి?" అంటూ శపించింది. కుండ మూత తీసి చూసి "దేవుడా! ఇందులో చుక్కనీరు లేదు. ఈ ఇగ్నాత్‌గాడు ఎక్కడికి పోయాడో?" అనుకుంటూ బైటకు వచ్చి "ఇగ్నాత్... ఇగ్నాత్" అంటూ కేకలు పెట్టింది. అరగంట తర్వాత తలుపు చిన్నగా తెరిచిన చప్పుడైంది. ఓ తొమ్మిదేళ్ళ కుర్రవాడు లోపలికి వచ్చాడు. ఆంటకోవా తలుపు చాటున పెట్టిన కర్ర తీసుకుని "తిరుగుబోతు వెధవా! ఇంట్లో నీళ్ళు లేవు. నీళ్ళు తీసుకు రాకుండా ఎక్కడ తిరుగుతున్నావు?" అంటూ కొట్టడం మొదలుపెట్టింది.

"అమ్మా, ఇంకెప్పుడూ అట్లా చెయ్యను. కొట్టొద్దు. కొట్టొద్దు" వాడు చేతులు అడ్డుపెడుతూ ఏడవసాగాడు.

ఆంటకోవా తన కోపాన్నంతా వాడిపై చూపించింది. చివరికి వాడు కిటికీలోంచి బైటకు దూకి, వెక్కిళ్ళు పెడుతూ "నీ చేతులిరిగిపోనూ, నువ్వు చచ్చేవరకూ నీళ్ళు తెస్తే అప్పుడడుగు" అంటూ తిరిగి ఊళ్ళోకి పారిపోయాడు.

ఇంట్లో ఒక్కసారిగా నిశ్శబ్దం అలముకుంది. చిన్నపిల్ల వెక్కిళ్ళు పెడుతూ ఏడవటం మొదలు పెట్టింది.

"ఎందుకే ఏడుస్తున్నావు?"

"అమ్మా.... తాత... తాత.."

"నోర్మూయ్... నీకెందుకు" అంటూ ఆమె పిల్లను ఒడిలోకి లాక్కుని తలలో పేలు చూడడం మొదలు పెట్టింది.

కాసేపటికి ఆమె భర్త తిరిగి వచ్చాడు. అతనిది భారీ శరీరం. వస్తూనే బూట్లకు అంటిన మంచును దులుపుకుంటూ నెగడుముందు కూర్చున్నాడు. ఆంటకోవా అతనికి వేడివేడి క్యాబేజి సూప్, రొట్టె తీసుకు వచ్చి ఇచ్చింది. అతను మౌనంగా తిని "ఇంకేమన్నా ఉందా" అని అడిగాడు. ఆమె ఉదయం వండిన వంటకాలు తెచ్చి ఇచ్చింది. అది కూడా తిన్న తర్వాత అప్పుడతను గది నలుమూలలా చూసి "ముసలాయన ఏడి?" అని అడిగాడు.

"ఇంకెక్కడుంటాడు? పందులకొట్టంలో!" అంది. అతను ఆమె వంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఆయన్ని మంచంలో ఉంచి పక్కబట్టలు కూడా చెడగొట్టడం ఎందుకు? చచ్చిపోయేవాడు... ఎంత త్వరగాపోతే అంత మంచిది. నాకేమన్నా నయాపైసా ఇచ్చాడా? అసలు ఇక్కడికి ఎందుకు వచ్చినట్టు? అంత్యక్రియల ఖర్చంతా మనతో పెట్టించడానికా?" జూలియానాని వచ్చి ముసలాయన్ని తీసుకు వెళ్ళనీ, నాకేం లెక్కలేదు" అంది. లేచి వెళ్ళి, బీరువా తీసి ముసలాయన సంచి తీసుకు వచ్చి భర్త చేతిలో పెట్టింది ఆంటకోవా. సంచి తెరిచి చూసిన అతని మొహం సంభ్రమంగా మారింది. డబ్బు లెక్కపెట్టాడు.

"ఎంత ఉంది?" అడిగిందామె. ఆమెకి లెక్కపెట్టడం రాదు.

"యాభై నాలుగు రూబుళ్ళు." ఆమె కళ్ళు మెరిశాయి.

"ఇవి ఉన్నాయని నీకెలా తెలుసు?"

"ముసలాయన్ని పట్టుకుని ఈడ్చుకెళుతున్నప్పుడు చేతికి గట్టిగా తగిలింది. అనుమానం వచ్చి తడిమి చూస్తే ఇదుంది. ఇది మన డబ్బు! ఆయన మనకు చేసిన అన్యాయానికి ఇది పరిహారం" ఆమె అంది. "అవునవును. ఉంచు. ఎందుకైనా పనికొస్తుంది. నిన్న స్మోలెట్ తన ఐదెకరాలు తనఖా పెట్టుకుని వెయ్యి రూబుళ్ళు ఇవ్వగలవా అని అడిగాడు".

"నీ దగ్గర అంత డబ్బు ఉందా?"

"ఉందనుకుంటా!"

"ఆ పొలం దున్ని పంట పండిద్దామనా?"

"డబ్బు చాలకపోతే పందుల్ని అమ్మేద్దాం. స్మోలెట్ బాకీ తీర్చగలడని నేను అనుకోవడం లేదు. ఐదేళ్ళలోపు బాకీ తీర్చలేకపోతే ఆ పొలం మనది అవుతుందని లాయరుతో రాయిద్దాం. ఆ తర్వాత పొలాన్ని మనం చేజిక్కించుకోవచ్చు. ఇంతకీ ఇగ్నాత్ ఎక్కడ?"

"ఎక్కడికో పారిపోయాడు. నీళ్ళు కూడా తేలేదు" ఆమె చెప్పింది. ఆంటెక్ నీళ్ళు తీసుకు వచ్చాడు. తర్వాత కాసేపటికి ఇగ్నాత్ వచ్చాడు. అందరూ రాత్రి భోజనాలు ముగించి ముసలాయన ప్రస్తావన లేకుండా నిద్రకు ఉపక్రమించారు.

ఆంటెక్‌కు ముసలాయన గురించిన ఆలోచనలు, పొలం గురించిన ఆలోచనలతో సరిగ్గా నిద్రపట్టలేదు. అటుదొర్లి, ఇటుదొర్లి చివరికి ఎప్పటికో నిద్రపోయాడు. ఆంటకోవా ఒకసారి బీరువా తీసి డబ్బులన్నీ తనివితీరా చూసుకుని మరీ పడుకుంది.

**ఆ అక్కా చెల్లెళ్ళకు తండ్రి ఒక సమస్యగా మారాడు. ఆస్తి అంతా చెల్లెలికే కట్టబెట్టాడని అక్కకు ఆక్రోశం. అది క్రమంగా ద్వేషంగా మారింది. తండ్రి అవసాన దశలో కనీస మానవత్వం చూపించని కర్కోటకురాలుగా మారిపోయింది. తండ్రి తనకు ఇచ్చిందేమీలేదని కుతకుతలాడిపోతోంది. మరణ ఘడియల్లో ఉన్న తండ్రిని పశువుల కొట్టంలోకి ఈడ్చుకెళ్ళింది. సరిగ్గా ఆ సమయంలో ఏం జరిగింది?**

ఆ రాత్రి ముసలాయన చనిపోయాడు. కర్ర ముక్కలు, ఆకులు, కొమ్మలతో కట్టిన పందుల గుడిసె చలి నుంచీ ఏ మాత్రం రక్షణ ఇవ్వలేదు. వణుకుతున్న గొంతుతో కాపాడమని ముసలాయన వేసిన కేకలు ఎవరికీ వినపడలేదు. ముసలాయన అలాగే తలుపు వరకూ పాక్కుంటూ వచ్చి తలుపులు తెరవడానికి విశ్వప్రయత్నం చేశాడు. మృత్యువు తన పాదాల నుంచీ పైకి నెమ్మదిగా పాకుతున్నట్టు ఆయన గ్రహించాడు. ఆయన పళ్ళు చలికి గిట్టకరుచుకునిపోయి, చివరకు నోరు తెరవలేనంతగా బిగుసుకుపోయాయి. నరాలు వైరుల్లా ఉబ్బి గట్టిపడిపోయాయి. చివరికి ఆయన నురగలు కక్కుతూ తలుపులకి అడ్డంగా పడి చనిపోయాడు. తెరిచి ఉన్న ఆయన కళ్ళు మృత్యు బీభత్సానికి చిహ్నంగా ఉన్నాయి. ఆయన మొహంలో మృత్యువు గడ్డ కట్టింది.

మర్నాడు ఉదయం నిద్ర లేవగానే, ముసలాయన ఎలా ఉన్నాడో చూద్దామని ఆంటెక్ పందుల దొడ్డివైపు వెళ్ళాడు. తలుపు బలంగా నెట్టి చూసిన ఆంటెక్ అక్కడ కనిపించిన దృశ్యం చూసి భయంతో గడ్డకట్టుకుపోయాడు. ఇంట్లోకి పరిగెత్తుకుంటూ వచ్చాడు. ఆంటకోవా భర్త వంక ప్రశ్నార్థకంగా చూసి "ముసలాయన చనిపోయాడా?" అని అడిగింది.

"తలుపులకి అడ్డంగా పడి చనిపోయాడు. ఆయన్ని అక్కడ అలా వదిలేయలేం. ఆయన్ని ఇక్కడికి తీసుకు రావాల్సి ఉంటుంది'.

"ఇంట్లోకా?"

"మరి ఇంకెక్కడికి?"

"పశువుల పాకలోని గొడ్లని బైటకు వదిలేసి, అక్కడ బల్లపై పడుకోబెడదాం" ఆమె అంది. ఇద్దరూ కలిసి పందుల దొడ్డికి వెళ్ళారు. అక్కడి దృశ్యం బీభత్సంగా ఉంది. ముసలాయన శరీరం దుమ్ము కొట్టుకుని భయంకరంగా ఉంది. గిట్టకరుచుకుపోయిన పళ్ళ మధ్యనుంచీ నాలుక బైటకు వేళ్ళాడుతూ ఉంది. శరీరం అంతటా నీలం మచ్చలు... తెరిచిన కళ్ళు...

ఊరు నిద్రలేస్తున్నట్టు సందడి మొదలయింది. ఇద్దరూ అతికష్టమ్మీద ఆయన్ని మోసుకు వచ్చి బల్లమీద పడుకోబెట్టారు. ఆంటకోవా దుప్పటి తీసుకువచ్చి ముసలాయన మీద కప్పింది.

'ఎవరినన్నా తీసుకువచ్చి ముసలాయన శరీరాన్ని కడిగించాలి" ఆమె అంది.



"ఆ మూగ వాడున్నాడుగా. వాడిని తీసుకువస్తాను" అతనన్నాడు.

వాళ్ళు మౌనంగా ఏదో పేరుకు తిన్నామన్నట్టు అల్పాహారం ముగించారు. ముసలాయన్ని ఉంచిన బల్లవైపు చూడకుండానే వాళ్ళు అటూ ఇటూ తిరిగారు. అయితే అందులో మృత్యువు అంటే ఉన్న భయం తప్ప పశ్చాత్తాపం ఏమీలేదు. మూగవాడు వచ్చి శవాన్ని శుభ్రం చేసిన తర్వాత ఆంటెక్ ప్రీస్టు దగ్గరికి వెళ్ళి ముసలాయన చనిపోయిన విషయం చెప్పాడు. అంత్యక్రియలకు తన వద్ద డబ్బులేదని కూడా చెప్పాడు.

"అంత్యక్రియల ఖర్చు టొమెక్‌ను భరించమనండి. డబ్బంతా ఆయన దగ్గరికే చేరిందిగా" అన్నాడు.

ముసలాయన చావువార్త గ్రామం అంతటా పాకింది. జనం గుంపులు గుంపులుగా వచ్చి ప్రార్థన చేసి వెళుతున్నారు. మూడో రోజు అంత్యక్రియలకు కొద్ది సమయం ముందుగా ముసలాయన చిన్నకూతురు జూలియానా వచ్చింది. ఇంటి ఆవరణలో ఆమెకు అక్క ఎదురైంది. ఆమె ఆంటకోవాను పలుకరించింది.

"ఇప్పుడు వచ్చింది చూడు. ఇక్కడికి గూఢచర్యం చేయడానికి వచ్చావా? ముసలాయన ఆస్తి అంతా లాక్కుని ఆయన్ని వెళ్ళగొట్టావు. ఇప్పుడెందుకు వచ్చినట్టు? ఏ ముఖం పెట్టుకుని వచ్చినట్టు? ముసలాయన చిరిగిన గుడ్డపీలికల కోసం వచ్చావా" ఆంటకోవా చెల్లెలి మీద ఇంతెత్తున లేచింది.

"ముసలాయన కప్పుకున్న ఉన్ని దుప్పటి నాది. నేను చెమటోడ్చిన డబ్బులు పెట్టి కొన్నాను. దానికోసం వచ్చాను" చిన్న కూతురు అంది.

"తీసుకో. ఎవరిక్కావాలి నీ ఉన్ని దుప్పటి. ఓహో! నువ్వే వెతుక్కుని మరీ తీసుకుంటున్నావా? తీసుకో... ముసలాయన్ని పిచ్చాడిని చేసి ఆస్తి అంతా రాయించుకున్నావు. మమ్మల్ని మోసం చేసి..."

"ఆయన పొలాన్ని మేం కొన్నట్టు అందరికీ తెలుసు. దానికి సాక్షులున్నారు".

"కొన్నావా? మొహం చూడు. అబద్ధం చెప్పడానికి బుద్ధిలేదూ? కొందంట... కొంది. ముసలాయన దగ్గర డబ్బులు కొట్టేసి, ఆ డబ్బులు పెట్టి... చివరికి ఆయన్ని పందుల గిన్నెలో పెట్టిన తిండి తినేలా చేశావుకదే. పందులకోసం పెట్టిన బంగాళాదుంపలు తీసుకుని ముసలాయన తిన్నాడా? లేదా? ఆయన దగ్గర వాసనవస్తోంది, అన్నం తినలేకపోతున్నానని చెప్పి ఆయన్ని పశువుల పాకలో పడుకోబెట్టావు. పదిహేను ఎకరాలు... ఎంత ఆస్తి. చివరికి ఆయన్ని కొట్టను కూడా కొట్టావు కదే!"

"నోర్ముయ్. ఎక్కువగా వాగద్దు."

"వాగితే ఏం చేస్తావే దిక్కులేని అనాథ మొహమా?"

"నేను అనాథనా."

"టొమెక్ దయతలచి పెళ్ళి చేసుకోబట్టి సరిపోయింది. లేకపోతే దిక్కూమొక్కూ లేక పురుగులు పట్టి చచ్చిపోయే దానివి కదే!"

"నువ్వే దిక్కులేని దానివి"

ఇద్దరూ ఒకళ్ళమీదకు ఒకళ్ళు దూకి జుట్లు పట్టుకుని అరుచుకుంటూ కొట్టుకోవడం మొదలు పెట్టారు.

"పదిహేను ఎకరాలకి నీకు ఇదిగోనే పది హేను దెబ్బలు" ఆంటకోవా జూలియానాను కొట్టసాగింది. మళ్ళీ ఇద్దరూ జుట్లు పట్టుకున్నారు.

చివరికి ఊళ్ళోవాళ్ళు వచ్చి ఇద్దరినీ విడ దీశారు. ఇద్దరూ ఆయాసం వచ్చి వగరుస్తూ కూర్చుండి పోయి ఒకళ్ళని ఒకళ్ళు శాపనార్థాలు పెట్టుకోసాగారు.

చివరికి ప్రీస్టు వచ్చాడు. ప్రార్థన ముగిసిన తర్వాత అంతిమయాత్ర మొదలయింది. ప్రార్థన చేస్తూనే ఒకళ్ళనొకళ్ళు కోపంగా చూసుకుంటూ అక్కాచెల్లెళ్ళు శవం వెంట నడిచారు. శవం శ్మశానానికి చేరగానే మరికొంత సేపు ప్రార్థన జరిగింది. ప్రీస్టు శవపేటికను పవిత్ర జలంతో శుద్ధి చేశాడు. అందరూ వెను దిరిగారు.

టొమెక్ అందరినీ తన ఇంటికి రమ్మని ఆహ్వానించాడు. అంత్యక్రియలు టొమెక్ చేయాల్సిందేనని ప్రీస్టు చెప్పడమే దానికి కారణం. ఆంటెక్‌ను ఇంటికి రమ్మని ఆహ్వానించగా అతను శాపనార్థాలు పెట్టాడు. ఆంటెక్, సోల్మెట్, ఆంటకోవా కలిసి హోటల్‌కి వెళ్ళారు. ఆంటెక్ మద్యం తాగాడు. పొలం గురించి మాట్లాడి, భోజనం చేసి, భార్యాభర్తలిద్దరూ ఇంటికి బయలుదేరారు.

"ఆ ఐదు ఎకరాలు నావే. అందులో గోధుమ, బార్లీ పండిస్తా. బంగాళాదుంపలు పండిస్తా" అంటూ అతను అరవసాగాడు.

బైట తుఫాను గాలులు బలంగా వీస్తున్నాయి. వాటితోపాటే టొమెక్ ఇంట్లో అంత్యక్రియల తాలూకూ ప్రార్థనలు వినిపిస్తున్నాయి.

"నేను కష్టపడి పనిచేస్తా. బానిసలా పని చేస్తా. ఐదు ఎకరాల్ని పది ఎకరాలు చేస్తా. చూస్తూ ఉండు" ఆంటెక్ అదే పనిగా గొణుగుతూనే ఉన్నాడు.

ఇంటికి వచ్చిన తర్వాత ఆంటకోవా అతన్ని మంచం మీద పడుకోబెట్టింది. అతను మంచం మీద శవంలా పడిపోయి కాసేపటికి "ఇగ్నాత్" అంటూ పిలిచాడు. ఇగ్నాత్ భయం భయంగా తండ్రి దగ్గరికి వచ్చాడు.

"ఇగ్నాత్, నిన్ను పెద్దరైతుని చేస్తా. నిన్ను అడుక్కుతినే కూలివాడిని చేయను" అంటూ ఆంటెక్ పిడికిళ్ళు బిగించి మంచం మీద కొట్టడం మొదలు పెట్టాడు.

"ఆ ఐదు ఎకరాలు నావే! అవి నావి..." అంటూ అతను నిద్రలోకి జారుకున్నాడు.

నవ్య

అనువాదం: **జి.లక్ష్మి** e-mail: guttalakshmi62@gmail.com

# చార్మి కొత్త అవతారం

*హీరోయిన్‌గా పూర్తిగా తెరమరుగయినా చార్మికి సినిమా రంగం మీద ప్రేమ చావలేదు. అందుకే ఇప్పుడు పూరీ జగన్నాథ్ సినిమాలకి అమ్మాయిలను వెతికిపెట్టే అవతారం ఎత్తింది. వీరిద్దరూ మంచి స్నేహితులన్న సంగతి తెలిసిందే! స్నేహితుడి సినిమాకి మంచి మంచి హీరోయిన్లను చార్మి వెదికి పట్టుకుంటోందట! అంటే కాస్టింగ్ ఏజెంట్ అవతారమన్నమాట! పూరీ సినిమాలో హీరోయిన్ సైన్ చేయాలంటే దానికి చార్మి ఓకే చెప్పాలట! మొత్తానికి పూరీని ఏదో విధంగా కాకా పట్టి అతగాడితో ఓ సినిమా చేసే ఉద్దేశంలో చార్మి ఉందనే వార్తలు బాగానే షికారు చేస్తున్నాయి.*



# మలివయసులో స్థూలకాయమా? బేఫికర్

**వయసు మీద పడుతుంటే లేనిపోని సమస్యలు చాలా వస్తాయి. దానికి స్థూలకాయం తోడైతే ఇక చెప్పేదేం లేదు. వయసు పై బడిన తర్వాత మధుమేహం, రక్తపోటు వంటి సమస్యలతో పాటు కొందరు స్థూలకాయంతో కూడా బాధపడుతున్నారు. ఈ కాలం అలవాట్ల కారణంగా ఇలాంటి ధోరణి పెరుగుతోందని ఇటీవలి అధ్యయనాలు వెల్లడించాయి. వయసు మీదపడ్డాక బరువు తగ్గించుకోవడం శ్రమ లేకుండా అయ్యే పని కాదు.**

అయ్యో! బరువు తగ్గలేమా, ఇలా ఉండాల్సిందేనా అని బాధపడకండి. చిన్న చిన్న ఉపాయాలతో కొంత ఆలస్యమైనా సులభంగా బరువు తగ్గించుకోవచ్చునంటున్నారు నిపుణులు. మరి బరువు తగ్గడానికి ఈ చిట్కాలు ప్రయత్నించి చూడండి. శతాధిక సంవత్సరాలు హాయిగా నిండైన ఆరోగ్యంతో జీవించండి!

### మీ శరీరం ఎలాంటిది!

ఒక్కొక్కరి శరీరానికి ఒక్కొక్క స్వభావం ఉంటుంది. కొందరు ఎంత తిన్నా నాజూగ్గా బక్కగా కనిపిస్తారు. మరికొందరేమో కొంచెం తిన్నా సరే లావుగా తయారైపోతుంటారు. అందుకే మలి వయసులో స్థూలకాయం తగ్గించుకోవాలనుకునే వారు మొదట చేయాల్సిన పని వారి శారీరక స్వభావం గురించి తెలుసుకోవడం. అంటే శరీరం ఎలాంటి ఆహారం జీర్ణం చేసుకోగలదు? ఎలాంటి వ్యాయామాలు చేయడానికి సహకరిస్తుంది? వ్యాయామం చేయవచ్చా? లేదా? అనే విషయాలన్నింటినీ నిర్ధారణ చేసుకోవాలి. ఒకవేళ ఇలాంటి విషయాలపై అవగాహన లేకపోతే మనకు విశ్వాసమున్న వైద్యుణ్ణి సంప్రదించాలి లేదా వ్యాయామ నిపుణుల్ని అడిగి తెలుసుకోవాలి. అదే విధంగా ఏవైనా ఆరోగ్య సమస్యలతో బాధపడుతుంటే ఆ విషయాలన్నింటినీ వారికి చెప్పడం మరిచిపోకూడదు సుమా!

### ఆహార నియమాలు తప్పనిసరి

నిండు నూరేళ్లు ఆరోగ్యంగా జీవించాలంటే దానికి మొదటి మెట్టు ఆహారమే. నూరేళ్ళు పూర్ణాయుష్షు దాటిన వారంతా ఏక కంఠంతో చెబుతున్న మాట కూడా అదే. కేవలం ఆకలి తీర్చే ఆహారం తీసుకునేకంటే పోషక విలువలు ఎక్కువ ఉండే ఆహారం తినడమే ఆరోగ్యానికి మంచిదని నిపుణులు చెబుతున్నారు. ఈ క్రమంలో ప్రస్తుతం లభిస్తున్న కొత్తరకం కృత్రిమ ఆహార పదార్థాలు, ఫాస్ట్‌ఫుడ్‌లకు దూరంగా ఉండడమే మంచిదని సూచిస్తున్నారు. మొదటి నుంచి శరీరానికి అలవాటైన పాతకాలం వంటల్లోనే ఆరోగ్యం దాగుందని వాటిని దూరం చేసుకోవద్దని చెబుతున్నారు. మలివయసులో పుష్టికరమైన ఆహారం ఎవరికైనా ముఖ్యమే. అందుకే వైద్యుల సూచన మేరకు శరీరానికి సరిపడా ప్రోటీన్లు అధికంగా ఉండి తేలికగా జీర్ణమయ్యే ఆహార పదార్థాలనే తీసుకోవాలి. అంతేకాదు, ఏఏ పదార్థాలు తిన్నప్పుడు మనం బరువు పెరుగుతున్నామో జాగ్రత్తగా గమనించి ఆ పదార్థాలను ఎంత తగ్గించుకుంటే అంత మంచిది. అంతేకాదు, కెఫిన్ ఎక్కువగా ఉండే కాఫీ, టీ మానేయడానికి ప్రయత్నించాలి. వాటికి బదులు జావ, పాలు లాంటి పౌష్టికాహారం తినాలి. అంతేకాకుండా ఆహారంలో నూనె కూడా ఏమేరకు ఎంత శాతం వాడాలో తెలుసుకోవాలి.

### రోజూ నడవాల్సిందే

నిజం చెప్పాలంటే ఏ వయసు వారికైనా నడక ఆరోగ్యదాయకమే. అందుకే ఈ వయసులో ఏం నడుస్తాంలే అని అనుకోవద్దు. సాధ్యమైనంత వరకు ఉత్సాహంగా ఉండడానికే ప్రయత్నించాలి. నడవమన్నాం కదాని ఒకరోజులోనే ఎక్కువదూరం నడిచి మర్నాడు చతికిలబడటం కంటే, మన శక్తిని బట్టి రోజూ కొంత దూరం నడవడం అలవాటు చేసుకోవాలి. ఒకవేళ నడవడంలో ఇబ్బంది కలుగుతుంటే, ఇంట్లో ఎవరినో ఒకరిని తోడుగా వెంట తీసుకెళ్ళాలి. నడక సమయంలో కాలక్షేపం కోసం, మనం వయసులో సాధించిన విషయాలను, మనకు సంతోషం



### జన్యు ప్రభావమూ ఓ కారణమే!

కొందరు వృద్ధులు ఇప్పటికీ ఎంతో ఆనందంగా, ఆరోగ్యంగా కనిపిస్తారు. కాలుష్యం ఎంత పెరిగినా ఇప్పటికీ కొంతమంది వృద్ధులు నిండు నూరేళ్లు దాటి ఆరోగ్యంగా జీవిస్తుంటారు. ఇందుకు జన్యు ప్రభావం కూడా ఒక కారణమని నిపుణులు అంటున్నారు. కొంత మంది వయోవృద్ధులపై వీరు చేసిన సర్వేల ఆధారంగా ఈ విషయాన్ని నిర్ధారించారు.. కేవలం జన్యుప్రభావం ఒక్కటే కాదు, ఇతరత్రా కారణాలు కూడా ఉంటాయని వారు వెల్లడించారు. అందుకే కొందరు ఎన్ని ప్రయత్నాలు చేసినా కానీ సంపూర్ణంగా కోలుకోలేకపోతున్నారంటే జన్యు ప్రభావం కూడా కొంతవరకు కారణంగా భావించవచ్చు.

కలిగించిన సందర్భాలను గురించి, మీ జీవితంలో జరిగిన అరుదైన సంతోషకర సంఘటనల గురించి మాట్లాడుతూ వెళితే నడకమీద అనాసక్తి ఉండదు. అసలు అలసటే తెలియదు. అలాగే గత స్మృతులను ఇతరులతో పంచుకున్న వారవుతారు. . రోజూ ఉదయం అరగంట లేదా సాయంత్రం అరగంట ఆహ్లాదకర వాతావరణంలో నడవడంవల్ల అటు ఆరోగ్యానికీ ఇటు మనసుకీ మంచిది. అలాగే అప్పుడప్పుడు మీ మనవడినో మనవరాలినో తోడు తీసుకు వెళ్లొచ్చు. ఫలితంగా వారికీ నడక అలవాటవుతుంది. మీ అనుభవాల సారం కూడా వారికి అందుతుంది.



### తినడం మానేయకండి

చాలామంది బరువు తగ్గాలన్న కుతూహలంతో తగినంత ఆహారం తినడం మానేస్తారు. లేకుంటే తినాల్సిన దానికన్నా తక్కువ తింటారు. అయితే ఈ రెండు పద్ధతులు ఏమాత్రం ఆరోగ్యదాయకం కాదు. ఇలా చేయడంవల్ల బరువు ఇంకా పెరిగే అవకాశాలున్నాయి లేకుంటే పోషకాహార లోపంతో నీరసంవచ్చి వేరే సమస్యలకు దారి తీసే అవకాశాలున్నాయి. అందుకే ఆహార సమతౌల్యం పాటించడం తప్పనిసరి అని పోషకాహార నిపుణులు సూచిస్తున్నారు. ఎప్పుడు ఏవేళ ఏది తినాలో ఆ సమయానికి ఆ ఆహారం తప్పనిసరిగా తీసుకోవాలి. అంతేగానీ పూర్తిగా ఆహారం తీసుకోవడం మానేయడం లేదా తక్కువగా తినడం చేస్తే మొదటికే మోసం వస్తుంది.

### ఆయుర్దాయం ఎక్కువే!

మగవారితో పోల్చితే మహిళల జీవన ప్రమాణం ఎక్కువే అని ఇటీవలి కొన్ని పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. ఎవరైనా సరే నిండు నూరేళ్ళు జీవిస్తారని జీవశాస్త్రం చెబుతుంది. అయితే కాలక్రమేణా అది అరవై సంవత్సరాలకు తగ్గుతూ వచ్చింది. ఎవరు ఎక్కువ కాలం జీవిస్తారన్న విషయంపై కాలిఫోర్నియా విశ్వవిద్యాలయ బృందం చేసిన అధ్యయనంలో మహిళల ఆయుర్దాయం ఎక్కువగా ఉండటం గమనించారు. మానసిక ఒత్తిడి, కుటుంబ సమస్యలతో పాటు చెడు అలవాట్లు మగ వారి జీవిత కాలాన్ని తగ్గిస్తున్నాయట. మహిళల్లో ఉండే ఓర్పు, వారి శరీర తత్త్వం దీర్ఘకాలిక జీవనానికి కారణమవుతున్నాయని ఇటీవలే పరిశోధకులు వెల్లడించారు.



### సానుకూల ఆలోచనే ముఖ్యం

వృద్ధులైనా సరే చాలా మంది ఉదయం లేచినప్పటి నుంచి రాత్రి పడుకునే వరకూ ఎన్నో పనులు చేస్తుంటారు. ఈ సమయంలో కొన్ని చికాకులు, బాధలు కూడా ఉంటాయి. అందుకే చేస్తున్న ప్రతి పనిని సానుకూల దృక్పథంతో చేస్తే ఎంతో ఉత్సాహంగా ఉండగలుగుతారు. దీనివల్ల మానసిక ప్రశాంతత లభిస్తుంది. ఎందుకు చెప్తున్నామంటే ఇలా మానసికంగా కుంగుబాటుకు గురైనవారు కూడా ఊబకాయం బారిన పడుతున్నట్లు అనేక పరిశోధనలు వెల్లడించాయి. అందుకే మానసికంగా దృఢంగా ఉండడానికి ఎల్ల ప్పుడూ ప్రయత్నించండి. జీవితానికి సంబంధించి ఏ నిర్ణయం తీసుకున్నా అందులోని అనవసర అనుమానాలను పక్కన పెట్టి సానుకూల పరిష్కారం లేదా అందరికీ ఇష్టమయ్యేరీతిలో ఏం చేయాలనే దానిపై మాత్రమే ఏకాగ్రత నిలపడం ఆ దిశగా సానుకూల దృక్పథంతో ముందుకు వెళ్ళడం నిండు నూరేళ్ళ ఆరోగ్య రహస్యాలలో ఒకటి.

### వ్యాయామం తప్పనిసరి

వ్యాయామం ఏ వయసు వారికైనా అత్యవసరం. శరీరానికి వీలైనప్పుడల్లా వ్యాయామాలు చేయాలనేది చాలామంది వృద్ధులు చెబుతున్న మాట. వ్యాయామం ఆరోగ్యానికి మంచిదని తెలిసీ దాన్ని పాటించే వృద్ధులు చాలా తక్కువే. కొందరికి శరీరం సహకరించదు, మరికొందరికి ఈ వయసులో ఏదైనా అవుతుందనే భయంతో చేయరు. అయితే గతంలో వ్యాయామం చేసిన అలవాటున్నవారు దానిని కొనసాగించవచ్చు. ఈ విషయంలో ఏవైనా భయాలుంటే సంబంధిత వ్యాయామ నిపుణులను సంప్రదించి మీ శరీర తత్వానికి అనుగుణంగా మలి వయసులో ఎలాంటి వ్యాయామాలు చేయాలో అడిగి తెలుసుకోండి. ఆరోగ్యానికి హాని కలిగించే వ్యాయామాలకు దూరంగా ఉండండి. వ్యాయామం అంటే కేవలం శరీరానికి సంబంధించినదే కాదు మనసుకు సంబంధించినది కూడా. అందుకే రకరకాల మైండ్‌గేమ్స్ ఆడండి. ఈ విధంగా మనసుకు, శరీరానికి పని చెబుతుంటే మీలో వృద్ధాప్యం వచ్చిందన్న విషయమే గుర్తు రాకుండా చలాకీగా ఉంటారు.

### యోగ సాధన

మలివయసులో బరువు తగ్గించుకోవడానికి మరో మంచి మార్గం యోగసాధన. అయితే ఈ వయసులో అందరూ అన్ని ఆసనాలు వేయలేరు. అందుకే మంచి నిపుణులను నియమించుకుని వారి సహాయంతో వీలైనన్ని సులభతరమైన ఆసనాలు వేయడానికి ప్రయత్నించాలి. అలాంటి ఆసనాల్లో ఏవి మీ క్యాలరీలను కరిగించడానికి ఉపయోగపడతాయో తెలుసుకోవాలి. వాటిని రోజూ అభ్యాసం చేయాలి. ఒక్కరే చేయలేకుంటే ఎవరి దగ్గరైనా ట్రైనింగ్ తీసుకుంటే మంచిది. ఇలా చేయడం వల్ల బరువు తగ్గడమే కాదు శరీరం దృఢంగా తయారవుతుంది. ముఖ్యంగా వృద్ధాప్యంలో యోగ సాధన, బరువును తగ్గించు కోవడానికే కాకుండా మానసిక రుగ్మతలను దూరం చేయడానికి కూడా ఉపయోగపడుతుంది.

- నివేదిత

# హవేలీ




-ఎస్. ఘటికాచలరావు సెల్:90031 41474

**మరోవైపు రాఘవ అంతర్ధానమవడం అతన్ని తీవ్రంగా కలవరపరుస్తోంది. అతని దుస్తులు కనిపించినా అది నమ్మదగిన విషయమనిపించలేదు. 'చిన్నచిన్న తగాదాలకే ప్రాణాలు తీసేంతటి దుర్మార్గుడా రవీంద్రవర్మ? అసలు వాడే బతికిలేడంటే, ఇతనికి ఫోన్ చేసిందెవరు? ఒకవేళ అతను బతికేఉన్నా తనను తప్పుదోవ పట్టించేందుకు ఇదంతా గ్రామస్థులు ఆడుతున్న నాటకమా?' తలనిండా ఆలోచనలు చెదురుమదురుగా ముసురుకుంటున్నాయి.**

'ప్రథమ కర్తవ్యం రాఘవను వెదకడం. అయితే ఎక్కడ వెదకాలి? గ్రామస్థులంతా ముక్తకంఠంతో రవీంద్రవర్మ చనిపోయాడని అంటున్నారు. అది నిజమా? కాదా? నిర్ధారించుకుంటే మిగతా విషయాలన్నీ తెలిసిపోతాయి. అదే నిజమైతే ఫోన్ చేసిందెవరు?' అనుకుంటూ ఇంటిదారి పట్టాడు. కొంతదూరం వచ్చాక ఏదో ఆలోచన వచ్చినవాడిలా మళ్ళీ వెనక్కు స్టేషన్‌లోనికి వెళ్ళాడు.

"...అతనికేదో అనుమానం వచ్చినట్టుంది. ఆరా తీయడం ప్రారంభిస్తే మీ అబ్బాయి, మన ఎమ్మెల్యేగారి అబ్బాయి అందరూ ఇరుక్కుంటారు. తరువాత మీ ఇష్టం" అంటూ రమణమూర్తి ఎవరితోనో గుసగుసగా ఫోన్లో మాట్లాడుతున్నాడు.

హఠాత్తుగా దివాకర్ ప్రత్యక్షమవడంతో అతను తడబడి రక్కున ఫోన్ పెట్టేశాడు. అతని పునరాగమనం రమణమూర్తి ఊహించనిది. అప్పటికీ స్టేషన్ బయటికి వచ్చి దివాకర్ కనుమరుగయ్యేంతవరకూ చూసి వచ్చాక ఫోన్ చేశాడు.

దివాకర్ రమణమూర్తి వంక తీక్షణంగా చూశాడు. అతనికి ఏదో సందేహం కలిగింది. 'మీ అబ్బాయి...' అంటే అతనెవరితో మాట్లాడుతున్నాడో అర్థం కాలేదు. పైగా ఎమ్మెల్యే కొడుక్కి కూడా సంబంధం ఉందట. మెల్లగా వచ్చి టేబిల్ మీద కూర్చున్నాడు.

"ఎవరితో మాట్లాడావు?" అతనికి మర్యాద ఇవ్వడం అనవసరమనిపించింది.

గుటకలు మింగాడు రమణమూర్తి.

"చెప్పకపోతే ఇప్పుడు నా కొడుకును నేను వెదుకుతున్నట్టే మీ ఇంట్లో వాళ్ళు నిన్ను వెదుకుతారు" ఒక్కొక్క మాట నొక్కి పలికాడు కళ్లల్లో కళ్ళు పెట్టి చూస్తూ.

"బంగారమ్మతో" తడబడుతూ జవాబిచ్చాడు.

"అంటే... వాడు పైడి బిల్డర్స్ యజమాని కదూ".

"అవును. వాళ్ళ కొడుకు, ఎమ్మెల్యే వీరభద్ర కొడుకూ ఇంకా అరడజనుమంది ఉన్నారు. వీళ్ళంతా ఒక గుంపు. అంతా స్థితిమంతులే. పాతికేళ్ళలోపు వాళ్ళే. తండ్రులు తాతలు సంపాదించింది తగలబెడుతూంటారు. ఈ మధ్యనే కొంతకాలంగా రవీంద్రవర్మ వీళ్ళతో సహవాసం చేశాడు. పేరుకు రాజవంశమైనా వాడు అక్షరం ముక్క కూడా రాని పల్లెటూరి బైతు. ఏదో పేరుకు చదువుకున్నాడంతే. రత్నగిరి సంస్థానం వాడి సొంతం. వీళ్ళతో జట్టుకట్టడానికి అదొక్కటే వాడి అర్హత. హవేలీలో అరాచకాలు ఎక్కువయ్యాయని ఎవరో ఒక అజ్ఞాతవ్యక్తి నుంచి సమాచారం వచ్చింది. రత్నగిరికి వెళ్ళి ఒకసారి అతన్ని హెచ్చరించి కూడా వచ్చాం. అయితే ఇక్కడి పెద్దలు కలుగజేసుకుని కేసు ముందుకు కదలకుండా మా చేతులు కట్టేశారు. ఆ పెద్దల్లో ముఖ్యమైన వాడే బంగారమ్మ".

అంతా విన్నాక కాసేపటికి మెల్లగా పెదవి విప్పాడు దివాకర్.

"నేను మరీ వాళ్ళంత నీచుణ్ణీ, దగుల్బాజీని కాకపోయినా ఉత్తముణ్ణేమీ కాదు. నా వ్యాపార పునాదులు కూడా అన్యాయాల మూలస్తంభాల మీదే లేచాయి. అయితే నేనింకా వాళ్ళంత నీచానికి దిగ

**జరిగిన కథ**

పాడుబడిన హవేలీ వైపు కన్నెత్తికూడా చూసేందుకు ఆ ఊరివాళ్ళు భయపడతారు. ప్రజలు దైవంగా భావించే ఆ ప్యాలెస్‌లో ఉండే మహారాజా కుటుంబంలోవారంతా ఒకొక్కరూ అదృశ్యమైపోవడంతో ఆ ప్యాలెస్ పాడుబడి దయ్యాలమహలుగా పేరుపడింది. ఆ ప్యాలెస్ నుంచి ఆర్తనాదాలు వినిపిస్తూ ఉంటాయి. ఆ ఊరికి అతిథిగా వచ్చిన విష్ణు ఆ రహస్యం కనిపెట్టేందుకు ప్యాలెస్‌లో ప్రవేశించి అక్కడ హత్య జరుగుతున్న దృశ్యం చూస్తాడు. ఆ శవం, ఆ మనుషులు క్షణాల్లో మాయం కావడంతో దిగ్భ్రాంతికి గురవుతాడు. అదృశ్యమైపోయిన తన కొడుకు జాడకోసం మహలులోకెళ్ళిన క్వారీ కాంట్రాక్టర్ దివాకర్ అక్కడనుండి ఏవో అక్రమవ్యాపారాలు సాగుతున్నట్టు గ్రహిస్తాడు. **ఆ తర్వాత.....**



జారలేదు. ఎందుకంటే ప్రస్తుతం నాకొచ్చే లాభాలతో నేను తృప్తిగా ఉన్నాను. ఒక్కటి మాత్రం గుర్తుంచుకో. ఏ వ్యాపారీ నష్టాన్ని ఇష్టపడడు. నా కొడుకు నా పంచన చేరకపోతే అది నాకు జరిగే నష్టం. అదే జరిగితే, నష్టపరచిన వాణ్ణి అష్టకష్టాలు పెట్టి జీవితం మీద విరక్తి కలిగేలా చేస్తాను. గుర్తుంచుకో. నీకు అండగా ఉండే పెద్దవాళ్ళకు ఈ విషయం ముందుగా చెప్పు" అనేసి పెద్ద పెద్ద అంగలతో బయటికి నడిచాడు దివాకర్.

బయటికి వచ్చాక బహుశా ఇక తన కొడుకుని వెదకడం వృథా అన్న విషయం పూర్తిగా అర్థమైపోయింది దివాకర్‌కు. భారమైన హృదయంతో ఇంటిముఖం పట్టాడు. గుండెను పిండే బాధ. దుష్టజన సాంగత్యం ఉంటే పరిణామం ఏమిటో తెలుస్తుంది. కానీ తాను కూడా ఇన్నాళ్ళుగా చేస్తున్నది అదే. ఓ మోస్తరుగా కబ్జాలు, బెదిరింపులు చేసి తన వ్యాపారాన్ని స్థిరపరచుకున్నాడు. అందుకోసమే నలుగురిని ప్రత్యేకంగా ఉంచుకున్నాడు. తనదాకా వస్తేగాని తెలియదన్న మాటలకు అర్థం అర్థమైంది. కానీ అది చాలా ఆలస్యంగా అర్థమైంది. అప్పటికే పరిస్థితి చేయి దాటిపోయింది.

ఇప్పుడు తను పడే బాధ ఒక రకమైనది. అయితే తన బారిన పడ్డవాళ్ళు కూడా వేరువేరు పరిస్థితుల్లో వేరువేరు విషయాలకు రకరకాల బాధలు అనుభవించి ఉంటారు. బహుశా వాళ్ళ శాపమే ఈరోజు ఈ పరిస్థితి కల్పించిందా? ఇప్పుడు వాళ్ళందరినీ సంతోషపెడితే శాపవిమోచనం కలుగుతుందా? అలా సంతోష పెట్టడం సాధ్యమా?

ముఖం వేలాడదీసుకుని వచ్చిన భర్తను చూసిన హేమకు పరిస్థితి అర్థమైంది. మౌనంగా రోదించడం తప్ప మరేమీ చెయ్యలేకపోయింది. ఆమె మానసిక పరిస్థితి ఇంచుమించు అలాగే ఉంది. చేసిన పాపాలకు ఫలితం అనుభవించి తీరాలి. అందుకు ఎవరికీ మినహాయింపు లేదన్న విషయం స్పష్టం. ఆమె దివాకర్‌ను పలకరించలేదు. పరామర్శించలేదు. నిర్వేదంగా, అసహ్యంగా ఒక చూపు చూసి లోపలికి వెళ్ళిపోయింది.

మరునాడు ఉదయం పేపర్లలో 'అదృశ్యమైన ప్రముఖుల సంతతి సంఖ్య ఏడుకు చేరుకుంది' అన్న వార్త పెద్ద అక్షరాలతో ప్రముఖవార్తగా నిలిచింది.

•••

అదే సమయంలో అక్కడికి నాలుగు కిలోమీటర్ల దూరంలో బంగారమ్మ బంగళాలో ఫోన్ మోగింది. సెల్‌ఫోన్ తీసి స్పీకర్ ఆన్‌చేశాడు బంగారమ్మ.

"ఇప్పటికి ఏడుగురయ్యారు. ఇంకా ఐదు గురున్నారు. వాళ్ళందర్నీ ముగిస్తాను. అమాయకులైన ఆడపిల్లల కన్నవాళ్లను గుండెకోతకు గురి చేసినందుకు చేతికందిన యువతను మత్తు మందుకు బానిసలుగా చేసి వాళ్ళ జీవితాలను నాశనం చేసినందుకు మీరు జవాబు చెప్పి తీరాలి. వాళ్ళందర్నీ ముగించేవరకూ ఈ యజ్ఞం, నరమేధం ఆగదు" ఫోన్ కట్ అయింది.

ఫోన్ వంక నిర్లక్ష్యంగా చూశాడు బంగారమ్మ. అతనికెదురుగా కూర్చున వీరభద్ర అదోలా



చూశాడు అతనివంక. అతని ముఖంలో ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది.

“మనం చేసే వ్యాపారంలో ఇలాంటి బెదిరింపులు సహజమే. దాన్ని పట్టించుకుంటే వ్యాపారం చెయ్యడం సాధ్యం కాదు” అన్నాడు చుట్ట వెలిగించుకుంటూ.

“ఎవరా ఫోన్ చేసింది?”

“ఏదో నంబరుంది. పరిచయం లేదు. వాళ్ల బాధలు, ఇబ్బందులు వాళ్ళకుంటాయి. దానికి మనమేం చెయ్యగలం. మీరు ఇవన్నీ మనసుకు పట్టించుకోగూడదు. అలా చేస్తే అశాంతే మిగులుతుంది” వేదాంత ధోరణిలో మాట్లాడాడు బంగారమ్మ.

అయితే అతని చూపు మాత్రం వీరభద్ర హావభావాల మీదే ఉంది. అతను చేతులు నులుముకోవడం కళ్ళు, నొసలు చిట్లించడం అన్నీ నిశితంగా గమనిస్తున్నాడు.

‘నీకేం. పెళ్ళీ పెటాకులూ లేవు. తోబుట్టువులూ లేరు. సంసారమంటే ఏమిటో తెలీదు. కన్నబిడ్డలు కనబడకుండా పోతుంటే, నీకేం తెలుస్తుంది”.

“ఒంటరిగాడు గదా, వీడికేం తెలుసు సంసారం గురించి, కుటుంబం గురించి అనుకుంటున్నావా భద్రా” అతనన్న మాటలకు ఉలికిపడ్డా, తన ఉలికిపాటు స్పష్టంగా తెలిసినా జవాబివ్వలేదు వీరభద్ర.

“నీ మనసులో ఇప్పుడుండే ఆలోచన ఇదేనని తెలుసు. ఓ విషయం గుర్తుంచుకో. వరదొస్తుందని తెలిసీ నదిలో దూకాం. ఈదక చస్తామా? ఈదకపోతే చస్తాం”.

అతని డైలాగు విని పక్కనున్న ఇద్దరు ముగ్గురు అనుచరులు ముసిముసి నవ్వులు నవ్వారు. అది చూసి బంగారమ్మ కూడా నవ్వాడు.

“ఏరా, ఏదో సినిమా డైలాగులా ఉందా? నేను చెప్పింది పచ్చి నిజంరా!”

చప్పున వాళ్ళ నవ్వులు ఆగిపోయాయి.

వీరభద్ర మాత్రం ఇంకా సీరియస్‌గానే ఉన్నాడు. ఇప్పటివరకూ ఏడుగురిని మాయం చేశాడు. ఇక మిగిలింది ఐదుగురనీ లెక్క కూడా చెప్తున్నాడు.

ఆ ఐదుగురిలో తన కొడుకు కూడా ఉన్నాడు. అంటే తను కూడా ఇక రోజులు లెక్కబెట్టాల్సిందే నన్నమాట. ఇప్పుడు వాణ్ణెలా కాపాడుకోవడం అన్నదే అతని ఆలోచన.

“వీరభద్రం, మరీ విపరీతంగా ఆలోచించొద్దు. నీ కొడుక్కేమీ కాదు. మన చేతికి మకిలి అంటకుండా మనం చేసేదంతా చేసి, అంతా ఆ రవీంద్ర వర్మ నెత్తినే కట్టబెట్టేద్దాం. యూ డోంట్ వర్రీ” అంటూ బిగ్గరగా నవ్వేసి చుట్ట ఆర్పేశాడు.

“అది కాదు. నాలుగు రోజుల క్రితం మా వాడు కూడా ఎందుకో చాలా ఇబ్బందిగా ఉండటం చూశాను. దానికి దీనికి ఏదో సంబంధం ఉంది. ఇన్నాళ్ళూ లేనిది ఇప్పుడు వెంట వెంటనే ఇలా జరగడం చూస్తే సమస్య తీవ్రంగా ఉన్నట్టుంది”.

“చెప్పాను గదా. యూ డోంట్ వర్రీ. అన్నీ సర్దుకుంటాయి. సర్దేస్తాం” అచంచలమైన విశ్వాసం కనబడిందతని మాటల్లో. అన్యమనస్కంగానే వీరభద్ర లేచి బయటికి నడిచాడు.

**బంగారమ్మ ఇంట్లో ఫోన్ మోగింది. హలో అన్నాడతను. ఇప్పటికి ఏడుగురు పూర్తయ్యారు. ఇంకా ఐదుగురు ఉన్నారు. వాళ్ళని కూడా ముగిస్తాను. వాళ్ళందరినీ ముగించేవరకు ఈ యజ్ఞం ఆగదు, కానీ మీరు మాత్రం జవాబు చెప్పితీరాలి అని ఠక్ మని ఫోన్ పెట్టేసిందా కంఠం. బంగారమ్మ ఎదురుగా కూర్చున్న వీరభద్ర మాత్రం భయపడ్డాడు. ఇంతకీ ఆ ఫోన్ చేసిన వ్యక్తి దేనికి జవాబు చెప్పమని అడిగాడు? అతడికేం కావాలి?**

‘ఏదేమైనా ముందుగా తన కొడుకును కొన్నాళ్ళపాటు ఎక్కడికైనా వెళ్ళిపొమ్మని చెప్పాలి. ఆర్నెల్లపాటు కంటికి కనబడకుండా పోతే పరిస్థితులు సద్దుమణిగాక మళ్ళీ తిరిగి రావచ్చు’ అనుకుంటూ వెంటనే ఫోన్ తీసి కొడుక్కు ఫోన్ చేశాడు.

“ఒరేయ్ ప్రకాశ్, ఉన్నపళంగా బయలుదేరి నువ్వెటైనా వెళ్ళిపో. మళ్ళీ నేను చెప్పేంతవరకూ ఇక్కడికి రావద్దు. నీక్కావలసినంత డబ్బు నీ ఎకౌంట్లో వేసుంచుతాను. కావల్సినప్పుడు తీసి వాడుకో. ఎట్టిపరిస్థితుల్లోనూ ఇంటి వైపు రాకు”.

“ఏంటి డాడ్! మరీ ఇంతగా భయపడితే ఎలా? ఆల్రెడీ ఒప్పుకున్న కన్సైన్మెంట్ వెంటనే డెలివరీ చెయ్యాలి. మరొక్క వారమే గడువు. లేకుంటే నేనెక్కడున్నా వెదికి మరీ ఫినిష్ చేస్తారు. నేనెక్కడికీ వెళ్ళలేను. వెళ్ళను. రెండ్రోజుల క్రితమే రవీంద్రవర్మ నుంచి ఫోన్ వచ్చింది. రేపు ఎట్టి పరిస్థితుల్లోనూ రత్నగిరికి వెళ్ళాలి”.

ఉలికిపడ్డ వీరభద్ర. “నీకేమన్నా మతిపోయిందా? విషయం అర్థం చేసుకోవేం? మొన్ననే ఆ దివాకర్ కొడుకు రాఘవ కనబడకుండా పోయాడు తెలుసా? ఇప్పటికి ఏడుగురు కనబడకుండా పోయారట. ఆ విషయమన్నా తెలుసా? అందులో ఇద్దర్ని చంపేశారట. మీ అందరినీ ఒక్కొక్కరుగా విడగొట్టి అంతం చేయడమే పనిగా పెట్టుకుని ఎవరో చేస్తున్నారిదంతా. నాకేమో ఆ రవీంద్ర వర్మ మీదే అనుమానంగా ఉంది”.

“డాడ్. అవన్నీ ఉత్తుత్తి పుకార్లు. మాకెవ్వరికీ ఏమీ కాలేదు. మేమంతా క్షేమంగానే ఉన్నాం. ప్రస్తుతానికి ఇద్దరు మాత్రం మాకెదురు తిరిగినందువల్ల మేమే వాళ్ళను లేపేశాం. మమ్మల్నెవరూ ఏమీ చెయ్యలేరు. రెండ్రోజుల క్రితం రాఘవతో బాటు నేను కూడా రవీంద్రవర్మను కలిశాను. ప్రస్తుతం రాఘవ నాతోనే ఉన్నాడు. రేపెల్లి మళ్ళీ కలవాల్సి ఉంటుంది. కాబట్టి నువ్వేమీ కంగారు పడకు. నన్ను కంగారు పెట్టకు. ఫోన్ పెట్టేస్తున్నాను” అన్న వెంటనే ఫోన్ కట్ అవడంతో అయోమయంగా ఫోన్ వంక చూశాడు. బంగారమ్మ ఇంట్లో వచ్చిన ఫోన్ మాటలకూ, పేపర్లో వచ్చే వార్తలకూ, ప్రస్తుతం ప్రకాశ్ మాటలకూ ఎక్కడా పొంతనలేకుండా ఉంది. కనీసం క్రోడీకరించేందుకు కూడా వీలు లేకుండా ఉంది. అదే అయోమయ స్థితిలో ఇంటిదారి పట్టాడు వీరభద్ర.

అదే సమయంలో అక్కడికి పన్నెండు మైళ్ళ దూరంలో ఉన్న ఒక ప్రదేశంలో ఒక యువకుడు



## తమిళం తరువాతే తెలుగట!

నేనూ శైలజ’ తరువాత కీర్తి సురేష్ ఒక్కటంటే ఒక్క తెలుగు సినిమాకు కమిట్ కాలేదు. చాలా మంది హీరోల పక్కన కీర్తి పేరు వినిపించినా, చివరి నిమిషంలో అదంతా తూచ్ అనేశారు. దీనికి కారణం స్వయంగా కీర్తినే చెప్పుకొచ్చింది. తెలుగు కంటే తమిళంలో మంచి మంచి కథలు, క్యారెక్టర్లు రావడమే కాకుండా స్టార్ హీరోల పక్కన అవకాశాలు వస్తున్నాయట! దాంతో తెలుగులో చేయడానికి కుదరడం లేదట! అంటే తెలుగులో స్టార్ హీరోలు అవకాశాలు ఇవ్వడం లేదనీ, మంచి క్యారెక్టర్లు రావడం లేదనేగా అర్థం అంటున్నారు టాలీవుడ్ జనాలు. ఎవరేమనుకున్నా తన ప్రయార్టీ తమిళం తరువాతే తెలుగుకి అంటూ తెగేసి మరీ చెబుతోంది ఈ మల్లూ బ్యూటీ.

భయంతో వణుకుతూ కత్తిమొన ముందు చిల కలా పలుకులు వల్లిస్తున్నాడు.

"మీరు చెప్పమన్నదంతా చెప్పేశాను. నన్నేం చెయ్యొద్దు" అన్నాడు చివరికి.

అతనే వీరభద్ర కొడుకు ప్రకాశ్. ఈ విషయం పత్రికలకు ఇంకా చేరలేదు.

●●●

కమీషనర్ ఆఫీసులో కమీషనర్ చాంబర్‌లో వాతావరణం నిశ్శబ్దంగా ఉంది. చల్లని వాతావ రణం ఉన్నా ఇబ్బందికరంగా ఉంది. ఏసీలో కూడా ఉక్కపోత అనిపిస్తోంది.

హేమచంద్ర కళ్ళు మూసుకుని రెండు బొటన వేళ్ళు కణతలకు పెట్టుకుని అదుముకుంటూ మౌనంగా కూర్చుని ఉన్నారు.

అతనికెదురుగా అసిస్టెంట్ కమీషనర్ దేవ రాజ్ అతని పక్కనే సిఐడీ స్పెషల్ ఆఫీసర్ గోవ ర్ధన్ కూర్చుని ఉన్నారు.

వాళ్ళ ముందున్న టేబిల్ మీద కొన్ని వార్తా పత్రికలు చిందరవందరగా పడున్నాయి. పాతవీ కొత్తవీ కలగలసి ఉన్నాయందులో.

"సర్, నెల క్రితం మీరు కేసు చెప్పగానే అన ఫీషియల్‌గా అరకు వెళ్ళి ప్రైమ్ డేటా కొంత సంపాదించాను. బట్ ఇన్వెస్టిగేషన్ ఇంకా ముగియ లేదు. ఇన్‌ఫాక్ట్ ఇంకా ప్రారంభం కాలేదు. కనబ డకుండా పోయిన పిల్లలేమీ చిన్న పిల్లలు కాదు. పాతికేళ్ళ పైబడినవాళ్ళే. అందరూ చదువుకున్న వాళ్ళే. అయితే ఈ కేసుకు మూలాలు వేరే ఎక్కడో ఉన్నట్టనిపిస్తోంది. బట్ సర్, దిసీజ్ రిడి క్యులస్. గత ఆరు నెలల కాలంలో అరడజను మంది ఆడపిల్లలు కూడా కనబడకుండా పోయారు. ఈ విషయం అన్ని పత్రికలూ కోడై కూశాయి. అయితే వాళ్ళ ఆచూకీ తెలుసుకునే ప్రయత్నం ఏ మాత్రం జరగలేదు. ఇప్పుడు మాత్రం కొంత మంది పెద్ద మనుషుల పిల్లలు కనబడకుండా పోయారనగానే ఎక్కడలేని ఒత్తిడి. ఎందుకీ తార తమ్యం? కనబడకుండా పోయిన ఆ అరడజను మంది ఆడపిల్లల కన్నవాళ్ళు మనుషులు కాదా? వాళ్ళకూ కుటుంబం, ఆప్యాయతలు, అభిమానాలు, సంఘంలో గౌరవ మర్యాదలు ఉండవా? కేవలం ఉన్నవాళ్ళు, పైగా రాజకీయంగానూ ప్రభుత్వం లోనూ పలుకుబడి ఉన్నవాళ్ళన్న ఒకే ఒక కారణంగా ఇప్పుడు మనమీద ఎక్కడలేని ఒత్తిడి తేవడం భావ్యమా?"

చిన్నగా నిట్టూర్చాడు కమీషనర్. జవాబు చెప్పే స్థితిలో తను లేడన్న విషయం అతనికే కాదు అక్కడున్న మిగతా ఇద్దరికి కూడా తెలుసు. కానీ ఏమీ చేయలేని పరిస్థితి. ధనమూలమిదం జగత్. అదే ఒత్తిడికి కారణం.

"మిస్టర్ గోవర్ధన్, మీ ఫీలింగ్స్ అందరికీ అర్థ మవుతాయి. మీ ప్రశ్నలకు జవాబు ఎవరూ చెప్పలేరు. అందుకే ఈ కేసు మీకప్పగించాను. చట్టపరంగానే కాక మానవతా దృష్టితో కూడా సాల్వ్ చెయ్యగలరన్న నమ్మకంతోనే మిమ్మల్ని ఏరికోరి పిలిపించాను. ఆ నమ్మకాన్ని నిలబెడతా రని ఆశిస్తాను" అన్నాడు క్లుప్తంగా.

"నా శాయశక్తులా ప్రయత్నిస్తాను సర్".

"మీకెప్పుడు ఏ సహాయం కావాలన్నా మిస్టర్ దేవరాజ్‌ను కాంటాక్ట్ చెయ్యండి. అతను అందు బాటులో లేకపోతే వెంటనే నన్ను కాంటాక్ట్ చెయ్యండి. ఫస్ట్ ప్రిఫరెన్స్ మీ మాటలకే ఇస్తాం" అన్నాడు దృఢంగా హేమచంద్ర.

వెంటనే లేచి సెల్యూట్ చేసి బయటికి నడి చాడు గోవర్ధన్.

అతనితో బాటే దేవరాజ్ కూడా బయటికి వచ్చాడు.

"మిస్టర్ దేవరాజ్! ముందుగా నేను అరకు వెళ్తాను. అఫ్కోర్స్...ఇదివరకోసారి వెళ్ళాను. బట్ అనఫీషియల్. కొంతమందితో మాత్రమే మాట్లా డాను. ఇప్పుడు వెళ్ళి డిపార్టుమెంట్లో ఉన్న మిగతా అందరితోనూ మాట్లాడాలి. ఇంకా కొన్ని అను మానాలు మిగిలిపోయాయి. అవి తీర్చుకుని ముందుకు ప్రొసీడవ్వాలి".

"అలాగే చెయ్యొచ్చు. ఎలా వెళ్తారు? జీప్ అరేంజ్ చేసేదా?"

నవ్వేసి "బస్‌లోనే! సాధారణ ప్రయాణికుడి

## మనమీదేనర్రోయ్!

సరసి





లాగా. ఒంటరిగానే. మరో విషయం నేను ఫలానా అని, అక్కడికి వస్తున్నానని ఇన్ఫర్మేషన్ వెళ్ళ కూడదు. అది మీ బాధ్యత. మన డిపార్ట్‌మెంట్లోనే మనం రహస్యాలను కాపాడుకోలేకుంటే... కష్టం కదూ" అన్నాడు గోవర్ధన్ తన నవ్వును పొడిగిస్తూ.

"సాయంత్రానికి వెళ్తారా?"

"రేపు చెయ్యాలనుకున్న పని ఈరోజే చెయ్యాలి. ఈ రోజు చెయ్యాలనుకున్న పని ఇప్పుడే చెయ్యాలి. సో... ఇప్పుడు బస్టాండుకే వెళ్తున్నాను. తొమ్మిది గంటలైంది. కాస్త టిఫిన్ చేసి ఏ బస్సు దొరికితే దాన్ని పట్టుకుని వెళ్తాను" అని నవ్వుతూ కర చాలనం చేసి ముందుకు కదిలాడు గోవర్ధన్.

దాదాపు పాతికేళ్ళు పైబడిన స్ఫురద్రూపి. మరీ ఆరడుగుల ఎత్తు, ఆజానుబాహుడు కాక పోయినా మంచి దేహ సౌష్ఠవం కలిగిన వ్యక్తి. చురుకైన దృక్కులు, అపరిమితమైన చురుకు దనం, వీటన్నింటినీ మించిన ఆత్మవిశ్వాసం.

పదిన్నరకు బస్టాండ్ క్యాంటీన్లో టిఫిన్ ముగించి అక్కడే బస్ పట్టుకుని సుమారు ఒంటి గంటకు అరకులో దిగాడు గోవర్ధన్.

నేరుగా స్టేషన్‌కే వెళ్ళాడు. అక్కడ అతను కలవాలనుకున్న వ్యక్తి రమణమూర్తి.




అప్పుడే భోజనానికి వెళ్ళాడని చెప్పాడు అక్క డున్న కానిస్టేబుల్.

"మీ పేరేంటి?"

"యాదయ్య. కానిస్టేబులండీ".

"నా పేరు గోవర్ధన్. విశాఖపట్నం నుంచి వస్తున్నాను. సిఐడి స్పెషల్ ఆఫీసర్".

సిఐడి అనగానే ఉలిక్కిపడ్డాడు యాదయ్య. అతని శరీరంలో కొద్దిగా వణుకు ప్రారంభమైంది. అది స్పష్టంగా కనిపించింది గోవర్ధన్‌కు.

"ఏంటండీ ఏమైంది? ఎందుకలా వణుకు తున్నారు?"

"అబ్బే... పెద్ద ఆఫీసరుగారు వచ్చారు. సమ యానికి అయ్యగారు సీట్లో లేరు. అందుకే..." అతను చేతులు నలుపుకుంటూ నిలబడ్డాడు.

"భలేవారే. భోజనం సమయంలో రావడం నాదే తప్పు. కనీసం భోజనం చేసే సమయం కూడా ఇవ్వకుంటే ఎలా? కంగారు పడకండి. నేనలా కూర్చుంటాను. ఆయన నిదానంగా భోజనం ముగించి రానీయండి. మీరేమీ చెప్పొద్దు" అన్నాడు కుర్చీలో కూర్చుంటూ.

సరిగ్గా రెండు గంటలకల్లా రమణమూర్తి వచ్చాడు.

ఎవరో అపరిచిత వ్యక్తి కూర్చుని ఉండటం గమనించి యాదయ్య వంక చూశాడు రమణ మూర్తి. యాదయ్య నోటి మీద వేలుంచుకుని భయభక్తులు ప్రదర్శించాడు.

రమణమూర్తికి పూర్తిగా అర్థం కాలేదు. అంత లోనే గోవర్ధన్ అతన్ని చూశాడు.

"హలో... మిస్టర్ రమణమూర్తీ, నా పేరు గోవర్ధన్. సిఐడి స్పెషల్ ఆఫీసర్. రత్నగిరి హవేలీ కేసు చూస్తున్నాను. ఇక్కడ మీ లోకల్ ఇన్వెస్టిగే షన్ వివరాలు కావాలి" అంటూ తన ఐడెంటిటీ కార్డ్ చూపించాడు గోవర్ధన్.

హఠాత్తుగా అతను మాట్లాడిన మాటలకు కొద్ది క్షణాలు అతనికి కూడా కాళ్ళు చేతులు ఆడ లేదు. ఎలాగో తేరుకుని సెల్యూట్ చేశాడు.

"ఆ కేసు మీరే చూస్తున్నారని విన్నాను. ఎన్నాళ్ళ క్రితం ప్రారంభించారు?"

జవాబు చెప్పలేక గుటకలు మింగాడు రమణ మూర్తి.

"ఫర్వాలేదు చెప్పండి. డిపార్టుమెంట్లో ఇది మామూలే. వేరే ఏవో ఒత్తిళ్ళ వల్ల ఆలస్యం జరు గుతూ ఉంటుంది. దానికి మనం ఫీలవ్వకూడదు".

అయినా అతను నోరు తెరవలేకపోయాడు. హవేలీ కేసుకు సంబంధించిన ఫైల్ తెచ్చి అత నికి అందించాడు. అది తెరిచి చూసిన గోవర్ధ న్‌కు అందులో తారీఖు కనిపించింది. దాదాపుగా ఏడెనిమిది నెలల క్రితం ప్రారంభించిన ఫైల్ అది.

"కేసు ఎక్కడో ప్రారంభించి ఎక్కడికో వెళ్తున్న ట్టనిపిస్తోంది కదూ" ఓరగా అతన్ని చూశాడు గోవ ర్ధన్. రమణమూర్తి నోటంట మాటలు కరువయ్యాయి.

"గత రెండు మూడు నెలలుగా ఎవరెవరో కనబడకుండా పోయారన్న వార్తలు పేపర్లో వచ్చాయి. వాటి వివరాలేమైనా ఉన్నాయా?"

ఉన్నాయన్నట్టుగా తలూపి మరో ఫైల్ తెచ్చిచ్చాడు.

"దీనికీ, ఈ కేసుకూ సంబంధం ఉన్నట్టేమైనా అనిపిస్తోందా?"

"కొద్దిగా అలానే అనిపిస్తోంది" సణిగాడు రమణమూర్తి.

చిన్నగా నవ్వాడు గోవర్ధన్. కాసేపటికి మరి కాస్త పెద్దగా నవ్వాడు.

"హమ్మయ్య. ఈ రోజు శుక్రవారం, మీరు మౌన వ్రతంలో ఉన్నారనుకున్నాను. మీకు మాటలు వచ్చన్నమాట".

అతని జోక్‌ను ఆస్వాదించే స్థితిలో లేడు రమణమూర్తి.

"సంబంధం ఉందనిపించినప్పుడు ఇవన్నీ కూడా ఒకే ఫైల్లో ఉంచొచ్చుగా, వేరే ఫైలెందుకు?" మళ్ళీ రమణమూర్తి మౌనం.

"కేసు గురించి మీకు తెలిసినంతవరకూ నాకు కాస్త క్లుప్తంగా చెప్పండి".

నోరు విప్పడానికి అతను తటపటాయిస్తున్నాడు.

"ఫరవాలేదు చెప్పండి. ఈ ఫైల్ నేను తరు వాత చదువుతాను. మీకు తెలిసింది చెప్పండి, చాలు" అభయమిచ్చాడు గోవర్ధన్.

ఎవరో ఒక అజ్ఞాత వ్యక్తి నుంచి వచ్చిన సమాచారం ఆధారంగా హవేలీలో మాదక పదా ర్థాల కోసం జరిపిన సోదాల వద్ద ప్రారంభించి, ప్రస్తుతం ఆరుగురు ప్రముఖుల వారసులు కను మరుగైన వరకూ క్లుప్తంగా చెప్పాడు రమణ మూర్తి. అతను చెప్పిన దాంట్లో కనబడకుండా పోయిన అరడజనుమంది అమ్మాయిల గురించిన సమాచారం లేదు.

చిన్నగా తల పంకించాడు గోవర్ధన్.

"అంటే మీ సోదాల్లో అక్కడ హవేలీలో ఏ సమాచారం దొరకలేదన్నమాట".

అవునన్నట్టుగా తలూపాడు.

"మరి దానికి సంబంధించిన నిల్ రిపోర్టైనా ఇందులో లేదే".

ఉలికిపడ్డాడు రమణమూర్తి. ఇంత క్రితమే ఫైల్ తరువాత చూస్తానన్నాడు. అంతలో ఎప్పుడు చూసి ముగించాడో అర్థం కాలేదు.

"మీకన్నా ముందు గోపాలరావనే అతన్ని నియ మించారు. అతన్నెందుకు పక్కన బెట్టారో తెలుసా?"

"ఈ సందర్భంగానే అతని మీద దాడి జరి గింది. అందువల్ల మార్చేశారు".

"హేయ్. ఇదేం చిన్నపిల్లలాటా? ప్రాణం పోయినా డ్యూటీ డ్యూటీయే. దాడి జరిగితే మార్చెయ్యడ మేనా? ఇది మీచేతికొచ్చాక మిమ్మల్నెవరైనా బెది రించారా? ఇంతకూ అతనెక్కడున్నాడు?"

"ఎందుకో ఈ రోజతను రాలేదు".

"ఎక్కడుంటాడు? అతని ఇల్లెక్కడ?"

"ఇంతకు ముందిక్కడే ఉండేవాడు. ప్రస్తుతం అతను ఆ పల్లెలోనే ఉంటున్నాడు".

"కారణం తెలుసా?" తెలియదన్నట్టు తలూ పాడు రమణమూర్తి.

"ఇక్కడ బస చేసేందుకు ఏవైనా మంచి హోటల్స్ ఉన్నాయా?"

"సర్, ఇది టూరిస్ట్ స్పాట్. స్టార్ హోటళ్ళు కూడా ఉన్నాయి".

ఇక అంతకుమించి మరేమీ అడగదల్చుకో లేదు గోవర్ధన్. లేచి ఆలోచిస్తూ మెల్లగా బయ టికి వచ్చి "నేను మళ్ళీ వస్తాను" అనేసి వేగంగా వెళ్ళిపోయాడు.

***(ఇంకావుంది)***

# వరల్డ్ సూసైడ్ స్పాట్స్







**ఆత్మహత్య మహాపాతకం. మన పురాణాలు చెబుతున్న సారాంశంలో ఇదీ ఒక ప్రధానాంశమే. మనిషిని మానసికంగా దిగజార్చి అనివార్యంగా ఆత్మహత్యకు పురిగొల్పే కారణాలు నేటి ఆధునిక సమాజంలో ఎన్నో రకాలుగా ఉంటాయి. ఇది జీవనపోరాటంలో ఒక భాగం. ఈ విషయాన్ని పక్కనపెడితే, ఈ భూమిపై ఉన్న కొన్ని ప్రదేశాలకు వెళితే చాలు ఏ కారణం లేకపోయినా, ఆత్మహత్య చేసుకోవాలనే కోరిక కలుగుతుందట! ఆ ప్రదేశాలు కొందరిని ఆత్మహత్యకు పురిగొల్పేవిగా ఉంటాయట!**

అందేంటి! ఎంతో ఇష్టంగా ప్రకృతిలోని సుందర దృశ్యాలు చూసేందుకు వెళితే ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుందా? ఇదేం విడ్డూరం? అని ఆశ్చర్య పోతున్నారా! వినడానికి వింతగా ఉన్నా ఇది నిజంగా నిజమండీ! కొందరు ఆ ప్రదేశాల అందాలను చూసి మరీ మైమరచిపోతారట. ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుందట. అలాంటి ప్రదేశాలు ఉన్నాయి మరి!

### కోల్‌కతా మెట్రో స్టేషన్

రైల్వేస్టేషన్‌కి వెళ్లినప్పుడు ఎవరికైనా రైలెక్కాలనిపిస్తుందా? ఆత్మహత్య చేసుకోవాలని అనిపిస్తుందా? మీరే చెప్పండి. కానీ కలకత్తాలోని రవీంద్రసరోవర్ మెట్రో రైల్వేస్టేషన్‌కి వెళ్ళే చాలా మంది ప్రయాణికులకు మానసిక స్థితి బాగానే ఉన్నాగానీ, ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుందట. ఈ మెట్రో రైల్వేస్టేషన్‌లో ఇలా ఎంతో మంది ఆత్మహత్యలకు పాల్పడ్డారు. ఇక్కడ ఆత్మలు, దయ్యాలు లాంటివి కనిపిస్తాయని ఎందరో ప్రయాణీకులు, రైల్వే ఉద్యోగులు కూడా చెబుతుంటారు. కొంతమంది వీటిని నమ్మకుండా కొట్టిపడేస్తారు. అయినప్పటికీ ఈ రైల్వే స్టేషన్‌కి వెళితే మాత్రం చాలా మందికి ఆత్మహత్య చేసుకోవాలని అనిపించడం జరిగిందని చెబుతారు.

### ఈఫిల్ టవర్

ప్రపంచంలో ఎన్నో అద్భుత కట్టడాలున్నాయి. అందులో ఈఫిల్ టవర్ ఒకటి. ఆ టవర్ ఎక్కితే పారిస్ సిటీ మొత్తం చూడొచ్చు. చాలామందికి ఈఫిల్ టవర్ ఎక్కాలనేది కోరిక. ఈ అద్భుత కట్టడం చూసేందుకు ప్రతిరోజూ వేల మంది పర్యాటకులు పారిస్ వస్తుంటారు. కానీ వీరిలో కొందరు ప్రాణాలు విడిచిపెట్టేందుకే వస్తుంటారట. ఈ టవర్ ఎక్కిన వారిలో కొద్దిమందికి చనిపోవాలనిపిస్తుందట. ఈఫిల్ టవర్‌పై 1898లో మొట్టమొదటి ఆత్మహత్య జరిగింది. అప్పటి నుంచి ఇప్పటి వరకు 400 మంది పైగా ఆత్మహత్యకు పాల్పడ్డారని అంచనా.

### గోల్డెన్ గేట్ బ్రిడ్జ్

యునైటెడ్ స్టేట్స్ కాలిఫోర్నియాలో ఉన్న గోల్డెన్ గేట్ బ్రిడ్జ్ చూడడానికి ఏటా కొన్ని లక్షల మంది పర్యాటకులు వస్తుంటారు. ప్రపంచంలో ఉన్న ప్రముఖ బ్రిడ్జిలలో గోల్డెన్ గేట్ బ్రిడ్జి ఒకటి. అంతే కాదు ప్రముఖ సూసైడ్ స్పాట్‌గా కూడా దీనికి పేరు. ఇప్పటి వరకు అక్కడ 1500 పైగా ఆత్మహత్యలు జరిగాయని అంచనా. ఒక్క 1995 సంవత్సరంలోనే 45 ఆత్మహత్యలు జరిగాయని తేలింది.

### బీచీహెడ్

యూకేలో ఉన్న బీచీ హెడ్ ప్రదేశం చూడడానికి అత్యద్భుతంగా ఉంటుంది. ఆ ప్రదేశం, వాతావరణం చూస్తే చాలు ఎలాంటి వారికైనా మానసికోల్లాసం కలగాల్సిందే. పచ్చని ప్రకృతి రమణీయతకు ఆ ప్రదేశం పెట్టింది పేరు. ఆ అందాన్నిచూసి తట్టుకోలేని చంచల మనస్కులు ఇక్కడ కూడా ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఈ ప్రదేశంలో ప్రతీఏటా 20 మందికి పైగా ఆత్మహత్యలు చేసుకుంటారట.

### సన్‌షైన్ స్కైవే

అమెరికాలో ఉన్న సన్‌షైన్ స్కైవే బ్రిడ్జి వద్ద సూర్యుడు అస్తమిస్తున్న దృశ్యం ఎంతో అద్భుతంగా ఉంటుంది. దక్షిణ భారతదేశం రామేశ్వరంలో ఉన్నట్లే ఆ ప్రాంతంలో సూర్యోదయాలు సూర్యాస్తమయాలు యాత్రికులకు కనువిందు చేస్తాయి. 1987 నుంచి ఈ బ్రిడ్జిపై నుంచి దూకి దాదాపు 210 మంది చనిపోయారని అంచనా.

### జాక్వస్ కార్టియర్ బ్రిడ్జ్

కెనడాలోని జాక్వస్‌కార్టియర్ బ్రిడ్జిపై నుంచి దూకి ఇప్పటికి 143 మంది చనిపోయారట. ఇక లాభంలేదనుకుని ఇలా ఆత్మహత్యలు జరగకుండా నివారించడానికి 2004 సంవత్సరం నుంచి ఓ ప్రత్యేక బృందాన్ని కూడా ఏర్పాటు చేసింది అక్కడి ప్రభుత్వం.

### నయాగరా ఫాల్స్

ప్రపంచంలోనే అతిపెద్ద జలపాతం నయాగరా. అమ్మాయి కురులను కూడా కొంతమంది ఆధునిక కవులు నయాగరా జలపాతంతో పోలుస్తారు. ఇంత పెద్ద జలపాతాన్ని చూడాలని ఎవరికుండదు చెప్పండి. చలికాలంలో ఈ జలపాతం గడ్డకట్టుకు పోయి చూడడానికి ఇంకా అందంగా కనిపిస్తుంది. అదే వానాకాలంలో ఆ అందాలు చెప్పతరం కాదు. కెనడా, అమెరికా సరిహద్దుల్లో ఉన్న ఈ జలపాతం చూడడానికి ఇరుదేశాల ప్రజలే కాకుండా ప్రపంచం మొత్తంగా చాలామంది పర్యాటకులు వస్తుంటారు. ఈ నయాగరా ఫాల్స్‌లో ఏటా 40 మంది దూకి ఆత్మహత్యలు చేసుకుంటారట. ఇప్పటివరకు ఐదు వేల మందికి పైగా చనిపోయారట.

**-విజేత**










# అన్నయ్య

**'అవంతిక బంధువులు గోల చేస్తున్నారు. భర్తే హంతకుడు అంటున్నారు. కానీ అతడి నేరం నిరూపించే ఆధారాలు దొరకటం లేదు అంటూ హత్య కేసు ఫైలును డిటెక్టివ్ శరత్‌కు స్వాధీనపరిచాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.**

**ఫైలు తెరిచాడు శరత్. పేపర్‌లో హత్యవివరాలు చదివినప్పుడు శరత్‌కు కూడా అవంతిక భర్త పైకే అనుమానం మళ్ళింది.**

శేఖర్, అవంతికలది పెద్దలు చేసిన పెళ్ళి. ఏడాది కూడా గడవకముందే ఈశ్వర్‌తో ప్రణయం ప్రారంభించింది. కాలేజీటైమ్‌లోనే వారిద్దరికి ప్రేమ వ్యవహారం ఉంది. పెద్దలు అవంతిక ఇష్టానికి వ్యతిరేకంగా శేఖర్‌తో పెళ్లి చేశారు. ఎక్కువ టూర్లు వెళ్ళే ఉద్యోగం చేస్తున్నాడు శేఖర్. దాంతో స్వేచ్ఛగా అవంతిక ఇంట్లోనే కలిసే వీలు వాళ్ళిద్దరికీ చిక్కింది. శేఖర్ ఊళ్లో ఉన్నప్పుడుతప్ప వాళ్ళు యధేచ్ఛగా కలుస్తూ పోయారు. హత్య జరిగినరోజు ఊళ్లోనే పెద్ద ఫైవ్ స్టార్ హోటల్లో సమావేశంలో పాల్గొన్నాడు శేఖర్. ప్రొద్దున్న మొదలైె సాయంత్రం సమావేశం పూర్తయ్యాక శేఖర్ ఇంటికి వచ్చేసరికి ఇద్దరి శవాలు నగ్నంగా మంచంపైపడి ఉన్నాయి. వారిద్దరి ఒంటి నిండా కత్తి గాట్లున్నాయి. మైమరచి లైంగికచర్యలో ఉన్న సమయంలో ఎవరో గుట్టుచప్పుడు కాకుండా వారిని కసితీరా పొడిచి చంపారు.

చదివి తల ఎత్తాడు శరత్. 'భర్తమీదే నా అనుమానం. బైటవాళ్ళకి అంత కసి ఉంటుందా?' అన్నాడు శరత్.

మళ్లీ వివరాలు చదవటం ఆరంభించాడు. ఇంటి చుట్టూ తిరిగిన పోలీసు కుక్కల వల్ల ఎలాంటి ఆధారాలూ దొరకలేదు. శేఖర్, ఈశ్వర్, అవంతికల వేలిముద్రలు, పొరుగిళ్ళ వాళ్ళ వేలిముద్రలు, అవంతిక బంధువుల వేలిముద్రలు కూడా ఇంట్లో ఉన్నాయి. హత్య చేయడానికి ఉపయోగించిన కత్తి దొరకలేదు.

ఈశ్వర్‌తో సంబంధం కొనసాగించటాన్ని నిరసించి, ఆమె తల్లిదండ్రులే అతన్ని చంపించారేమోనన్న కోణంలో పరిశీలించారు. కానీ ఆధారాలు లేవు. ఈశ్వర్ ప్రేమికలెవరన్నా ఉన్నారేమో, వారు కసితో హత్య చేశారేమోనని పరిశోధించారు. కాలేజీ రోజుల నుంచి అవంతికతో తప్ప మరో యువతితో ఈశ్వర్‌కి సంబంధం లేదు. అందువల్ల శేఖర్‌మీదే అనుమానం వస్తోంది. కానీ ఆధారాలు లేవు. ఎవరయినా దొంగతనానికి వచ్చి హత్య చేశారేమో? అని కూడా ఆలోచించారు. కానీ ఇంట్లో వస్తువులేవీ పోలేదు.

చదివి నిట్టూర్చాడు శరత్. తన అసిస్టెంట్ రామును పిలిచాడు. 'రామూ, వీళ్లందరి కాల్‌డేటా సేకరించు. అలాగే శేఖర్ కాల్‌డేటాతోపాటు బ్యాంకు ఎకౌంట్ వివరాలు సేకరించు. ఇటీవల పెద్ద మొత్తాల లావాదేవీలేవైనా జరిగాయేమో గమనించు' అన్నాడు.

'అవన్నీ పరిశీలించాం' అన్నాడు విజయ్.

'మరోసారి పరిశీలిస్తే నష్టం లేదు' అన్నాడు శరత్.

'నేను ఓసారి శేఖర్ తల్లిదండ్రులను, అవంతిక తల్లిదండ్రులను కలిసి, ఇంటిని పరిశీలిస్తాను. శేఖర్‌ని కూడా ప్రశ్నిస్తాను' అన్నాడు.

●●●

'ఈశ్వర్‌తో దాని ప్రేమ వ్యవహారం మాకు తెలుసు. పెళ్లయితే అన్నీ మరచిపోయి బాధ్యతగా ఉంటుందనుకున్నాం. ఈశ్వర్ ఆమెని వదలలేదు. ఎన్నోసార్లు హెచ్చరించినా వాళ్లు వినలేదు' విషాదంగా చెప్పాడు అవంతిక తండ్రి.

'పెళ్లయిన తరువాత కూడా వాళ్ళిద్దరూ కలుస్తున్నట్టు మీకు తెలుసా?' ప్రశ్నించాడు.

'తెలుసు. ఓసారి సినిమా హాలులో కనిపించారు. ఆ తర్వాత ఇంట్లోనే కలవటం ఆరంభించినట్టున్నారు' చెప్పాడాయన.

'మీకెవరిమీదైనా అనుమానం ఉందా?'

తల అడ్డంగా ఊపాడాయన. 'శేఖర్‌పై నాకు సానుభూతి ఉంది. కానీ అంత ఘోరంగా హత్య చేస్తాడనుకోను. అయినా ఇలాంటి అక్రమ వ్యవహారాలు సాగినంత కాలం బాగానే ఉంటాయి. కానీ ఏదో ఒకరోజు ముఖంపై పేలతాయి. అప్పుడు వాళ్లే కాదు వాళ్లతో అనుబంధం ఉన్న ప్రతివారూ దెబ్బ తింటారు' అన్నాడాయన.

●●●

'కోడలు వల్ల మా పరువు పోయింది. ఇప్పుడు శేఖర్ దోషి అని నిరూపించాలనుకుంటున్నారా? పరువు కోసం హత్యలు చేసి, ఉన్న పరువు పోగొట్టుకునే మూర్ఖులం కాదు' కరాఖండిగా చెప్పాడు శేఖర్ తండ్రి.

'అవంతిక ఈశ్వర్‌ల గురించి మీకు ఎప్పుడు తెలిసింది?' అడిగాడు శరత్.

'ఆమెకు అక్రమ సంబంధం ఉందని హత్య జరిగేవరకు మాకు అనుమానం రాలేదు. మా అబ్బాయితో ఆ అమ్మాయి ప్రేమగానే ఉండేది' అన్నాడు శేఖర్ తండ్రి.

'ఇలాంటివాళ్లే అందరినీ మభ్యపెట్టగలరు. ఇలాంటి మాయకులే అందరినీ మాయచేస్తారు' కసిగా అంది శేఖర్ తల్లి.

●●●

తలవంచుకుని కూర్చున్నాడు శేఖర్.

'నా భార్య, నా మంచంపై ఇంకొకరికి చోటిచ్చిందన్న చేదునిజం ఆ శవాల్ని చూసేదాకా నాకు తెలియదు. ఏ మాత్రం అనుమానం వచ్చినా ఉద్యోగం వదలి అవంతికను కాపాడే వాడిని' కంట పొంగే నీరు ఆపుకుంటూ చెప్పాడు శేఖర్.

'మీకు ఏ మాత్రం అనుమానం రాలేదా?' అడిగాడు శరత్, శేఖర్‌ని పరిశీలనగా చూస్తూ.

'లేదు. అవంతిక ప్రేమగానే ఉండేది. నేను కాక మరో పురుషుడు ఆమె జీవితంలో ఉన్నాడన్న ఆలోచనే నాకు రాలేదు. అంతేకాదు, నా స్పర్శకు ఎలా స్పందించిందంటే..' మాట్లాడలేక పోయాడు శేఖర్.

'ఆరోజు మీరు కాన్ఫరెన్స్‌లో ఎన్ని గంటల నుంచి ఎన్ని గంటల వరకూ ఉన్నారు?'

'పొద్దున తొమ్మిది నుంచి సాయంత్రం ఆరు వరకూ. ఇంటికి వచ్చేసరికి ఏడయింది.

'మధ్యాహ్నం ఒంటిగంట-మూడు గంటల మధ్య హత్య జరిగిందని నిర్ధారించారు. ఆ సమయంలో మీరు ఎక్కడ ఉన్నారు?'

'హోటల్‌లోనే. లంచ్ చేసి రిలాక్సయ్యాం'.

'మీ ఆఫీస్ కప్‌బోర్డు తాళంచెవి, ఆఫీస్ కంప్యూటర్ పాస్‌వర్డ్ ఇవ్వండి' అడిగాడు శరత్.

'ఎందుకు?'

'సందేహం తీరాలిగా'

●●●

'బాస్, కాల్‌డేటా, బ్యాంక్ వివరాలు అన్నీ తెచ్చాను. నో క్లూ. నువ్వు చెప్పినట్టే ఆరోజు కాన్ఫరెన్స్‌లో ఉన్న వాళ్లందరినీ ప్రశ్నించాను. అందరూ శేఖర్ రోజంతా ఉన్నాడని చెప్తున్నారు. ఇదేదో జటిలమైన కేసులా ఉంది బాస్' అన్నాడు రాము.

'ఓసారి ఇల్లు పరిశీలిద్దాం' అని లేచాడు శరత్. 'ఇంటి చుట్టుపక్కల వాళ్లని ప్రశ్నించావా?' అడిగాడు.

'ప్రశ్నించాను బాస్. వాళ్లు ఈశ్వర్‌ని పలు మార్లు చూశారు. అతడు తన అన్నయ్య అని చెప్పింది. మీ అన్న ఎప్పుడూ మీ ఆయన లేనప్పుడు వస్తాడేమిటి? అని కూడా అడిగారట. తోడుగా ఉండటానికి మా ఆయనే రమ్మన్నారని చెప్పేదట.'

'నువ్వోసారి అతడి ఆఫీసుకెళ్ళు' చెప్పాడు శరత్.

●●●

'వేలిముద్రలు బోలెడన్ని దొరికాయి. ఇంట్లో

**అవంతిక ఇష్టానికి విరుద్ధంగా తల్లిదండ్రులు శేఖర్‌తో ఆమె వివాహం జరిపించారు. కానీ ఇంటి బెడ్‌రూమ్‌లో ప్రియుడితో కలిసి సుఖిస్తుండగా ఆ ఇద్దరినీ ఎవరో పొడిచి చంపారు. అవంతిక భర్త ఆ సమయంలో ఒక హోటల్‌లో జరుగుతున్న కాన్ఫరెన్స్‌లో ఉన్నాడు. సాక్ష్యాధారాలు లేవు. అవంతికను ఆమె ప్రియుణ్ణి తల్లిదండ్రులే చంపించే ప్రయత్నం చేశారా? లేక భర్త చంపాడా? ఈ కేసు పరిష్కారానికి డిటెక్టివ్ శరత్ ఏం చేశాడు?**



ఇంటి యజమానివీ, ఇంటావిడవీ, ఇంటికి వచ్చే వాళ్లవీ వేలిముద్రలు దొరకటంలో ఆశ్చర్యం లేదు' ఫింగర్ ప్రింట్ ఎనలిస్ట్ చెప్పాడు.

'అవంతిక, ఈశ్వర్, శేఖర్‌ల వేలిముద్రలు ఇంట్లో ఎక్కడెక్కడ దొరికాయో వివరాలు కావాలి. అలాగే శేఖర్ వేలిముద్రలన్నీ కావాలి' అడిగాడు శరత్. మౌనంగా శరత్ కోరినవన్నీ అందించాడు అతడు.

•••

గదిలోకి అడుగుపెట్టిన శరత్‌వైపు ప్రశ్నార్థకంగా చూశాడు ఫణీంద్ర.

'నీ సహాయం కావాలి. ఆ మధ్య ఓ విషయం చెప్పావు. వేలిముద్రలు ఎంతకాలం క్రితం పడినవో తేల్చిచెప్పే పద్ధతి ఉందని చెప్పావు. గుర్తుందా?'

'గుర్తుంది. టైమ్ ఆఫ్ ఫ్లైట్ సెకండరీ అయాన్ మాస్ స్పెక్ట్రోమెట్రీ (Time of Flight Secondary Ion Mass Spectometry) ద్వారా వేలిముద్రలు ఎప్పటివో తెలుసుకోవచ్చు'.

'వీటిని చూడు అంటూ శేఖర్ వేలి ముద్రల్ని అందించాడు శరత్.

'కాస్త సమయం పడుతుంది కానీ పదిరోజుల వరకే సరిగ్గా చెప్పగలం' అన్నాడు ఫణీంద్ర.

'ఓ.కే' అన్నాడు శరత్.

•••

'ఆరోజు హోటల్‌లో జరిగిన సమావేశం వీడియో తీశారుగా! ఓ సారి చూద్దాం' అన్నాడు శరత్.

'ఇంతకుముందు నేను చూశా. సరే పద' అన్నాడు విజయ్.

ఇద్దరూ వీడియో చూడటం ఆరంభించారు. లంచ్ సమయం అయింది.

నవ్వుతూ, తుళ్లుతూ భోజనం చేస్తున్నాడు శేఖర్.

సమయం చూశాడు శరత్. వెంటనే కాల్‌డేటా పరిశీలించాడు. అది శేఖర్ ఇంటి పక్కన అతని ఫోను. నిమిషం సేపే మాట్లాడాడు. మళ్లీ అందరితో జోకులు వేశాడు.

తరువాత సమావేశం ఆరంభమైంది.

'శేఖర్ ఏడి?' అడిగాడు శరత్ వీడియో చూస్తూ.

విజయ్ కూడా వెతికాడు. 'పొద్దున్న కూర్చున్న సీటులో లేడు'

మొత్తం గదిలో ఉన్న వారందరినీ 'పాజ్' చేసి మరీ చూశారు. శేఖర్ కనబడలేదు.

సమయం రెండున్నర దాటుతుండగా సమావేశం హాల్లోకి వచ్చి కూర్చున్నాడు శేఖర్.

'ఒకటిన్నర నుంచి రెండు నలభై అయిదు వరకు శేఖర్ కాన్ఫరెన్స్‌లో లేడు' అన్నాడు శరత్.

విజయ్ మాట్లాడలేదు.

'ఇంటికివెళ్లి హత్యచేసి రావటానికి ఈ సమయం చాలు. పక్కింటాయన ఫోను సమాచారంతో రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకోవటానికి వెళ్లి ఉంటాడు. వాళ్లని ఆ స్థితిలో చూసి భరించలేకపోయాడు. పద, శేఖర్‌ని కలుద్దాం' అంటూ లేచాడు శరత్.

ఇంతలో అతని ఫోను మోగింది. అది ఫణీంద్ర నుంచి.

•••

'మళ్లీ వచ్చారేమిటి? నా మీద అనుమానం తీరలేదా?' నవ్వుతూ అడిగాడు శేఖర్.

'అనుమానం ధృవపడింది' అన్నాడు శరత్.

శేఖర్ ముఖం మాడిపోయింది.

'కత్తి ఎక్కడ దాచావు?' అడిగాడు శరత్.

'నాకు తెలియదు. నేను కాన్ఫరెన్స్‌లో ఉన్నాను'.

'లంచ్ సమయంలో నీ పక్కింటి నుంచి ఫోను వచ్చింది. నువ్వు ఇంటికి వచ్చి హత్య చేసి వెళ్ళిపోయావు'.

'అబద్ధం'

'నీ వేలి ముద్రలు ఇంట్లో దొరికాయి'.

'నా ఇంట్లో నా వేలిముద్రలు కాకపోతే మీవి దొరుకుతాయా?'

'తలుపు, మంచం, వంటింటి సింకులోని నల్లాపైన ఆ రోజు మధ్యాహ్నం సమయంలో నీ వేలి ముద్రలు పడ్డాయి. నువ్వు హోటల్లో ఉంటే ఆ సమయంలో నీ ఇంట్లోకి వేలిముద్రలెలా వచ్చాయి? అదీగాక, అర్జంటుపని, ఇంటికి ఓసారి వెళ్లొస్తా అని సమావేశ నిర్వాహకులకు చెప్పావు. ఇంటికి వచ్చావు'.

'అబద్ధం. నేను ఇంటికి అని చెప్పలేదు. ఆఫీసు నుంచి ఫోను వచ్చిందని చెప్పాను' అని ఆగిపోయి మాటల్లో తను చేసిన పొరపాటు ఏమిటో గ్రహించాడు శేఖర్. తరువాత లోగొంతుకలో అన్నాడు.

'అవును. హత్య నేనే చేశాను. ఇరుగు, పొరుగు చెప్పారు. ఈశ్వర్‌ని అన్నయ్య అని చెప్తోందంటే నమ్మలేదు. ఆమెకు అన్న లేడు. ఈసారి వస్తే చెప్పమన్నాను. చెప్పారు. వచ్చిచూశాను. నాకు పిచ్చి పట్టినట్టయింది. చంపి కత్తిని హోటల్లో కిచెన్ కత్తుల్లో కలిపేశాను' అని నేరం ఒప్పుకున్నాడు శేఖర్.

**-కస్తూరి మురళీకృష్ణ**
**సెల్: 98496 17392**




**పది తాటిచెట్లంత పొడవూ, అయిదు తాటిచెట్లంత వెడల్పూ ఉండి, రథచక్రాల్లాంటి కళ్ళతో యుద్ధరంగంలో నిలిచిన కుంభకర్ణుని చూసి వానరులంతా భయంతో పరుగెత్తసాగారు. పరుగెత్తినా వారిని వదల్లేదు కుంభకర్ణుడు. శూలాయుధంతో గుచ్చి, దానికి వేలాడుతున్న వానరుల్ని ఒకొక్కరినీ మింగసాగాడు. ఆ బీభత్సాన్ని చూసి తట్టుకోలేకపోయాడు ద్వివిదుడు. కుంభకర్ణునితో యుద్ధానికి తలపడ్డాడు. హనుమ కూడా కలుగజేసుకున్నాడప్పుడు. ఇద్దరూ కుంభకర్ణుణ్ణి ఎదిరించసాగారు. గురి చూసి శూలాయుధాన్ని హనుమపై విసిరాడు కుంభకర్ణుడు. అది వచ్చి గుండెల్లో గుచ్చుకుంది. రక్తం కక్కుకుంటూ నేల కూలిపోయాడు హనుమ. నీల, గవాక్ష, శరభ, గంధమాదన, ఋషబాదులు కూడా కుంభకర్ణుని చేతిలో తీవ్రంగా గాయపడ్డారు. వానరులు అలా పరాజయం చెందడాన్ని చూసి, రాక్షసులు ఆనందించసాగారు.**

# రామ కుంభకర్ణుల యుద్ధం:రావణుని శోకం

తనపైకి శూలంతో పరిగెత్తి వస్తున్న కుంభకర్ణుణ్ణి చూశాడు సుగ్రీవుడు. పక్కనే ఉన్న బండను పెకిలించి, దానిని కుంభకర్ణునిపైకి విసిరాడు. గుండెలపై వచ్చి పడిందది. ఆ దెబ్బకి వెనక్కి తూలి పడుతూ, చేతిలోని శూలాన్ని గురి చూసి విసిరాడు కుంభకర్ణుడు. అది వచ్చి సుగ్రీవుని గుండెల్లో గుచ్చుకునేదే! అయితే ఆసరికే తేరుకున్న హనుమ, సుగ్రీవుని గుండెల్లో గుచ్చుకోనున్న శూలాన్ని చూసి, ఎగిరి వచ్చి అందుకున్నాడు దాన్ని. రెండు చేతులా పట్టుకుని, విరిచి పారేశాడు. శూలాయుధం లేదని యుద్ధాన్ని విరమించలేదు కుంభకర్ణుడు. వానరుల లాగానే అతనూ బండలను ప్రయోగించి యుద్ధం చేయసాగాడు. ఓ బండను గురి చూసి సుగ్రీవునిపైకి విసిరాడు. దాని దెబ్బకి సుగ్రీవుడు మూర్ఛపోయాడు. నేల కూలిపోయాడు. కూలిపోయిన సుగ్రీవుణ్ణి చూసి రాక్షసవీరులు సింహనాదాలు చేశారు.

స్పృహకోల్పోయి కిందపడి ఉన్న సుగ్రీవుణ్ణి చూశాడు కుంభకర్ణుడు. అన్నకి అతన్ని కానుకగా ఇవ్వదలచాడు. రెండు చేతులూ జాచి అందుకున్నాడతన్ని. లంకానగరానికి పరిగెత్తాడు. సుగ్రీవుని భుజాన్న వేసుకుని పరుగుదీస్తున్న కుంభకర్ణుణ్ణి హనుమ చూశాడు. వెళ్ళి అడ్డుకుందామనుకున్నాడు. అంతలోనే వద్దనుకున్నాడు. రాజుని తాను విడిపించడం, అతని కీర్తికే కళంకం అనుకున్నాడు హనుమ. సుగ్రీవుడు మహావీరుడు. విడిపించుకుని రాగలడనుకున్నాడు. అయితే మూర్ఛనుండి అతను తేరుకోవాలి. తేరుకుంటాడనుకున్నాడు. ఆలోపు చెల్లాచెదురుగా ఉన్న వానరసైన్యాన్ని క్రమబద్ధం చేయడంలో నిమగ్నమయ్యాడతను.

సుగ్రీవునిసహా కుంభకర్ణుడు లంకవీధుల్లోనికి ప్రవేశించాడు. అతని భుజాన్న వేలాడుతున్న సుగ్రీవుని చూసి, రాక్షసస్త్రీలు ఆనందించారు. ఇంటి ముంగిట నిలిచి, కుంభకర్ణుణ్ణి అభినందిస్తూ ఆశీర్వదిస్తూ గంధ, పుష్పాలూ, లాజలూ చల్లారు. గంధస్పర్శతో సుగ్రీవుడు తేరుకున్నాడు. తాను ఎక్కడ ఉన్నదీ గ్రహించాడు. కుంభకర్ణుని భుజంపై నుంచి మెల్లగా కిందికి జారాడు. అక్కణ్ణుంచి ఒక్కసారిగా పైకెగిరాడు. కుంభకర్ణుని ముక్కుని కొరికాడు. నోటిలోనికి వచ్చిన అతని ముక్కును కిందకి ఉమిసి వేశాడు. తర్వాత రెండు చేతుల్తోనూ కుంభకర్ణుని చెవులురెంటినీ పెరికి వేసే ప్రయత్నం చేశాడు. ఆ బాధను తట్టుకోలేకపోయాడు కుంభకర్ణుడు. మెడనంటి వేలాడుతున్న సుగ్రీవుణ్ణి రెండు చేతులా వెనక్కి లాగి, నేలపైకి విసిరేశాడతన్ని. కిందపడి నెత్తురు కక్కుకున్నాడు సుగ్రీవుడు. అయినా బలాన్ని పుంజుకున్నాడు. ఒక్క ఉదుటన ఆకాశంలోకి ఎగిరాడు. వచ్చి, యుద్ధరంగంలోని రాముని పక్కన నిలిచాడు. క్షేమంగా వచ్చిన సుగ్రీవుణ్ణి దగ్గరగా తీసుకున్నాడు రాముడు. అభినందించాడతన్ని.

చేతికి అందిన శత్రువు జారుకున్నాడు. విజయం పరాభవంగా మారింది. తలపట్టుకున్నాడు కుంభకర్ణుడు. ముక్కులేదు. ఆ చోట పెద్ద గుంత పడి అందులోంచి రక్తం కారుతోంది. అలాగే చెవులు కూడా జారి వేలాడుతున్నాయి. అక్కడ కూడా రక్తం స్రవిస్తోంది. తట్టుకోలేకపోయాడు కుంభకర్ణుడు.

**మూర్ఛపోయిన సుగ్రీవుణ్ణి అన్నకు కానుకగా ఇవ్వదలిచి అతన్ని భుజానవేసుకుని లంకానగర వీధుల్లోకి పరుగుదీశాడు కుంభకర్ణుడు. ఆనందించిన రాక్షసస్త్రీలు గంధ పుష్ప లాజలలతో స్వాగతం పలికారు. ఆ స్పర్శకు తేరుకున్న సుగ్రీవుడు కుంభకర్ణుని ముక్కూచెవులూ లాగి వేసి తిరిగి రాముణ్ణి చేరాడు. ఆ పరాజయం తట్టుకోలేక యుద్ధరంగానికి మరలిన కుంభకర్ణుడు ఏం చేశాడు?**

కోపం నసాళానికి అంటింది. అంతే! వెనక్కి మరలాడు. యుద్ధరంగానికి చేరుకున్నాడు. కనిపించిన వానరుణ్ణి చంపుకుంటూ ముందుకురికాడు. ఏ వీరుడూ అతన్ని నిలువరించలేకపోయారు. పైగా ప్రాణాలు కాపాడుకునేందుకు పరుగుదీశారు. పరుగుదీసి, రాముణ్ణి శరణు వేడారు. అతని వెనుక దాగారంతా.

పరుగున వచ్చి రాముణ్ణి చూసి ఆగిపోయాడు కుంభకర్ణుడు. ఈ తేజోవంతుడు రాముడే అనుకున్నాడు. అతను అనుకున్నది నిజం చేస్తూ రాముడు అన్నాడిలా.

"నువ్వు అనుకున్నది నిజమే! నేనే రాముణ్ణి! నీతో యుద్ధానికి సిద్ధంగా ఉన్నాను, రా! నీ ఆట కట్టించి, నిన్ను యమకూపానికి పంపకపోతే నేను రాముణ్ణే కాను."

అంత వీరుడివా? అన్నట్టుగా వికృతంగా నవ్వాడు కుంభకర్ణుడు. యుద్ధానికి ఉరుకుతున్న లక్ష్మణుణ్ణి పట్టించుకోక రాముడితో అన్నాడిలా కుంభకర్ణుడు.

"నీ చేతిలో చావడానికి నేనేమీ విరాధ, కబంధ, ఖర, దూషణ, వాలి, మరీచుడులాంటి వాణ్ణి కాను. యక్ష గంధర్వ అమరులను మారణ హోమం చేసిన కుంభకర్ణుణ్ణి. ముక్కూ, చెవులూ పోగొట్టుకున్నాడు, వీడేం యుద్ధం చేస్తాడనుకోకు. ఇదిగో ముద్గర! దీన్ని పట్టుకుని నీ ముందు నిలబడ్డాను. రా! నువ్వో నేనో తేల్చుకుందాం. ముద్గరతో నిన్నో పెట్టుపెట్టి, నువ్వు చస్తే, మింగుదామని ఉంది. కాచుకో."

రాముడిపైకి ముద్గరను ప్రయోగించబోయాడు. అంత అవకాశాన్ని ఈయలేదు రాముడు. ఏడు బాణాలను అతని పొట్టకు గురిపెట్టి వదిలాడు. పుట్టలోకి పాములు చొచ్చుకున్నట్టుగా ఏడు బాణాలూ కుంభకర్ణుని పొట్టలోనికి చొచ్చుకునిపోయి, విపరీతంగా బాధ కలిగించాయి అతనికి. ఆ బాధ తట్టుకోలేకపోయాడు కుంభకర్ణుడు. పెద్దగా అరిచాడు. అలా అరుస్తూనే వానరసేనమధ్యకు వచ్చాడు. కనిపించిన వానరుణ్ణి కాలితో తొక్కి, చేతితో నలిపి విసిరిపారేయసాగాడు. కొందరిని మింగసాగాడు. ఒక పక్క వానరులను తుత్తునియలు చేస్తూ మరో పక్క పెద్ద కొండను చేతుల్లోకి తీసుకుని దానిని రాముని మీదకు విసిరాడు. అయితే ఆ కొండ ఆకాశంలో ఉండగానే ఏడు బాణాలు ప్రయోగించి దానిని ముక్కలు చేశాడు రాముడు. ఆ ముక్కలు వానరులపై పడి వారికి ప్రమాదం కలుగకుండా ఉండేందుకు ఆ ముక్కల్ని మళ్ళీ మరికొన్ని బాణాలతో పిండి పిండి చేశాడు రాముడు.

లక్ష్మణుడు కలుగజేసుకున్నాడప్పుడు. అతని సూచన మేరకు వానరులు కొండపైకి ఎక్కినట్టుగా కుంభకర్ణుని పైకెక్కారు. గుంపులు గుంపులుగా కాళ్ళపైకి, భుజాలపైకి, తలపైకి ఎక్కి గోళ్ళతో రక్కుతూ, కోరలతో కుంభకర్ణుణ్ణి కొరకసాగారు. బాధను భరించలేకపోయాడతను. పెద్దగా కేకలేస్తూ

ఒంటిని విదిలించుకున్నాడు. ఆ విదిలింపుకి అతని పైనున్న వానరులంతా కిందపడి చెల్లాచెదురయ్యారు. చూశాడది రాముడు. కళ్ళెర్రజేశాడు. ఏడు సాలవృక్షాలనూ, వాలినీ తెగటార్చిన బాణాలను కుంభకర్ణునిపై ప్రయోగించాడతను. వచ్చిన బాణాలను వచ్చినట్టే ముద్గరతో తిప్పి కొట్టాడు కుంభకర్ణుడు. సహించలేకపోయాడది రాముడు. కుంభకర్ణుని బాహువుని గురి చూసి వాయవ్యాస్త్రం ప్రయోగించాడు. ఆ అస్త్రం ముద్గరను పట్టుకున్న కుంభకర్ణుని భుజాన్ని కూల్చింది. అంతెత్తు నుంచి ముద్గరసహా కుంభకర్ణుని చేయి కిందపడుతోంటే చూస్తూ, దానినుంచి చాలా మంది వానరులు తప్పించుకోలేకపోయారు. ఆ చేతికిందపడి మరణించారు. పోయిన చేతిని చూసుకుని బాధపడ్డాడు కుంభకర్ణుడు. పెద్దగా అరిచాడు. రాముణ్ణి పరిమార్చాలి. అతని అంతు చూడాలనుకున్నాడు. ఉన్న చేతితోనే పక్కన ఉన్న పెద్ద చెట్టును పెరికాడు. గురి చూసి దానిని రాముని మీదకు విసిరేంతలో రాముడు ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రానికి కుంభకర్ణుని మరో చేయి కూడా కూలిపోయింది. చెట్టుసహా కూలిపోతున్న ఆ చేతిని చూస్తున్న రాక్షసులకి అది ఎప్పుడు మీద పడ్డదీ తెలియలేదు. పడిందది. దాని కింద వేలాదిమంది రాక్షసవీరులు మరణించారు.

చేతులు పోతేనేమి? కాళ్ళున్నాయి కదా! ఈ కాళ్ళతో రాముణ్ణి కుమ్మికుమ్మి పెడదామనుకున్నాడు కుంభకర్ణుడు. పెద్దగా అడుగులు వేస్తూ రాముని పైకి రాసాగాడు. గమనించాడది రాముడు. రెండు అర్ధచంద్రాకార బాణాలను ప్రయోగించాడు. ఆ బాణాలతో కుంభకర్ణుని రెండు కాళ్ళనూ ఖండించాడు. చేతులు పోయాయి. కాళ్ళు పోయాయి. మొండెం ఒక్కటే మిగిలింది. అయినా రాముణ్ణి వదల్లేదు కుంభకర్ణుడు. నోరు తెరచి అతన్ని మింగేందుకు నేలపై పాకుతూ ముందుకురాసాగాడు. నోరు తెరచి వస్తున్న కుంభకర్ణుని నోటిలో లెక్కకు మిక్కిలిగా బాణాలను వదిలాడు రాముడు. అవన్నీ కుంభకర్ణుని నోట ముళ్ళ చెట్లయి అతన్ని విపరీతమైన బాధకు గురి చేశాయి. దాంతో కుంభకర్ణుడు స్పృహ కోల్పోయాడు. స్పృహ కోల్పోయినా జాలి తలచలేదు రాముడు. విపరీత వేగం కలిగిన బ్రహ్మాస్త్రం వంటి ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. అది దిక్కులు పిక్కటిల్లేలా శబ్దిస్తూ వెళ్ళి పిడుగులా కుంభకర్ణుని కంఠమ్మీద దాడి చేసింది. కుండలాలతో మెరుస్తున్న పర్వత శిఖరంలాంటి అతని శిరస్సును ఖండించింది. ఖండించిన శిరస్సును ఆకాశానికి తీసుకుపోయింది. అక్కణ్ణుంచి లంకలో పడవేసింది. ఆ తల కొండలా పడడంతో అక్కడి రాజభవనాలు నేల మట్టమయ్యాయి. తల లేదు. చేతులు లేవు. కాళ్ళు లేవు. ఉత్త మొండెం నిలిచి ఉండడం కష్టం. కూలిపోయిందది. దాని కింద చాలా మంది రాక్షసులు చిక్కుకుని మరణించారు.

కుంభకర్ణుని మరణంతో భూమి ఒక్కసారిగా జలదరించింది. దేవతల హర్షధ్వనులతో ఆకాశం మారుమోగింది. రాముణ్ణీ, అతని ప్రచండ విక్రమాన్నీ సమస్త వానరులూ, దేవ యక్ష పన్నగులూ కొనియాడారు. వానరవీరులు రాముణ్ణి చుట్టుముట్టి జయజయధ్వానాలు చేస్తోంటే ఆనందించాడు రాముడు. ఖండఖండాలైన కుంభకర్ణుణ్ణీ, జయజయధ్వానాలు అందుకుంటున్న రాముణ్ణీ చూసి రాక్షసులు



విలపించారు. తమ్ముని మరణవార్త అన్న రావణునికి చెప్పేందుకు అక్కణ్ణుంచి పరుగుదీశారు.

రావణుని సమీపించిన రాక్షసులు ఏడుస్తూ కుంభకర్ణుని మరణవార్త వినిపించారతనికి. ఆ వార్త విన్న వెంటనే స్పృహ కోల్పోయాడు రావణుడు. మహాబలశాలి, ధైర్యానికి పెట్టింది పేరైన పినతండ్రి మరణాన్ని మేఘనాథ, నరాంతక, దేవాంతక, అతికాయ, త్రిశిరులు జీర్ణించుకోలేకపోయారు.

కాసేపటికి రావణుడు తేరుకున్నాడు. కన్నీరు పెట్టుకుని కూర్చున్నాడు. అనుకున్నాడిలా.

తమ్ముడూ కుంభకర్ణా! నన్ను ఒంటరిని చేసి వెళ్ళిపోయావా? నువ్వు నా కుడిభుజం అనుకున్నానే! ఆ భుజాన్ని తెగతెంచుకుని వెళ్ళిపోయావా? నా కన్నీరుని ఇక ఎవరు తుడుస్తారయ్యా? నన్నెవరు ఓదారుస్తారు? యక్ష కిన్నెర గంధర్వ దేవతల దర్పం అణచినవాడివి! ఆ దేవేంద్రుని వజ్రాయుధానికి సైతం లొంగనివాడివి, ఆఖరికి రామబాణానికి కూలిపోయావా? నమ్మలేకపోతున్నానయ్యా, నమ్మలేకపోతున్నాను.

శక్తిని కూడదీసుకున్నట్టుగా మెల్లగా లేచి నిల్చున్నాడు రావణుడు. అక్కడి స్తంభానికి ఆనుకున్నాడు. చారికలు కట్టి జారుతున్న కన్నీటిని ముంజేతితో తుడుచుకున్నాడు. మళ్ళీ అనుకున్నాడిలా.

ధైర్యానికి మారుపేరు, మహాబలశాలి తమ్ముడు కుంభకర్ణుడే పోయిన తర్వాత ఇక ఈ లంకెందుకు? ఈ వైభవాలెందుకు? సీత ఎందుకు? శరీరాన్ని అంటిపెట్టుకున్న ఈ ప్రాణాలెందుకు? వ్యర్థం. అన్నీ వ్యర్థం.

అయినా రాముణ్ణి వదలిపెట్టను. అతని అంతు చూస్తాను.

కళ్ళెర్రజేశాడు రావణుడు. అంతలోనే కుంగిపోయాడు మళ్ళీ. విభీషణుణ్ణి తలచుకున్నాడతను. అన్నాడిలా.

తమ్ముడా విభీషణా! ప్రహస్తుడు, కుంభకర్ణుని మరణంతో నీ మాటలే నిజమనిపిస్తున్నాయి. బుద్ధిహీనుణ్ణయి నీ మాటలు పెడచెవిన పెట్టినందుకు తగిన శాస్తే జరిగింది. తప్పు చేశానయ్యా! నా హితం కోరి నువ్వు చెప్పిన మాటల్ని వినిపించుకోలేదు. పైగా నిన్ను నానా మాటలూ అన్నాను. అవమానించాను. కట్టుబట్టలతో వెళ్ళగొట్టాను. ఆ పాపం ఊరకనే పోలేదు. నన్ను కట్టికుడుపుతోందయ్యా! కట్టి కుడుపుతోంది!

బాధను తట్టుకోలేకపోయాడు రావణుడు. ఏం చెయ్యాలో పాలుపోలేదు. స్తంభానికి పదేపదే తల కొట్టుకున్నాడు. నెత్తురోడుతున్నా పట్టించుకోలేదు. కిందపడ్డాడు. రోదిస్తూ చిన్నపిల్లాడిలా పొర్లసాగాడు.

**-అరణి**



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వేడుకలు, ప్రేమానుబంధాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో కుటుంబ సభ్యుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. ఆర్థిక సంస్థలతో పనులకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 19,20 తేదీల్లో దూరంలో ఉన్న ప్రియతముల కలయిక ఆనందం కలిగిస్తుంది. చిన్నారుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 21,22 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రేమానుబంధాలు బలపడతాయి. పొదుపు పథకాలు లాభిస్తాయి. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 23న పెట్టుబడులు లాభిస్తాయి.



## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

బదిలీలు, వృత్తి, వ్యాపారాలు, గృహరుణాలు, మార్పులకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో బదిలీలు, మార్పులు కొంత అసౌకర్యం కలిగిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో శుభపరిణామాలు చోటుచేసుకుంటాయి. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. 19,20 తేదీల్లో బంధుమిత్రులతో ఆనందంగా గడుపుతారు. కుటుంబ సభ్యుల కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. రియల్ ఎస్టేట్ రంగం వారికి శుభప్రదం. 21,22 తేదీల్లో గృహారంభ ప్రవేశాలకు అనుకూలం. కుటుంబ వ్యవహారాలు ఒక కొలిక్కి వస్తాయి. 23న చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు.



## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, పెట్టుబడులు, విద్యా సంస్థలతో పనులు, ఇంటర్వ్యూలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో ఆర్థిక విషయాల్లో అంచనాలు ఫలించకపోవచ్చు. చర్చలు, సమావేశాలు లాభిస్తాయి. 19,20 తేదీల్లో ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. పెద్దలతో సమావేశాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 21,22 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సన్నిహితుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. 23న దూరప్రయాణాలు, ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం.



## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

రుణాలు, పొదుపు పథకాలు, ఫీజుల చెల్లింపులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో పెట్టుబడుల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. గత స్మృతులు నెమరువేసుకుంటారు. బీమా, గ్రాట్యుటీ, పెన్షన్ వ్యవహారాలకు అనుకూలం. 19,20 తేదీల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. సంకల్పం సిద్ధిస్తుంది. 21,22 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. 23న బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు పూర్తవుతాయి.



## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

వేడుకలు, సమావేశాలు, ప్రయాణాలు, ఉన్నత పదవులు ఆర్థిక నిర్ణయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో జనసంబంధాలు విస్తరిస్తాయి. భాగస్వామి వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. ఖర్చులు అధికం. 19,20 తేదీల్లో పెట్టుబడులపై దృష్టి సారిస్తారు. షాపింగ్, క్రయవిక్రయాలకు అనుకూలం. ఆరోగ్యం మెరుగవుతుంది. 21,22 తేదీల్లో సమావేశాలు, వేడుకల్లో పాల్గొంటారు. ఒక సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. సంకల్ప సాధనకు అధికంగా శ్రమించాలి. 23న గౌరవ పదవులు అందుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం.



## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

వృత్తి పరమైన సమావేశాలు, వేడుకలు, సమావేశాలు, సంస్మరణలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ముఖ్య సమాచారం అందుకుంటారు. 19,20 తేదీల్లో వేడుకలు, శుభకార్యాల్లో పాల్గొంటారు. శ్రీవారు, శ్రీమతి అంతరంగం తెలుసుకుని మసలుకుంటారు. 21,22 తేదీల్లో ఉత్సవాలు, సంస్మరణల్లో పాల్గొంటారు. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 23న ప్రయాణాలు, చర్చలు లాభిస్తాయి..



## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వృత్తి, వ్యాపారాలు, ప్రేమానుబంధాలు, సమావేశాలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఆర్థిక




ఆగస్టు 17 నుంచి
ఆగస్టు 23 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ

విషయాల్లో నిదానం అవసరం. ప్రేమానుబంధాలు బలపడతాయి. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 19,20 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. విందు, వినోదాల్లో పాల్గొంటారు. 21,22 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయంలో శుభపరిణామాలు సంభవం. వేడుకల్లో పాల్గొంటారు. స్పెక్యులేషన్లలో నిదానం అవసరం. 23న ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం.



## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

బదిలీలు, మార్పులు, కొత్త ప్రాజెక్టులు, వేడుకలు, జనసంబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. పెద్దల వైఖరిలో మార్పు ఆనందం కలిగిస్తుంది. ప్రముఖుల్ని కలుసుకుంటారు. 19,20 తేదీల్లో సృజనాత్మకంగా వ్యవహరించి వృత్తి వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. ప్రియతములు, చిన్నారుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 21,22 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. పెద్దల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. 23న జనసంబంధాలు విస్తరిస్తాయి.



## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, దూరప్రయాణాలు, ఇంటర్వ్యూలకు సంబంధించిన అంశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ప్రయాణాల్లో నిదానం అవసరం. సమావేశాలు ఫలిస్తాయి. బిల్లులు, చెక్కులు అందుకుంటారు. 19,20 తేదీల్లో బంధుమిత్రుల కలయికతో ఇల్లు సందడిగా ఉంటుంది. బదిలీలు, మార్పుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 21,22 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రేమానుబంధాలు బలపడతాయి. ఒక సమాచారం ఆవేదన కలిగిస్తుంది. 23న ఉద్యోగ, వ్యాపారాల్లో లక్ష్యం నెరవేరుతుంది.

## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)



పెట్టుబడులు, సంస్మరణలు, బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు, షాపింగ్‌లపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో స్పెక్యులేషన్లు, పెట్టుబడుల్లో నిదానం అవసరం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థికపరమైన సమావేశాలు ఫలిస్తాయి. 19,20 తేదీల్లో ఆర్థికపరమైన చర్చలు, ప్రయాణాలు ఫలిస్తాయి. సన్నిహితుల ఆరోగ్యం మెరుగుపడుతుంది. 21,22 తేదీల్లో గృహరుణాలు మంజూరవుతాయి. ఇంటికోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక విషయాలను సమీక్షించుకుంటారు. 23న ఆర్థిక విషయాల్లో అంచనాలు ఫలిస్తాయి.



## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సమావేశాలు, వేడుకలు, జనసంబంధాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ప్రత్యర్థుల నుంచి చికాకులు ఎదురయ్యే అవకాశం ఉంది. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. వేడుకల్లో పాల్గొంటారు. 19,20 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. ప్రియతముల కోసం విలువైన వస్తువులు సేకరిస్తారు. స్పెక్యులేషన్లలో దూకుడు తగదు. 21,22 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. కీలక సమాచారం అందుకుంటారు. కాంట్రాక్టులు అగ్రిమెంట్లు ఫలిస్తాయి. 23న రియల్ ఎస్టేట్ రంగం వారికి శుభప్రదం.



## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, ఆరోగ్యం, బీమా, వృత్తిపరమైన సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. 19,20 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. విందుల్లో పాల్గొంటారు. కొత్త పనుల ప్రారంభానికి అనుకూలం. 21,22 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం లభిస్తుంది. హోటల్, వైద్యం, రిటైల్ రంగాల వారికి శుభప్రదం. 23న ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు.






## స్నేహ సెకండ్ ఇన్నింగ్స్

హోమ్లీ క్యారెక్టర్లకి కేరాఫ్ అడ్రస్‌గా ఉండే స్నేహ పెళ్ళి తరువాత సినిమాలకి దూరమైంది. ఓ బాబు పుట్టిన తరువాత తిరిగి ఇప్పుడు స్నేహ మనసు సినిమాల మీదకు పోయిందట! కాకపోతే తల్లిగా మారిన స్నేహకు హీరోయిన్ క్యారెక్టర్లు రావు. ఈ విషయం స్నేహకు తెలుసు కాబట్టి, ఏ పాత్ర చేయడానికైనా అంటే అక్క, వదిన, భార్య క్యారెక్టర్లు చేయడానికి రెడీగా ఉన్నట్టు దర్శకనిర్మాతలకు చెబుతోందట! ఆ మధ్య 'సన్నాఫ్ సత్యమూర్తి' సినిమాలో ఉపేంద్ర భార్యగా నటించింది. తిరిగి అలాంటి క్యారెక్టర్లు వస్తే చేయడానికి అభ్యంతరం లేదు అంటోంది.



## 'బాహుబలి-2' టార్గెట్ వెయ్యికోట్లు?

అసలు కోటికి విలువ లేకుండా పోతోంది అంటున్నారు సినీ జనాలు. ఒకప్పుడు సినిమా పదికోట్లు వసూలు చేస్తే చాలా గొప్ప. ఇప్పుడు అదే పదికోట్లు వందకు చేరింది. వందకోట్లు వసూలు చేయడం చాలా మామూలుగా చెప్పుకుంటున్నారు. ఇప్పుడు 'బాహుబలి-2' టార్గెట్ వెయ్యికోట్లకు ఫిక్స్ అయిందంటున్నారు. ఇప్పటికే 300 కోట్ల బిజినెస్ అయిన ఈ సినిమా కనీసం వెయ్యికోట్లు సాధిస్తుందని అంచనా వేస్తున్నారట! 'బాహుబలి' బిగినింగ్ 600 కోట్లు వసూలు చేసింది కాబట్టి ఇప్పుడు 'బాహుబలి 2' వెయ్యికోట్లు వసూలు చేయడం పెద్ద కష్టమేమీ కాదని ట్రేడ్ పండితులు అంటున్నారు.

## రజనీకాంత్ మీద సినిమా



ఇది పక్కా న్యూస్. ఈ విషయాన్ని ఆయన కూతురు సౌందర్య స్వయంగా ప్రకటించారు. ఇప్పటికే రజనీకాంత్ కూతురు ఐశ్వర్య ఆయన జీవితం మీద పుస్తకం రాసింది. దాని ఆధారంగా సినిమా తీయబోతున్నారట! ఆయన జీవితంలో తెలియని విషయాలు చాలా ఉన్నాయి. వాటిని అభిమానులకు తెలియజెయ్యడానికే ఈ సినిమా తీయబోతున్నట్లు సౌందర్య చెబుతోంది. అయితే సినిమాకు సంబంధించి మిగతా వివరాలు వెల్లడించడానికి ఇంకా సమయం పడుతుందని అంటోంది.



## వంద కోట్ల రెమ్యునరేషన్?

ఈ స్థాయిలో రెమ్యునరేషన్ తీసుకునే సత్తా భారతీయ సినిమా రంగంలో ఎవరికి ఉంది? అన్న అనుమానం అక్కర్లేదు.

దర్శకధీరుడు రాజమౌళికి ఆ సత్తా ఉంది అంటున్నారు సినీ జనాలు. 'బాహుబలి' కోసం ఆయన 30 కోట్లు తీసుకున్నారు. ఇప్పుడు అదే 'బాహుబలి 2'కి సుమారు వందకోట్లు తీసుకోబోతున్నాడట! అయితే ఇది నేరుగా కాకుండా లాభాల్లో వాటా అడిగినట్లు సమాచారం! ఎటూ ఈ సినిమా ముందు సినిమా కన్నా ఎక్కువ కలెక్షన్లు సాధించడం ఖాయం అన్న సంగతి తెలిసిందే! ఈ లెక్కన ఆయన రెమ్యునరేషన్ వందకోట్లు లేదా అంతకు మించి ఉండవచ్చన్న వార్త టాలీవుడ్‌లో తెగ చక్కర్లు కొడుతోంది.

## హాలీవుడ్‌కి అరవింద్ స్వామి?



'రోజా' సినిమా తలుచుకున్నప్పుడల్లా అరవింద్‌స్వామి కచ్చితంగా గుర్తుకొస్తాడు. హాలీవుడ్ సినిమా హీరోలా ఉండే అరవింద్‌స్వామికి అప్పట్లో చాలామంది ఫ్యాన్ ఫాలోయింగ్ ఉండేది. ఇదంతా గతం. ప్రస్తుతం అరవింద్‌స్వామి సెకండ్ ఇన్నింగ్స్ ప్రారంభించి క్యారెక్టర్ ఆర్టిస్ట్‌గా మారి అటు తమిళంలోనూ, ఇటు తెలుగులోనూ సెలెక్టివ్‌గా సినిమాలు చేస్తున్నాడు. ఇప్పుడు అతగాడికి హాలీవుడ్ నుంచి పిలుపొచ్చింది. ఓ సినిమాలో కీలకమైన పాత్ర కోసం అరవింద్‌స్వామిని అడిగారట! మామూలుగా హాలీవుడ్ సినిమా అనగానే ఎగిరి గంతేసి ఒప్పుకోవాలి. కానీ అరవింద్‌స్వామి మాత్రం ఎటూ చెప్పకుండా నానుస్తున్నాడట!

# ఆ రోజులు మరిచిపోలేను

## -లావణ్య త్రిపాఠి



**'అందాల రాక్షసిగా' కుర్రాళ్ళ గుండెల్లో తిష్ఠ వేసింది. 'సోగ్గాడే చిన్ని నాయనా' అంటూ తన వన్నెచిన్నెలతో అభిమానులను మైమరపించింది. ఇప్పుడు 'శ్రీరస్తు శుభమస్తు' అంటూ ప్రేక్షకులను చక్కిలి గిలిగింతలు పెడుతోంది సొట్టబుగ్గల సుందరి లావణ్యా త్రిపాఠి. కెరీర్‌లో మరో పెద్ద సక్సెస్‌ను సొంతం చేసుకున్న లావణ్య త్రిపాఠితో...**

---

**'శ్రీరస్తు శుభమస్తు' ఇంతటి విజయాన్ని సాధిస్తుందని ఊహించారా?**

షూటింగ్ చేస్తున్నప్పుడే అనిపించింది, ప్రతి సన్నివేశం చాలా బాగా వస్తోందని యూనిట్‌వాళ్ళు కూడా ఇదే మాట అనేవారు. అప్పుడే ఈ సినిమా సక్సెస్ అవుతుందని ఊహించాం. మా ఊహ నిజమైనందుకు చాలా సంతోషంగా ఉంది.

**ఈ సినిమాలో మునుపటి కన్నా యంగ్‌గా కనిపించారు?**

కాలేజీకి వెళ్ళే అమ్మాయి పాత్ర కాబట్టి కొద్దిగా తగ్గితే బాగుంటుందని డైరెక్టర్ పరశురామ్ చెప్పారు. దాంతో రెండు మూడు కిలోల బరువు తగ్గాను. అందుకే మునుపటి కన్నా సన్నగా నాజూకుగా కనిపించాను. ఈ సినిమాలో నా లుక్స్ బాగున్నాయని అందరూ అంటున్నారు. వాళ్ళ మాటలు వింటూంటే సంతోషంగా అనిపిస్తోంది.

**అన్నీ ఒకే తరహా పాత్రలు చేస్తుంటే బోర్ అనిపించడం లేదా?**

బోర్ అని కాదు మొనాటనీ ఫీలవుతోంది మాత్రం నిజం. అన్నీ ఒకే రకమైన పాత్రలే అయినా వాటిల్లోనే కొద్దిగా వెరైటీ చూపించడానికి ప్రయత్నిస్తున్నాను. ఈ సినిమాలో నా పాత్ర కూడా ఇంతకు ముందు నేను చేసిన పాత్రలాగే ఉంటుంది. కానీ డైరెక్టర్ నా రోల్‌ని కాస్త డిఫరెంట్‌గా చూపించారు. సినిమా చూస్తే మీకే అర్థమవుతుంది. దాంతో ఈ సినిమాలో నా పాత్ర గత సినిమాల కన్నా కాస్త భిన్నంగా కనిపిస్తుంది. అసలు పరశురామ్‌గారు ముందు కథ చెప్పినప్పుడు ఎప్పుడూ చేసే పాత్రే కదా అనిపించింది కానీ ఆయన మీద నమ్మకంతో ఈ సినిమా చేశాను. ఇప్పుడు నా పాత్రకు వస్తున్న రెస్పాన్స్ చూస్తుంటే నా అంచనా తప్పలేదని అనిపిస్తోంది.

**అల్లు శిరీష్‌తో ముందే పరిచయం ఉందా?**

లేదు. ఇద్దరం ఒకటే కాలేజీలో చదువుకున్నా నేను తనకన్నా రెండు సంవత్సరాల జూనియర్‌ని. దాంతో నాకు తనతో అంత పరిచయం లేదు. సెట్‌లోనే మొదటి సారి కలుసుకున్నాం. ఓ పెద్ద స్టార్ ప్రొడ్యూసర్ కొడుకన్న ఫీలింగ్ తనలో అస్సలు కనిపించలేదు. అందరితో చక్కగా కలిసిపోతాడు. జోక్స్ అవీ ఎక్కువ వేస్తుంటాడు. నేను జోక్స్‌ని ఎంజాయ్ చేయగలనే తప్ప వేయలేను. దాంతో సెట్‌లో తన అల్లరే ఎక్కువగా కనిపించేది. తను కింద నుంచి పైకొచ్చిన వ్యక్తి కావడంతో సినిమా నిర్మాణంలో సాధకబాధలు అన్నీ తెలుసు. నేను గమనించినంత వరకూ తనది చాలా సర్దుకుపోయే మనస్తత్వం. ఇది అందరికీ ఉండదు



అన్నది నా ఫీలింగ్.

**షూటింగ్‌లో మరిచిపోలేని సన్నివేశం?**

ఈ సినిమాలో కొంత భాగం షూటింగ్ సోనా మార్గ్‌లో చేశారు. అక్కడ మొబైల్ నెట్‌వర్క్ ఏదీ పనిచేయదు. దాంతో అందరం మా సెల్‌ఫోన్లు పక్కన పెట్టేసి తెగ ఎంజాయ్ చేశాం. యూనిట్ మొత్తం ఒక ఫ్యామిలీలాగా కలిసిపోయి అల్లరి చేశాం. అక్కడ చేసినంత ఎంజాయ్ ఇంత వరకూ నేను ఏ సినిమా షూటింగ్‌లోనూ చేయలేదు. ఆ రోజులు నా జీవితంలో మరిచిపోలేని రోజులే!

**ఇటీవలి కాలంలో మరిచిపోలేని ప్రశంస**

ఇటీవలే ఒక స్టార్ డైరెక్టర్‌గారిని కలుసుకున్నాను.. 'లచ్చిందేవికి ఓ లెక్కుంది' సినిమాలో నా నటన ఆ డైరెక్టర్ గారికి బాగా నచ్చిందట! 'లావణ్యా, నీ సినిమాలు అన్నీ చూశాను కానీ, 'లచ్చిందేవికి ఓ లెక్కుంది'లో మాత్రం చాలా అద్భుతంగా చేశావు' అంటూ ఆయన ప్రశంసించారు. అంత పెద్ద డైరెక్టర్ నా నటన మెచ్చుకోవడం అంటే మాటలు కాదు కదా! అయితే ఆ సినిమా కమర్షియల్‌గా పెద్దగా సక్సెస్ కాలేకపోయినా, నటిగా నాకు మంచి మార్కులే పడ్డాయి అనడానికి ఇదే ఉదాహరణ. ఆ డైరెక్టర్ ప్రశంస ఎప్పటికీ మరిచిపోలేను. ప్రేక్షకుల అభిమానమే నిజమైన ప్రశంస. అది నాకు మొదటి నుంచీ లభిస్తూనే ఉంది. నా మొదటి సినిమా 'అందాల రాక్షసి' దగ్గర్నుంచి తాజా సినిమా 'శ్రీరస్తు శుభమస్తు' వరకూ ప్రేక్షకులు నన్ను ఆదరిస్తూనే ఉన్నారు.

**ఎలాంటి పాత్రలు ఇష్టపడతారు?**

నన్ను నేను నిరూపించుకునే పాత్రలు అంటే ఇష్టమే కానీ, అలాంటి పాత్రలు ఇప్పటి వరకూ రాలేదు. ముఖ్యంగా హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమా చేయాలని ఉంది. 'అరుంధతి'లో అనుష్క పాత్రలాంటిదన్న మాట! కాకపోతే అంత బరువైన పాత్రలు చేయడానికి ఇంకా అనుభవం, వయస్సు కావాలి. నేను సినిమాల నుంచి తప్పుకునే లోపు అలాంటి పాత్ర చేయాలన్నది నా కోరిక.

**ఇప్పటి వరకూ చిన్న హీరోలతోనే చేశారు. స్టార్ హీరోలతో చేయలేదెందుకు?**

మీ ప్రశ్నలోనే సమాధానం ఉంది. నేనేమీ స్టార్ హీరోలతో చేయకూడదన్న నిబంధనలేవీ పెట్టుకోలేదు. వచ్చిన సినిమాలు చేసుకుంటూ పోతున్నాను. నా సినిమాలో హీరో ఎవరు? అన్నది కూడా పెద్దగా పట్టించుకోను. కథ బాగుందా? నా పాత్ర బాగుందా? అనే విషయాలను మాత్రమే పట్టించుకుంటాను. స్టార్ హీరోలతో చేయాలని ఎవరికుండదు? కాకపోతే నా విషయంలో ఇంకా ఆ టైము రాలేదనిపిస్తోంది.

**ఖాళీ సమయాన్ని ఎలా గడుపుతారు?**

'సోగ్గాడే చిన్ని నాయనా' తరువాత కొంత కాలం బ్రేక్ తీసుకుందామనుకున్నా. వెంట వెంటనే అవకాశాలు రావడంతో బ్రేక్ విషయాన్ని పక్కన పెట్టేశాను. కొన్ని రోజులన్నా రెస్ట్ తీసుకోవాలన్న ఆలోచన ఉంది. ఈ మధ్య కాలంలో డ్యాన్స్ ప్రాక్టీస్ బాగా తగ్గిపోయింది. రెస్ట్ తీసుకుని ప్రాక్టీస్ మొదలు పెట్టాలని అనుకుంటున్నాను. నా బెస్ట్ ఫ్రెండ్స్ ఇద్దరున్నారు. వారితో కొన్ని రోజులు గడపాలి. ఇలా చాలా ప్లాన్లు ఉన్నాయి. ఇవన్నీ ఖాళీ దొరికినప్పుడు కదా?

**మీరు భోజన ప్రియులని అంటారు నిజమేనా?**

నన్ను చూస్తుంటే అలా అనిపించడం లేదా? నచ్చిన ఐటెం కనపడితే తినకుండా ఉండలేను. ముఖ్యంగా పరోటాలంటే చాలా ఇష్టం. ఉత్తరాదిన పరోటాలకీ, దక్షిణాదిన పరోటాలకి రుచిలో చాలా తేడా ఉంటుంది. ఉత్తరాది పరోటాలంటే చాలా ఇష్టం. చెన్నైలో షూటింగ్ ఉంటే మాత్రం సందీప్ ఇంటి నుంచి వేడి వేడి పరోటాలు వస్తాయి. సందీప్ ఇంట్లో నార్త్ కుక్ ఉన్నాడు. ఉత్తరాది రుచితో పరోటాలు చేసి పంపుతారు. దక్షిణాది టిఫిన్లలో వడ, పెప్పర్ దోశ చాలా ఇష్టం. బ్రేక్‌ఫాస్ట్‌లో దాదాపు ఈ రెండింటిలో ఏదో ఒక వెరైటీ ఉండేలా చూసుకుంటాను. నాన్ వెజ్ జోలికి పోను. వెజిటేరియన్ అంటేనే చాలా ఇష్టం.

**వరుణ్‌తేజతో చేయడం ఎలా ఉంది?**

తనతో 'మిస్టర్' చేస్తున్నాను. తక్కువ మాట్లాడతాడు. ఎక్కువ పని చేస్తాడు. సినిమాకి సంబంధించి తనకు చాలా విషయాలు తెలుసు. బహుశా వాళ్ళ ఫ్యామిలీ అంతా సినిమా రంగానికి చెందిన వారే కావడంతో ఆ నాలెడ్జ్ ఎక్కువ అని నాకు అనిపించింది. ఫ్రెండ్లీగా ఉంటాడు.

**ఈ సినిమాలో హెబ్బాపటేల్ కూడా చేస్తోంది కదా?**

అవును. తనది కూడా ఫ్రెండ్లీ నేచరే! ఎవరితోనైనా చాలా త్వరగా కలిసిపోతుంది.

-చిన్ని

## అందరికీ ఆమె కావాలట!

ఇందులో విపరీతార్థం ఏమీ లేదు. ఇంతకీ ఆమె ఎవరో చెప్పలేదు కదూ! రెజీనా... చిన్న హీరోలందరికీ రెజీనా బెస్ట్ ఆప్షన్ అయిపోయింది. 'నక్షత్ర', 'జ్యో అచ్యుతానంద' సినిమాలు చేస్తోంది. తాజాగా అవసరాల కూడా తన ఓటు రెజీనాకే వేశాడు. మంచు మనోజ్ కూడా ప్రగ్యా ప్లేసులో రెజీనా ఎలా ఉంటుంది? అన్న ఆలోచనలో ఉన్నాడట! ఇలా చిన్న హీరోలందరూ రెజీనా వెంట పడుతుంటే స్టార్ హీరోలు ఈమె వైపు కన్నెత్తి కూడా చూడడం లేదట! ఇదే బాధగా ఉంటోంది అంటోంది రెజీనా. రకుల్ స్టార్ హీరోలతో జతకడుతుంటే తనకు ఇంకా ఆ అవకాశం రాలేదే! అన్న దిగులు రెజీనాలో బాగా పెరిగిపోతోందట. రకుల్ లాగా పెద్ద పెద్ద ఆఫర్లు రావాలంటే రెజీనాకు అర్జంటుగా ఒక భారీ సక్సెస్ కావాలి అంటున్నారు సినీ జనాలు. అయినా ఈ విషయం రెజీనాకు తెలియదా? అని కూడా అంటున్నారు.





# ఇప్పటి నటులదంతా స్మార్ట్ వర్కే!

## -రాగిణి

**వెండితెర, బుల్లితెర నటి రాగిణి. తన నాట్య ప్రతిభతో దేశవిదేశీ ప్రేక్షకుల్ని మెప్పించిన కళాకారిణి. బుల్లితెరపై అన్ని భాషల్లోనూ సుమారు 500 సీరియల్స్‌లో నటించి నంది అవార్డుల పంట పండించుకోవడమే కాదు, దాదాపు 200 చిత్రాల్లో నటించారు. ఇప్పటి నటులదంతా స్మార్ట్ వర్కే అంటారామె. అనుభవజ్ఞులైన నటులకు అవకాశాలిస్తే హిట్లు కొట్టొచ్చు అని చిన్న బడ్జెట్ చిత్రాలవారిని కోరుతున్న రాగిణి ఇంటర్వ్యూ ఈ వారం....**

కర్ణాటక రాష్ట్రం రాయచూర్‌జిల్లా జెలిహల క్యాంపు గ్రామంలో పుట్టాను. మా నాన్నగారు చిట్టూరి కృష్ణారావు. అమ్మ సావిత్రమ్మ. మాది పెద్ద కుటుంబం. మేం పదమూడుమంది పిల్లలం. నేను మా ఇంట్లో పన్నెండో సంతానం. నలుగురు అన్నదమ్ములున్నారు. సంతానం ఎక్కువ కావడం వల్ల నేను చదువు కోలేకపోయాను. అదొక్కటే నా మనసును ఎప్పుడూ తొలిచేస్తూ ఉంటుంది. అయినా అన్ని భాషల్లో ప్రావీణ్యం సంపాదించుకున్నాను. ఇటు తెలుగు, తమిళం, కన్నడం, హిందీ భాషల్లో సినిమాలు, సీరియల్సు చేశాను. చేస్తున్నాను. మా ఆరో అక్క పేరు అనసూయ. ఆమె దివంగతురాలు కావడంతో, ఆవిడ పిల్లల్ని నేనే పెంచి పెద్దచేసి పెళ్ళిళ్ళు చేసి బాధ్యత వహిస్తున్నాను.

### నటి కృష్ణవేణి మా అక్క

మా నాలుగో అక్కయ్య నటి కృష్ణవేణి. నా పన్నెండో యేట నుండీ నేను ఆమె దగ్గరే ఉండేదాన్ని. అప్పటికే ఆమె నటిగా రాణిస్తోంది. 'వేమన' సింగిల్ ఎపిసోడ్ చేస్తున్నప్పుడు దూరదర్శన్‌లో మా అక్క కృష్ణవేణికి కూతురుపాత్రలో ఒక యువతి అవసరం వచ్చింది. సెట్లో వాళ్ళు మా అక్కను అడిగినప్పుడు ఆమెకు వెంటనే నేను గుర్తుకువచ్చాను. అలా అవకాశం వచ్చింది. అప్పటికే నేను వెంపటి చినసత్యం గారి దగ్గర కూచిపూడి నాట్యం అభ్యసిస్తున్నాను. నటీమణులు మంజుభార్గవి, రమ్యకృష్ణ, సులక్షణ వీళ్ళంతా నాకు సీనియర్స్. వాళ్ళు ప్రాక్టీస్ చేస్తున్నప్పుడు వారి భంగిమలు చూసి ఆ ట్రిక్స్ నేర్చుకునేదాన్ని. తర్వాత హైదరాబాద్ చేరుకున్నాను.

### టీవీ సీరియల్స్

1990 ఉగాదిరోజు దూరదర్శన్‌లో 'వేమన' సింగిల్ ఎపిసోడ్ షూటింగ్‌లో పెళ్ళిచూపులు సీన్‌తో మొదటి సారి కెమెరా ముందుకు వచ్చాను. అక్కడ చుట్టూ మనుషులు, ఆ లైట్లు, కెమెరా అన్నీ చూసేసరికి ఏడుపు ముంచుకొచ్చింది. పెళ్ళిచూపుల్లో అమ్మాయి నచ్చ లేదు అని చెప్పినప్పుడు నేను ఏడుస్తూ వెళ్ళాలి. అదీ సీన్. ఆ షాట్ చాలా బాగా వచ్చింది. అది నా కెరీర్‌లో మొదటిమెట్టు. ఆ తర్వాత 'తామరపూలు' టెలీఫిల్మ్‌లో నటించాను. దూరదర్శన్‌లో 1999లో ప్రసారమైన ఈ సీరియల్‌కు నంది అవార్డు లభించింది. ఇది నా నట ప్రస్థానానికి నాంది పలికింది. ఇలాంటి అవార్డులు ఎన్నో సంపాదించుకోవాలనే పట్టుదలతో 'ఎండమావులు', 'వరుడు కావాలి', 'రాధా మధు', 'మైనేమ్ ఈజ్ మంగతాయారు' ఇలా ఎన్నో సీరియల్స్‌లో నటించి తెలుగు ప్రేక్షకులకు బాగా దగ్గరయ్యాను. 'అమృతం' సీరియల్ హాస్యజల్లులతో ఎందరినో ఆకట్టుకుంది. ఇలా బిజీగా ఉన్న సమయంలో సినిమా అవకాశాలు వచ్చాయి. బుల్లితెరపై 'తరంగిణి', శివరంజని, ఆరాధన, వంశీ సీరియల్స్ నాకు మంచి పేరు తెచ్చిపెట్టాయి. దాదాపు 500 సీరియల్స్‌కు పైగా నటించాను. బుల్లితెరపై నా నటనకుగాను, రాష్ట్ర ప్రభుత్వం నుండి ఇప్పటి వరకు నాలుగు నంది అవార్డులు లభించాయి. తామరపూలు (1999), సీతారామ్ చిటపటలు' (2007), 'నాన్న' (2007), 'అమ్మమ్మ డాట్‌కామ్' (2008) చిత్రాలకు ఈ అవార్డులు లభించాయి. ఇంకా ఢిల్లీ తెలుగు అకాడమీ, సావిత్రి స్మారక అవార్డు సహా పలు అవార్డులు అందుకున్నాను.

### రామ్‌గోపాల్‌వర్మగారి పరిచయం

నటుడు ఉత్తమ్ నన్ను రామ్‌గోపాల్‌వర్మగారికి పరిచయం చేశారు. నీ సీరియల్స్ చూస్తూ ఉంటాను, చాలా బాగా నటిస్తుంటావు. నా రాబోయే చిత్రం 'గాయం'లో నటిస్తావా? అని అడిగారు. ఆయనకు కృతజ్ఞతలు చెప్పి, 'నటిగా ప్రూవ్ చేసుకుంటాను,

వెండితెరకు నన్ను పరిచయం చేస్తున్న మిమ్మల్ని ఎన్నడూ మరిచిపోను' అనగానే ఆయన నవ్వుతూ, 'ఇప్పుడు అలానే అంటారు, నాలుగు హిట్లు వచ్చాక మరిచిపోతారు' అన్నారు. అలాంటిదేం ఉండదు సార్, నాకు తెలుసు సార్, మీరు వెండితెరకు చాలామందిని పరిచయం చేశారనే సంగతి వాళ్ళందరూ మరిచిపోతారేమోగానీ నేను మాత్రం మరిచిపోను సార్ అన్నాను. అనగానే ఆయన నవ్వులు కురిపించారు. 1993లో 'గాయం' విడుదలైంది.

అన్నపూర్ణా స్టూడియోస్‌వారి 'తీర్పు' నా రెండవ చిత్రం. అక్కినేనిగారు నటించిన చిత్రంలో నేను నటించడం నిజంగా నా అదృష్టంగా భావిస్తాను. ఆయనలో ఒక ప్రత్యేకత ఉంది. 'అన్నపూర్ణా స్టూడియోస్‌లో నాకు వచ్చిన అవార్డులు, సన్మానాలు, సత్కారాల ఎగ్జిబిషన్ ఉంది చూశావా? రాగిణీ, చూడకపోతే చూడు. ఎందుకంటే భవిష్యత్తులో నీక్కూడా అలాంటి అవార్డులు ఎన్నో రావాలని అవి చూడగానే నీకూ అనిపిస్తుంది, ఇది నా గొప్పకోసం చెప్పడం లేదు' అన్నారు అక్కినేనిగారు. నాకు చాలా సంతోషం కలిగి వెంటనే వెళ్ళి అవార్డుల ఎగ్జిబిషన్ చూశాను. ఆ మహానటుడు చెప్పిన మాటలు నాకు ఎప్పుడూ గుర్తుకువస్తూనే ఉంటాయి.

పవిత్రబంధం, పెళ్ళిచేసుకుందాం, గణేష్, స్నేహంకోసం, ఓసి నా మరదలా, రామసక్కనోడు వంటి నేను నటించిన చిత్రాలన్నీ జనం మెచ్చిన చిత్రాలే. రామసక్కనోడు చిత్రంలో నాది బ్రాహ్మణ యువతి పాత్ర. మల్లికార్జునరావుకు జోడీ. ఎక్కడకు వెళ్ళినా అందరూ నన్ను గుర్తుపట్టి ఆ పాత్రను గుర్తుచేస్తూ ఉంటారు. ఈ చిత్రంలో నా కామెడీపాత్రకు శ్రీకాళహస్తివారి భరతముని అవార్డు లభించింది.

## హిందీ చిత్రాలు

'పవిత్రబంధం' చిత్రాన్ని 'హమ్ ఆప్‌కే దిల్‌మే రహతే హై' (2007)గా రీమేక్ చేశారు. అనిల్ కపూర్, కాజోల్, అనుపమ్‌ఖేర్ నటించారు. సురేష్ ప్రొడక్షన్స్ బ్యానర్‌పై తీసిన 'సంతాన్' చిత్రంలో నీలమ్‌కి ఫ్రెండ్‌పాత్రలో నటించాను. ఈ చిత్రంలో జితేంద్ర, మౌసమీచటర్జీ నటించారు. దాసరి నారాయణరావుగారు దర్శకత్వం. సూరిగాడు





చిత్రాన్ని హిందీలోకి, సింహాద్రి చిత్రాన్ని తమిళ్‌లో గజేంద్ర పేరిట నిర్మించారు. ఇతరభాషల్లో వచ్చిన ఈ చిత్రాల్లో నేను నటించాను. ఇవన్నీ నాకు నచ్చిన చిత్రాలే. కన్నడ చిత్రాల్లో కూడా నాకు మంచి పేరు వచ్చింది. ఉపేంద్ర హీరోగా నటించిన 'సాధుకోకిల', 'రా' చిత్రాల్లో నేను నటించాను. ముత్యాల సుబ్బయ్య, సాగర్, రాజమౌళి వంటి ప్రముఖ దర్శకుల చిత్రాల్లో నటించాను. మారుతీగారి దర్శకత్వంలో విడుదలైన 'ఈరోజుల్లో' చిత్రంలో నా పాత్ర నాకు ఎంతో నచ్చింది. ప్రేక్షకులు ఎంతో బాగా ఆ పాత్రను రిసీవ్ చేసుకున్నారు.

ప్రస్తుతం వెంకటేష్, నయనతారల చిత్రం 'బాబు బంగారం', 'పంచదార పచ్చిమిర్చి' కామెడీ చిత్రాల్లో నటిస్తున్నాను.

## విదేశాల్లో నాట్య ప్రదర్శనలు

నటీమణి జయలలితతో కలిసి విదేశాల్లో ఎన్నో నాట్య ప్రదర్శనలు చేశాను. ఎన్నో అవార్డులు, ఉన్నతాధికారుల అభినందనలు అందుకున్నాను. తనికెళ్ళ భరణి, ఏవీఎస్‌గార్లతో దుబాయ్, సింగపూర్‌లలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలకు వెళ్ళాను. దాదాపు 1000కి పైగా నాట్య ప్రదర్శనలు ఇచ్చాను.

## సౌందర్యకు, మాకు తప్పిన కారు ప్రమాదం

మాయలోడు చిత్రంలో నటి సౌందర్యకు స్నేహితురాలి పాత్ర నాది. దర్శకులు ఎస్వీ కృష్ణారెడ్డిగారు. ఈ సినిమాలో నేను కారు డ్రైవింగ్‌చేసే సీన్ ఉంది. డ్రైవింగ్ పర్‌ఫెక్ట్, ఎక్సలెంట్ అని మెచ్చుకున్నారు. రాజేంద్రప్రసాద్, గుండు హనుమంతరావుగారు మా కారుకు అడ్డంగా వచ్చే సీన్ ఉంటుంది. ఈ షాట్ తర్వాత మరో షాట్‌కి రెడీ కావడానికి కొంచెం రిలాక్స్ ఇచ్చారు మాకు. దాంతో అందరం కాఫీ తాగివద్దామని కారులో కూర్చున్నాం. సౌందర్య చకచకా వచ్చి డ్రైవింగ్ సీట్లో కూర్చుంది. డ్రైవర్ ఆమె పక్కన కూర్చున్నాడు. ఆమెకు డ్రైవింగ్ వచ్చునేమో అనుకున్నాడు. డ్రైవింగ్ రాకపోయినా ఆమె కీస్ తిప్పి కారు స్టార్ట్‌చేసి యాక్సిలేటర్ తొక్కింది. జీప్‌కారు స్పీడుగా బయలుదేరింది. ఏం జరుగుతోందో మాకే అర్థం కాలేదు. అసలు డ్రైవర్‌కి కూడా ఏం చేయాలో తోచలేదు. గిర్రుగిర్రున మెలికలు తిరుగుతూ ఫాస్ట్‌గా పోతోంది కారు. సౌందర్యకి బ్రేక్ దొరక్క యాక్సిలేటర్‌నే తొక్కుతోంది. దాంతో డ్రైవర్ చాకచక్యంగా బ్రేక్‌మీద కాలువేసి బండిని అదుపులోకి తీసుకున్నాడు. ఈ లోగా నేను మా అక్కకొడుకును కిటికీలోంచి బయటకు నెట్టేశాను. కారు వెళ్ళి ఒక కొండ చివర ఆగింది. ఒక్క క్షణం ఆలస్యమైతే, మా ప్రాణాలు గాల్లో కలిసిపోయేవి. చావుతప్పి కన్ను లొట్టపోయినంత పనైంది. ఆ ఘటనతో సౌందర్య బిత్తరపోయింది. ఆమెకు స్పృహ తప్పినంత పనైంది. సౌందర్య ఆ రోజు యాక్సిడెంట్ నుంచి సురక్షితంగా బైటపడింది. కానీ ఆ తర్వాత ఆమె ఎక్కిన హెలికాప్టర్ ప్రమాదంలో మరణిస్తుందని ఎవరికి తెలుసు? ఇలా మేం అందరం ప్రాణాలతో ఆ రోజు బైట పడ్డాం. కారు తాళాలు కారుకే ఉంచేసిన డ్రైవర్ని అందరం మూకుమ్మడిగా తిట్టాం. ఉద్యోగం పోతుంది మేడమ్, ఈ విషయం సార్‌కి చెప్పకండి అనడంతో ఆ తర్వాత ఈ విషాదకథకు వినోదంతో తెరపడింది. తర్వాత సౌందర్య కారు డ్రైవింగ్ నేర్చుకుంది. కానీ ఈ విషయం తలుచు కున్నప్పుడల్లా 'అమ్మో కారు అంటే భయం అనిపించేది.

## స్మార్ట్ వర్క్

గతంలో నటులు ఫీల్ రావడం కోసం హార్డ్ వర్క్ చేసేవారు. ఇప్పటి నటులు స్మార్ట్‌వర్క్ చేస్తున్నారు. ఆనాటి హార్డ్‌వర్క్ ఇప్పుడు కనిపించట్లేదు. ఇప్పుడున్నన్ని సౌకర్యాలు అప్పుడు లేవు. ఈ తరం దర్శకులు, నిర్మాతలు ప్రెజెంట్ ట్రెండ్‌కు అనుగుణంగా చిత్రాలు నిర్మిస్తున్నారు. ముఖ్యంగా పెద్ద సినిమాలు సరిగ్గా ఆడక పోవడంతో వారు నష్టాల్లో కూరుకుపోతున్నారు. ఇందులో ఎవరినీ ఏమీ అనేది ఉండదు. నిర్మాణానికి ముందు కథా సారాంశంపై క్షుణ్ణంగా పరిశీలనలు జరగాలి. భాషరాని వారిని తీసుకొచ్చి వారికి సకల సౌకర్యాలు కల్పించి నటింపజేయడం కంటే ఇక్కడున్న అనుభవజ్ఞులైన నటులకు అవకాశాలు ఇస్తే తప్పకుండా సినిమాలు విజయవంతం అవుతాయి. ముఖ్యంగా చిన్న బడ్జెట్ చిత్రాలవారినే నేనీ కోరిక కోరుతున్నాను.

*-కె.హరనాథ్*

*సెల్: 97035 42598*

# ఇవన్నీ నిజాలే!

### ఎల్లలు లేవు

- స్కాట్లాండ్‌లో పుట్టి, ఈస్టిండియా కంపెనీ ఉద్యోగిగా మన దేశానికి వచ్చాడు కల్నల్ కాలిన్ మెకంజీ. ఆంధ్ర దేశ చరిత్ర- సంస్కృతిపై పరిశోధన చేశాడు. అమరావతీ బౌద్ధ స్తూపం ఉనికి, గొప్పతనాన్ని చాటి ఆంధ్రుల ప్రపంచ ఖ్యాతికి దోహదపడ్డాడు!

•••

- అమెరికాలోని ప్రతి నలుగురు మహిళల్లో ఒకరు భర్త లేదా బాయ్ ఫ్రెండ్ వల్ల హింసకు గురవుతున్నారు.

•••

- ప్రతీ ఐదు జంటల్లో ఒక జంట వారంలో ఒక్కసారి కూడా చుంబించుకోకుండానే శృంగారంలో పాల్గొంటున్నారు.

•••

- రోమన్ చక్రవర్తి గేయస్ తన ప్రియమైన గుర్రానికి సెనేటర్ హోదా కల్పించాడు!

•••

- ప్రపంచవ్యాప్తంగా 15-44 మధ్య వయస్కులైన మగవారే ఎక్కువగా హత్యలకు, ఆత్మహత్యలకు గురవుతున్నారు.

•••

- హిమయుగంలో జీవించిన బ్రిటన్‌వాసులు, మనుషుల పుర్రెలను కప్పులుగా ఉపయోగించుకునేవారు.

•••

- రోమన్లు తమ పళ్ళు తెల్లగా శుభ్రంగా తోముకోవడానికి మనిషి యూరిన్‌ను మౌత్‌వాష్‌గా ఉపయోగించేవారు!

•••

- ప్రతి మనిషీ తన జీవితకాలంలో ముద్దు పెట్టుకోవడానికీ, ముద్దు తీసుకోవడానికీ 20,160 నిమిషాలు కేటాయిస్తాడట! నమ్మశక్యంగా లేదు కదూ!

•••

- బ్లాక్ స్పైడర్ మంకీలు వృక్షాలమీదే కాలం గడుపుతాయి. చెట్లు, పుట్టలు ఎక్కడంతోనే రోజంతా గడుపుతాయి. వాటి ముఖాలు, గోళ్ళు బల్లపరుపుగా ఉంటాయి.

•••

- ప్లూటో గ్రహం మీదకు విమానంలో ప్రయాణించి వెళ్ళాలంటే 800 సంవత్సరాల కంటే ఎక్కువ సమయం పడుతుంది!

•••

- ఇంగ్లీష్ సముద్ర పర్యాటకుడు జేమ్స్‌కుక్ 1779లో హవాయి ద్వీపానికి చేరుకున్నాడు. ఆ సమయంలో అక్కడ కామునిపున్నమి తరహాలో ఉత్సవం జరుగుతోంది. కుక్ రాకను చూసి సాక్షాత్తూ ఆ మన్మథుడే తమ 'లోనో' ఉత్సవానికి వేంచేశాడని వారు భ్రమించారు!

•••

- గృహ హింస సంబంధమైన సమస్యల కారణంగా, యేటా 80 లక్షల వేతన పనిదినాల నష్టం వాటిల్లుతోంది. ఇది దాదాపు 32 వేల పూర్తిస్థాయి ఉద్యోగాల వేతనానికి సమానం.

-చిన్నారి

# సుధామ పదగారడి-275

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | | 3 | 4 | | 5 |
| | | | | 6 | | | | |
| 7 | | | | | | 8 | | |
| | | | 9 | | 10 | | | |
| | 11 | | | | 12 | | | |
| 13 | | 15 | 14 | 15 | | | | 16 |
| 17 | | 18 | | | | 19 | | |
| | | | | | | | | |
| 20 | | | | | 21 | | | |

## ఆధారాలు

### అడ్డం

1. స్థానికత, లోకల్ (4)
3. సాహిత్య, సంగీత, లలిత కళలకు కేంద్రంలో వేర్వేరుగా వున్నది (4)
7. అటుగా వచ్చిన ఆదరణ ముందే పోయింది (3)
8. కాలిన పిడక (3)
9. కూతురు (3)
11. సుప్రసన్న ముందే అంతర్ధానం (3)
12. ఇది ఆలోచనామృతం అన్నారు (3)
14. తీపి సరుకు ఏదయినా (3)
17. పసిపిల్లల ఆరోగ్యానికై క్రమం తప్పక వేయించాల్సింది (3)
19. వేడుక, సరదా (3)
20. అటుగా ఎవరి దారి వారిదే (4)
21. పూవు వంటి శరీరము గలది, స్త్రీ (4)

### నిలువు

1. ముంగిలి (4)
2. బాలకృష్ణుని పెంచిన తల్లి (3)
4. స్త్రీల కంటికి అందం, ఐటెక్స్ (3)
5. దేవునికి ముడుపు కట్టుటకై ఎత్తి వుంచినది (4)
6. సంధ్యావందన దేవత (3)
9. పౌర్ణమి (3)
10. కటికవాడు (3)
13. కోటీశ్వరరావుకు స్త్రీ మూర్తి నామము (4)
15. బెంగాలీల్లో ఓ ప్రముఖ వంశం (3)
16. అనిరుద్ధుని భార్య రాణిగా (4)
18. కాకులు... తో పోల్చబడినవారు తిరగబడ్డారు (3)
19. మరణ దండన అమలు పరిచేవాడు (3)

### పదగారడి-274 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| కే | రిం | త | | కో | క | | మీ | సిం |
| త | | జెం | డా | పం | డు | గ | | గ |
| కి | కా | | గు | | పా | | కా | రం |
| | మ | బ్బు | | ఆ | రా | వ | ళి | |
| ను | ద | | | క | | | కా | ష్టం |
| | సి | న్న | గా | లి | | పం | ద | |
| రి | వు | | ను | | శ | | వి | రి |
| బు | | అ | గ | రు | బ | త్తి | | గ్గిం |
| కే | న్న | య్య | | మే | ర | | లా | గు |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

# ఆమెతో నాకు సంబంధం లేదు

## -మన్నారా చోప్రా



**మన్నారా చోప్రా... ఈ పేరు టాలీవుడ్‌కి కొత్తేం కాదు. రెండు సంవత్సరాల క్రితం 'ప్రేమా గీమా జాన్తా నై' అంటూ తెలుగు వారిని పలకరించినా జాన్తా నై అనేశారు. దాంతో కొద్దిగా ఎక్కువ గ్యాపే తీసుకుని 'జక్కన్న'తో అభిమానుల ముందుకు వచ్చింది. ఈ సారి 'నో' అనకుండా 'ఎస్' అనేశారు. 'జక్కన్న'తో వరుస సినిమాలు చేస్తూ బిజీగా ఉన్న మన్నారాతో...**

---

**'జక్కన్న', 'తిక్క' రెండు సినిమాల విజయాన్ని బాగా ఎంజాయ్ చేస్తున్నట్టున్నారు?**

రెండు సంవత్సరాల తరువాత విజయం అన్న పదం నా కెరీర్‌లో విని పించింది. ఈ సినిమాల విజయాలు నా మీద నాకే కాదు దర్శక నిర్మాతలకి కూడా నమ్మకాన్ని కలిగించాయి. ఇంతటి విజయాన్ని అందిం చిన ప్రేక్షకులకి థాంక్స్

**తొలి సినిమా తరువాత ఇంత గ్యాప్ ఎందుకు తీసుకున్నారు?**

'ప్రేమా గీమా జాన్తా నై' తరువాత బాలీవుడ్‌లో ఒప్పుకున్న సినిమా షూటింగ్‌కి వెళ్ళిపోయాను. అక్కడ సినిమా చేస్తుండగానే కోలీవుడ్‌లో మరో రెండు ఆఫర్లు రావడంతో బాలీవుడ్ నుంచి నేరుగా కోలీవుడ్ వెళ్ళిపోయాను. దాంతో తెలుగులో గ్యాప్ వచ్చింది. ప్రస్తుతం రెండు సినిమాలు విడుదల కాగా ఓ సినిమా విడుదల కావలసి ఉంది. ఈ సినిమాలో నన్ను చూసి ప్రేక్షకులు థ్రిల్ అవుతారు. పూరీ సార్ నా పాత్రను అలా డిజైన్ చేశారు. తెలుగుప్రేక్షకులు నన్ను ఎలా చూడాలనుకుంటున్నారో అలాంటి పాత్రలే చేశాను. చేయబోతున్నాను.

**'తిక్క'లో బ్రెజిల్ మోడల్‌తో చేయడం ఎలా ఉంది?**

తెలుగు మాట్లాడే విషయంలో తను నాకన్నా చాలా బెటర్. పట్టుపట్టి తెలుగు నేర్చుకుంది. నేనూ నేర్చుకుంటున్నాను కానీ అంత స్పీడ్ కాలేదు. తనది చాలా ఫ్రెండ్లీ నేచర్. ఎవరితోనైనా సరే ఇట్టే కలిసిపోతుంది. ఈ సినిమాతో తనూ నేనూ మంచి స్నేహితులమైపోయాం.

**సాయిధర్మతేజతో చేయడం ఎలా ఉంది?**

తనతో చేయడం చాలా సరదాగా ఉంటుంది. షూటింగ్‌లో తను టెన్షన్ పడడు, తోటి వారిని టెన్షన్ పడనీయడు.

**అక్క ప్రియాంకాచోప్రా ప్రభావం మీమీద ఉందంటారా?**

అక్క ఇన్‌స్పిరేషన్‌తో వచ్చినా సినిమాల పరంగా తనతో నాకు ఎలాంటి సంబంధం లేదు. తన పేరు ఉపయోగించుకుని అవకాశాలు దక్కించుకోవడం నాకు ఇష్టం లేదు. నేను సినిమాల్లోకి వచ్చిన తరువాత తనను కలిసింది చాలా తక్కువ. తను హాలీవుడ్ సినిమాలతో బిజీ కావడంతో తనను కలవడానికి అస్సలు కుదరడం లేదు. 'జక్కన్న' చూపించాలని అనుకున్నాను. కానీ తను ఇక్కడ లేకపోవడంతో కుదరలేదు.

**నిజజీవితంలో మన్నారా ఎలా ఉంటుంది?**

చాలా పట్టుదలగల అమ్మాయిని. ఏదైనా పని చేద్దామనుకున్నానంటే ఆ పని పూర్తయ్యేంత వరకూ నిద్రపోను.

**సినిమాల్లోకి వస్తానంటే మీ కుటుంబ సభ్యులు ఎలా రియాక్ట్ అయ్యారు?**

మా ఇంట్లో ఆడపిల్లలకి స్వేచ్ఛ ఎక్కువ. నువ్వు ఏ కెరీర్‌ని ఎంచుకుంటావో నీ ఇష్టం అని నాకే వదిలేశారు. సినిమాల్లోకి రావడం అన్నది పూర్తిగా నా ఇష్టం మీదనే జరిగింది. ఉత్తరాది కన్నా దక్షిణాదిలో బిజీ అవుతున్నందుకు వాళ్ళు కూడా హ్యాపీగా ఫీలవుతున్నారు.

**పేరు మార్చుకున్న తరువాతే కలిసి వచ్చినట్టుంది?**

నిజమే. మన్నారా చోప్రాగా పేరు మార్చుకున్న తరువాతే నాకు అవకాశాలు వస్తున్నాయి. పేరు మార్పు బాగానే కలిసి వచ్చింది.

**ఎలాంటి సినిమాలు చేయాలనుకుంటున్నారు?**

డ్యాన్స్ బేస్డ్ సినిమా చేయాలని ఉంది. నాకు డ్యాన్స్ అంటే చాలా ఇష్టం. ఏ భాషలో ఇలాంటి అవకాశం వచ్చినా తప్పకుండా చేస్తాను.

**ఎక్కువగా ఇద్దరు హీరోయిన్ల సినిమాలే చేస్తున్నట్టున్నారు?**

ప్లాన్ చేసుకుని చేయడం లేదు. అలా కలిసి వస్తోంది అంతే! ఎంత మంది ఉన్నా నా పాత్ర ఏమిటి? అన్నది మాత్రమే చూస్తాను.

**తెలుగులో ఒప్పుకున్న సినిమాలు?**

వివరాలు త్వరలోనే చెబుతాను.

-భరత్ కుమార్

mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథనిలయం

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం,
రాజమహేంద్రవరము - 533101.
ఫోన్ : 0883 - 2462565
e-mail : mohanpublications@gmail.com

# మావద్ద లభించు గ్రంథములు



## వ్రత కథలు - పూజలు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ. | 10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | | 30-00 |
| 5. | వరలక్ష్మీవ్రతం | | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | | 10-00 |
| 7. | త్రినాథ వ్రతం(కలర్) | | 10-00 |
| 8. | త్రినాథవ్రతం(సాదా) | | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | | 10-00 |
| 11. | వైభవలక్ష్మీవ్రతం ఫోటో యంత్రంతో | | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీవ్రతం (కామేశ్వరీపాటతో) | | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | | 30-00 |
| 18. | శివదీక్ష | | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | | 10-00 |
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | | 36-00 |

| | |
|---|---|
| 31. లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. శివపూజ | 10-00 |
| 36. వీరభద్ర పూజ | 10-00 |
| 37. ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. రామదేవుని కథ | 10-00 |
| 41. శివదేవుని కథ | 10-00 |
| 42. లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. పార్వతీకల్యాణం | 25-00 |
| 52. సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. అష్టనాగపూజ | 36-00 |
| 55. పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. హనుమద్ వ్రతం | 36-00 |
| 61. పంచాయతన పూజ | 63-00 |
| 62. 28 వ్రతములు | 120-00 |
| 63. కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. గోమాత | 40-00 |



# స్తోత్రాలు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |

